తెలుగులో నవలా విమర్శకు శ్రీకారము చుట్టినవారు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు వారు రచించిన వివేకచంద్రికా విమర్శనము 8 క్లో ప్రకటితమైనది కందుకూరి వీరేశలింగం పంతులు విరచితమైన రాజశేఖర చరిత్రకు నామాంతరమే వివేక చంద్రిక క్రీ శ 878 లో ప్రచురితమైన రాజశేఖర చరిత్రకు ప్రథమాంధ్ర నవలగా ప్రఖ్యాతి గాంచినది ఇది ఆంగ్ల భాషలోనున్న వికార్ ఆఫ్ వేక్ఫీల్డు (V car of Wakef e d) ననుసరించి వ్రాయబడినది ఇందులో సాంఘిక దురాచారములను పంతులుగారు హేళన చేసియున్నారు

క్రీ శ 893 లో ఖండవల్లి రామచంద్రుడుగారు ధర్మవతీ విలాస మను నవలను ప్రచురించిరి తరువాత మాలతీమాధవము లక్ష్మీ సుందర విజయము అను రెండు నవలలు ప్రచురించిరి ఈ మూడు నవలలు ఎలక్ట్రాంచి చింతామణి అను పత్రికలో ప్రకటింపబడినవి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు క్రీ శ 894 లో రామచంద్ర విజయము 896 లో హేమలత 897 లో అహల్యాబాయి 898 లో కర్పూరమంజరి యను నవలలను రచించి వాటికి బహుమానములు కూడ పొందిరి చిలకమర్తి నవలా ప్రక్రియను పెంపొందించి రనవచ్చును. ఎక్కువ చారిత్రక సాంఘిక నవలలు రచించినవారు కేతవరపు వేంకట శాస్త్రిగారు వీరి బొబ్బిలి ముట్టడి రాయచూరు దుర్గము పూర్ణానందము మొదలగునవి ప్రశస్తమగు నవలలు

నవలా లక్షణము లివి యని చెప్పుట కవకాశములు తక్కువ 'నవల' అనుదాని పాశ్చాత్య విమర్శకులు కొందరు నిర్వచించిరి. యథార్థ జీవనాన్ని యదార్థ దృష్టితో అధ్యయనంచేసి గద్య రూపంలో వ్యక్తపరచబడినది నవల" యని రిచర్డుక్రాస్ నిర్వచించెను "నవల జీవితానికి ప్రతిబింబము" అని ప్రేస్టిలీ అను విమర్శకుడు నిర్వచించెను పై నిర్వచనములనుబట్టి సమకాలిక సాంఘిక జీవితముతో సన్నిహితత్వముగల

సాహిత్య ప్రక్రియ నవల యని తెలియును నవల యందలి కథా విధానము రెండు విధములుగా నుండవచ్చును మొదటి పద్ధతిలో రచయితయే కథ చెప్పుట పురాణములిట్లు రచింపబడినవి రెండవ పద్ధతిలో కథను ఒక పాత్రచేత చెప్పించుట దక్షిణాది భాషలలో తెనుగే నవలా రచనలో ముందంజ వేసెనదనవచ్చును నవలయందు కథావస్తువు పాత్ర చిత్రణము సన్నివేశ కల్పనము దేశకాల నిర్దేశము అను నాలుగు ముఖ్యావయవములు గలవు నాటి కాలపు సాంఘిక ఆర్థిక రాజకీయ, మత విషయములను అద్దములో చూపినట్లు నవలయందు చూపవలెను

నవలలు ప్రకటించుటకు చొరవ చూపిన గ్రంథమాలలు ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల విజ్ఞానచంద్రికా గ్రంథమాల వేగుచుక్క గ్రంథమాల మొదలగునవి కలవు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు అనేక స్వతంత్ర నవలలు వ్రాసిరి అంతేగాక పెక్కు నవలలను వంగభాష నుండి అనువదించిరి తల్లావఝ్ఝులవారు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు చాగంటి శేషయ్యగారు ఆంధ్రీకరించిన నవలలు పెక్కు గలవు

ఆధునికాంధ్ర కవులలో పేరెన్నికగన్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారును అనేక స్వతంత్ర నవలలు తెలుగున వ్రాసిరి వీరి శైలి కథా నిర్మాణ కౌశలము పాత్ర పోషణము అసమాన్యము బద్దన్న సేనాని ధర్మచక్రము స్వర్గానికి నిచ్చెనలు తెరచిరాజు ఏకవీర వేయి పడగలు మా బాబు చెలియలికట్ట మొదలగునవి వేయిపడగలు పరిమాణమునందు మాత్రమేగాక గుణమునందును అగ్రగణ్యమని దివాకర్ల వారు ప్రశంసించుచున్నారు - అది ఆధునికాంధ్రదేశ సాంఘిక మత రాజకీయ పరిస్థితులకు మణిదర్పణము వీరి వేయిపడగలు ఆంధ్ర విశ్వవిద్యాలయములవారి బహుమతి పొందినది ఈయన సుమారు 60 నవలలు రచించారు వీరి నవలలో వేయిపడగలు హిందీలోనికి ఏకవీర హిందీ, ఆంగ్లభాషల్లోనికి అనువదింపబడ్డవి

అడవి బాపిరాజుగారి నారాయణరావు హిమబిందు కోనంగి గోన గన్నారెడ్డి ప్రసిద్ధ నవలలు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన ఆత్మబలి గోపీచంద్‌గారి అసమర్థుని జీవయాత్ర బుచ్చిబాబుగారి చివరకు మిగిలేది మొదలగునవి చక్కని పాత్ర చిత్రణము తోడను సాంఘిక వాతావరణముతోడను పాఠకుల ప్రశంసలందుకొన్న యుత్తమ నవలలు

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి నారాయణభట్టు రుద్రాంబ మల్లారెడ్డి అను చారిత్రక నవలలు మిక్కిలి ప్రసిద్ధములైనవి ఆంధ్ర నవలా ప్రపంచమున కలంకారప్రాయమై యాంధ్రజనుల యాదరాభిమానము చూరగొన్న యత్యుత్తమ నవల శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి భారత స్వాతంత్ర్య సంగ్రామము యొక్కయు, జాతీయోద్యమము యొక్కయు నారంభ పరిణామముల నిందు గాంచనగును భావ విప్లవముతోపాటు గొప్ప శిల్పమును ప్రదర్శించినవారు గుడిపాటి వేంకటాచలం ధనికొండ హనుమంతరావులు హాస్య ప్రధానములైన నవలలు వ్రాసినవారిలో ముఖ్యులు శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు మునిమాణిక్యం నరసింహారావుగారలు

నవలారచనలో పేరుగాంచిన నారీమణులు కూడ పలువురున్నారు జయంతి సూరమ్మగారి సుదక్షిణా చరిత్రము కనుపర్తి వరలక్ష్మమ్మగారి వసుమతి మాలతీచందూరుగారి చంపకము - చెదపురుగులు వసుంధరగారి దూరపుకొండలు ముప్పాళ రంగనాయకమ్మగారి బలిపీఠం పేకమేడలు సాంఘిక నవలలలో ప్రశస్తి వహించినవి రాచకొండ విశ్వనాథశాస్త్రి చివుకుల పురుషోత్తంగారల నవలలు అత్యుత్తమమైనవి సమరము-శాంతి సమజీవనము అన్నాకెరినా అనుమానం మొదలగునవి టాల్‌స్టాయ్ నవలల ఆంధ్రీకరణములు ప్రస్తుత కాలమున నవలలు చదువువారి సంఖ్య యధికమైనది అందుచే స్వల్పశ్రేణికి చెందిన రచనలు శతసహస్రములుగా వెలువడుచున్నది

వేరు వారపత్రికలు మాసపత్రికలు నవలా సాహిత్యాన్ని అభివృద్ధి చేయుటకు మంచి బహుమానముల నిచ్చి ప్రోత్సహించుచున్నవి రచయితులే వేటి ప్రస్థానికానికి మంచి నవలలు వ్రాయుచున్నారు.

36 నాటకము

కావ్యేషు నాటకం రమ్యం - కావ్యములలో నాటకము రమ్యమైన దన్న సామెత ఉన్ననూ చాలకాలము వరకు మన కవులు నాటక రచనకు పూనుకొనలేదు కావ్యాంతం నాటకం అనుటవలన నాటక రచనలకు చాల మంది యుపక్రమించలేదు

నాటకము గద్య పద్యమయమై సారస్వత ప్రయోజనమునకే గాక (Literary purpo e రంగ ప్రయోజనము (Thea r ca Purpose) కూడ నిర్వహించు కావ్య విశేషము ఇందేది కొఱవడినను నది సమగ్రమైన శ్రేష్ఠమైన నాటకము కాజాలదు నన్నయ కాలము నుండియు నేవో దృశ్య కావ్యములు నాటకము ను పేర రచింపబడుచు ప్రదర్శింపబడుచుండెనని పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో జెప్పినాడు. యక్షగానములు తోలు బొమ్మలాటలు నాటక లక్షణములు గలవే శ్రీనాథుడు రచించిన క్రీడాభిరామము కూడ పురాతన నాటకము శ్రీనాథునికి బూర్వులైన యాంధ్ర కవులలో నన్నెచోడుని వంటి స్వతంత్ర కావ్యకర్తలు తక్కువ వాఙ్మయారంభమైన యా క్రొత్త దినములలో నాద్యులైన నన్నయాదుల మార్గమును వీడి నాటక పరివర్తన మారంభించి భిన్నమార్గమున నడుగిడుట తప్పది కవులకు ధైర్యము చాలినది కాదు

నాటకము లాడుటకు గావలసిన నాటకశాలలుగాని రంగ పరికరములుగాని యప్పు డాంధ్ర దేశమున నెచ్చటను లేకుండెను శ్రీకృష్ణ దేవరాయలు వంటి రసికులైన సార్వభౌములు కూడ శ్రవ్య కావ్యపఠన

మాత్రము చేతనే తృప్తి గాంచిరి కాని దృశ్య కావ్యముల గన్నార జూచి యానందింపదగిన యేర్పాటులు కావించి యుండలేదు ఇట్లు నాటక ప్రయోగమునకు ముఖ్యావశ్యకములైన రంగ పరికరాదులు లేకపోవుట చేతను, నటులు సంఘమున నీచముగ జూడబడుచుండుటచేతను, రాజులు సైతము నాటక కళను అభివృద్ధి చేయ పూనుకొనలేదు అందువలన నాటకమెంత నీతి ప్రధానమయిననూ నాటక రచన కెవ్వరు పూనుకొనలేదు

సాంఘిక వాస్తవికతకు దర్పణము పట్టి సజీవమైన వ్యావహారిక భాషలో ఉదాత్తమైన లక్ష్యముతో 9 వ శతాబ్ది ముగిసే ముందే గురజాడ అప్పారావు కన్యాశుల్కం అనే నాటక రచన చేశారు

9 వ శతాబ్ది యుత్తరార్ధమున శకుంతలాది సంస్కృత నాటకములను తెనిగించి వాటిని ధార్వాడ కంపెనీ వారు ప్రదర్శించిన దానితో ఆంధ్ర దేశమున నాటక యుగము వెలసినది ఆ నాటకములు యమితముగా యాకర్షింపబడుట చూచి యాంధ్ర దేశమునందలి కొందరు పండితులు ఆంగ్ల సంస్కృత నాటకములు నాంధ్రీకరించుటకును వానిని బోలిన స్వతంత్ర నాటకములు రచించుకొనుటకును బూనుకొనిరి తెనుగు నాటక రచనలో ప్రథముడు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి గారని చెప్పవచ్చును వారు క్రీ శ 860 ప్రాంతమున మంజరీ మధుకరీయ మను స్వతంత్ర నాటకమును రచించి, కొంచె మించుగా నా కాలములోనే వేణీ సంహార నాటకము ను కూడ నాంధ్రీకరించుట కారంభించిరి కాని యది ముద్రితము కాలేదు

బళ్ళారి నగరమున శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులు కోలాచలం శ్రీనివాసరావుగారు క్రమముగా సరసవినోదినీ సభ సుమనోరమ సభ అను నాటక సమాజములను స్థాపించి వాటిచే నాటకములను ప్రదర్శింప జేయుచుండిరి హిందూ సమాజము వారు చిలకమర్తి వారి

నాటకములను ప్రదర్శించుచుండిరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి సమాజమున నాయికా పాత్రలు ధరించుచుండిరి చిలకమర్తి వారి గయోపాఖ్యానము ప్రదర్శింపబడి ప్రచారములోనికి వచ్చెను వేదం వేంకటరాయశాస్త్రిగారిచే రచింపబడిన ప్రతాపరుద్రీయం మిక్కిలి ఆకర్షణీయమైన నాటకము ఆ ప్రదేశమున నాటకమన్న జనాదరణ పెంచెను క్రీ శ 880 వరకును వెలువడిన యాంధ్ర నాటకములు పెక్కు అనువాదములే శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు ముప్పది నాటకములకుపైగా రచించిరి వీరి సారంగధర నాటకము విషాదాంతమైన ఆ కమును రంగముల (Scene ) గా విభజించు ప్రొలోగు (P o ogue) ఎపిలోగు (Ep ogue స్వగతములను (So oqu e ) ను పవేశపెట్టుట మున్నగు పాశ్చాత్య సాంప్రదాయాలను ప్రవేశపెట్టిరి _ తమ కాలములో దేశమును కలత నొందించుచుండిన రాజకీయ మత సాంఘికాది సమస్యలను తమ నాటకములందు ప్రవేశపెట్టిరి చంద్రహాస నాటకము నందలి ఉప్పుపన్ను వృత్తాంతమున ప్రమీలార్జునీయము నందలి స్త్రీ స్వాతంత్ర్య వృత్తాంతమును అందుకు దర్శనములు

తెలుగు ప్రజల దృష్టిని సాంఘిక నాటకములపైకి మళ్ళించి ఆధునిక తెలుగు నాటికకు సుస్థిరమైన చక్కని పాతిపదిక వేసిన శ్రీ ఎ వి రాజమన్నార్ సర్దార్ పాపడు నాటకము రచించారు కీ శే నార్ల చిరంజీవి రచించిన భాగ్యనగరం, డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు రచించిన అవి వీటికి చెందిన నాటకం యధాప్రజా తధారాజా అనునవి శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచింపబడిన సునందినీ పరిణయము విజయనగర సామ్రాజ్య పతనము సుల్తానా చాందబీబి మైసూరు పతనము మొదలగు చారిత్రక నాటకములు ప్రసిద్ధి కెక్కినవి వీరు మదాలస రుక్మాంగద పాదుకా పట్టాభిషేకము ప్రహ్లాదను మున్నగు పౌరాణిక నాటకములు

రచించిరి వేదం వేంకటరాయశాస్త్రిగారు ప్రతాపరుద్రీయము ఉష బొబ్బిలి యుద్ధము అను నాటకములను రచించిరి

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సుమారు ముప్పది నాటకములు రచించి ఆంధ్ర షేక్స్పియరు అను ప్రఖ్యాతి నార్జించిరి వానిలో పాదుకా పట్టాభిషేకము రాధాకృష్ణ విప్రనారాయణ ఆంధ్రులను ఆకర్షించినవి శ్రీ తిరుపతి వేంకటకవులు వ్రాసిన పాండవ జననము పాండవ ప్రవాసము పాండవ రాజసూయము పాండవ ఉద్యోగము పాండవ విజయము పాండవ అశ్వమేధము అను నాటకములలో పాండవ ఉద్యోగ విజయములు మిక్కిలి ప్రసిద్ధములైనవి "బావా ఎప్పుడు వచ్చితీవు అన్న పద్యము పండిత పామర జనముల నాకర్షించినది వీరు ఇతర నాటకములను గూడ రచించిరి శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు సత్యహరిశ్చంద్ర ను వ్రాసిరి ఇందలి పద మొక్కొక్కటి యొక్కొక్క రత్నము

కవిసామ్రాట్ విశ్వనాథ సత నారాయణగారు నవలలేగాక నాటక కర్తగా గూడ పేరొందిన ప్రతిభావంతులు నర్తనశాల వేనరాజు త్రిశూలము అనార్కలి వేదకావ్య హరిశ్చంద్రీయములు వీరి నాటకములు వీనిలో నర్తనశాల ప్రసిద్ధిగాంచినది

ఇటీవల దేశకాల పరిస్థితుల వలన భాషోద్యమము క్రమముగ నాటకములపై గూడ ప్రభావము చూప మొదలిడినవి ఆచార్య ఆత్రేయ రచించిన N G O కప్పలు భయం ముఖ్యమైనవి చలంగారి చిత్రాంగి ఆంధ్ర నాటకరంగములో సంచలనము కలిగించినది పినిశెట్టి రచించిన పల్లెపడుచులో రైతు- జమిందారుల మధ్యనుండు సంఘర్షణము చిత్రీకరింపబడినది కళారాధనకూ నటుల జీవితానికి సంబంధించినది మోదుకూరి జాన్సన్ నాటకం "నటనాలయం.-

తెలుగులో నేకాంకికలు గూడ చాల ఉన్నవి జస్టిస్ పి వి. రాజమన్నార్ ముద్దుకృష్ణ చలం మున్నగు వారిని కాలమును బట్టియే గాక కళా విశేషములనుబట్టి కూడ నేకాంకిక రచనలో అగ్రగణ్యులని చెప్పవచ్చును హాస్య నాటక కర్తగా భమిడిపాటి కామేశ్వరరావు గారి విశిష్టస్థానమున్నది

8‡8 తరువాత నాటికం రచనా పద్ధతితో కొంతమార్పు గలిగినది నాటికా రచయితలు తమ నాటికలలో వాస్తమున కెక్కువ ప్రాధాన్యత నిచ్చుచుండిరి శ్రీయుతులు బుచ్చిబాబు ఆత్రేయ నార్ల అనిసెట్టి పింశెట్టి గంగాధర్ విశ్వప్రసాద్ మున్నగవారి కొత్త మార్గమునకు చెందినవారు ఈ శతాబ్దములో నాటకరంగములో సంభవించిన విశేషాలలో నాటక నాటిగా రచయితగా గణేశ్ పాత్రో ఆవిర్భావం ఒకటి నాటకమునకు అటు ప్రదర్శన రీత్యా ఇటు సాంఘిక ప్రయోజనం దృష్ట్యా పరిపూర్ణమూ ప్రతిభావంతమూ అయిన రూపమివ్వడంలో గణేశ్ పాత్రో అగ్రగామిగా ఉన్నాడు ఇటీవల రేడియో నాటికలు ప్రసిద్ధికెక్కినవి బుచ్చిబాబు. గోరాశాస్త్రి శ్రీశ్రీ దేవులపల్లి పద్మరాజు ఆరుద్ర రజనీకాంతరావు మునిమాణిక్యం నరసింహారావుగార్లు రేడియో నాటికా రచనము నందారితేరినవారు

నేటి నాటక రంగము యొక్క దుస్థితిని గూర్చి ఆత్రేయ ఒక సమీక్షలో వ్రాస్తూ "తెలుగు నాటక రచయితకు తప్పించుకు తిరిగే తత్వ తాత్కాలిక వినోదం అలవాటయినవని, తెలుగు నాటకాలలో తెలుగుతనం మృగ్యమవుతుంద"ని వాపోయినారు మన నాటక సాహిత్యం గొప్ప స్థితిలో లేదనే అభిప్రాయమును శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు కూడ వెలిబుచ్చారు ఇప్పటికీ పాఠశాలలయందును కళాశాలలయందును విశ్వవిద్యాలయములందు నాటకములు ప్రదర్శితములగుచున్నవి తెలుగువారి సాంస్కృతిక జీవితములో పెద్ద లోపము సినిమా ఒక్కటే వినోద సాధనం

కావదం ఆ పరిస్థితిమారి తమిళనాడు మహారాష్ట్రి బెంగాలు రాష్ట్రము లలోవలె మనకూ ఎనీరంగ నటీనటులతో దర కులతో కూడ కలిపి ప్రత్యామ్నాయముగా స్థిరమైన వృత్తి నాటకరంగము ఏర్పడితే వారికన్న మంచి నాటకములే మన రచయితలు ప్రయోక్తలు నటీనటులు సమకూర్చ గలరని విశ్వసించవచ్చు

37 యక్ష గానములు

యక్షగాన మొక నాటక విశేషము విజయరాఘవుడు మున్నగు వారు తమ యక్షగానములను నాటకములనియే వ్యవహరించిరి ఇవి క్రీశ 8వ శతాబ్దినుండియు ప్రచారమున ఉన్నను అప్పకవికి పూర్వపు లాక్షణికు లెవ్వరును వానిని పేర్కొని యుండలేదు ద్రావిడభాష య దలి రచనలు కొరవంజు లనబడుననియు కొరవలను ఆటవిక జాతివారు ముందు వానిని ప్రదర్శించెడి వారనియు ఎమ్మట జక్కులు లేక యక్షులు అను వారు వానిని చేపట్టుటచే యక్షగానములను పేరు వచ్చెననియు ప్రభాకర శాస్త్రిలుగారు వక్కాణించి యున్నారు

కొరవంజిని యనగా ఎఱుకతను మొదట యక్షగానములో ప్రవేశ పెట్టినవారు తంజావూరు వారే యగుటచే కొరవల మూలమున యక్షగానము ఉత్పన్నమయ్యెననుట యుక్తము కాదనియు, అవి మత ప్రచార సమితమై ప్రభవించి, తొలుత కొయ్యబొమ్మల మూలమునను తోలు బొమ్మల మూలమునను ప్రదర్శింపబడి తరువాత మనుజులే ప్రదర్శించిన మూగ నాటకములై పిమ్మట గద్య పద గేయములతో కూడి యక్షగానము లయ్యెనని బౌద్ధ యుగము నుండియు ఆంధ్ర దేశమున జక్కులు లేక యక్షులు అను ఒక తెగవారు నివసించు చుండిరనియు వారికిని యక్ష గానముల యుత్పత్తికిని సంబంధముండుననియు ఇట్టివి సంస్కృతమున కూడ ఉండెననుట కాధారము లుండుటచే వీనిని కేవలము దేశి రచనలని

చెప్పుకొనుటకు వీలులేదనియు తెలుగు యక్షగానములను చూచి తమిళులు కన్నడులును తమ తమ భాషలలో నట్టి వానిని రచించిరనియు తంజావూరు కవులు వానిలో పెక్కు మార్పులు చేసి వానికి వన్నె కలిగించిరనియు యక్షగానములలో పాత్ర పోషణమునకే కాని కథా కల్పనమునకంతగా ప్రాధాన్యము లేదనియు డా వేంకట రమణయ్య గారభిప్రాయ పడుచున్నారు

సంగీత ప్రధాన నాటకమే యక్షగానమని తెలియకొనవచ్చును మధుర తంజావూరు పాలనలో యక్షగానములు వృద్ధిపొందినవి శ్రీనాథుడు "కీర్తింతురెవ్వాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని పలికెను

సుగ్రీవ విజయము కందుకూరి రుద్రకవి విరచితము విజయ రాఘవ నాయకుడు విప్రనారాయణ చరిత్ర శ్రీకృష్ణ మానసము మొదలగు యక్షగానములు రచించెను రంగాజమ్మ మన్నారుదాస విలాస నాటక మనియొక యక్షగానము రచించెను త్యాగరాజు ప్రహ్లాద భక్త విజయము నౌకాభంగమను యక్షగానముల రచించెను

కూచిపూడి భాగవతులచే ప్రదర్శింపబడు యక్షగానములు సలక్షణమైనవి సర్వజనాహ్లాదకరములైనవి

38 ఆధునిక సాహిత్యమున కథా ప్రక్రియకున్న ప్రచార ప్రాముఖ్యము ఉగ్గడింపుడు

ఆధునిక సాహిత్య జగత్తులో అనల్ప వ్యాప్తిని గాంచిన సాహిత ప్రక్రియలలో కథానిక మొదటిది ఆఖ్యాన వచన వాఙ్మయము నందలి యొక ప్రక్రియ ఈ కథ ఇది ప్రస్తుత కాలమందే పుట్టినదని పలువురు భావించుచున్నారు ఇందులకు కారణమేమన్న ఈ వచన ప్రక్రియను గురించి అగ్ని పురాణము ధ్వన్యాలోకములందున ప్రస్తావించబడిన తెలుగు

నాట 20 వ శతాబ్ది వరకు ఈ కథానికలను (రూపొందించినవారు) మన కందించినవారు లేరు ప్రస్తుతము మనకున్న వచన గ్రంథములన్నియు 20 వ శతాబ్దమునకు పూర్వము. పురాణేతిహాసములు అనువాదములే కాని గద్ది కాలమున చదివి ఆనందించు గద్య కావ్యములు కనపడవు. అందు వలననే ఈ కథానిక యనెడు గద్య కావ్యభేదము పాశ్చాత్యుల నుండి మనకు సంక్రమించినదని కొందరు భావించుచున్నారు

కథకు కథానికకు గల భేదము మనకు అంతగా తెలియదు ఇవి అనల్పమైన ఆనందమును అందిచ్చు ఉత్తమ ప్రక్రియలు తెలుగు భాషలో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు చేయి వేయని సాహిత ప్రక్రియ యిది యొకటిదే మాత్రమే

పూర్వకాలపు కథానిక స్వరూపము యిది యని గ్రహించుటకు సంస్కృత వాఙ్మయమున కథా కలును కాదగును కథానిక ప్రారంభమున భయానక రసమును మధ్యమున కరుణ రసమును అంతమున అద్భుత రసమును కలిగి అనుదాత్తమైన ఇతివృత్తము కలిగి సంక్షిప్తమైనది ఆలంకారికులు దీనిని ఉత్తమ గద్యకావ్యముగా గుర్తించి వారు ప్రాచీన కాలమున కథానిక యుండినను గూడ దాని లక్షణములు నేడు గుర్తించలేము అందువలననే నేటి కథానికలకు ఆధారభూతము పాశ్చాత్య సాహిత్య ప్రభావము అనుట జరిగినది.

కథానిక విషయము నాడు నేడు గూడ రెండు లక్షణములు సమానముగా యున్నవని చెప్పవచ్చును

1 కథ ఉదాత్తముగా ఉండదు అనుటయు

2 సంక్షిప్తముగా ఉండవలెను అనుట మాత్రమే

నేటి కథానికలు స్వల్పకాలములో చదువుట వీలగుచున్నది జీవిత సంఘటన ఆధారముగా గ్రహించి యిది రూపొందింపబడుచున్నది ఉత్తమ రచయిత మాత్రమే కథానిక యందు శిల్పసంపూర్ణతను సాధింపగల్గు

చున్నాడు ఇటువంటి రచనలలో మనము మార్పులు చేయలేము అనవసరమైన వర్ణనలు కన్పించుట కూడ వ్యర్థము

కథానిక యందు పాత్ర స్వభావము హఠాత్ పరిణతమగును కాని అది వాస్తవమై సహృదయుల హృదయము సంచలింపజేయును కథానిక యందు బహుపాత్ర ప్రవేశమునకు అవకాశము లేదు నాలుగు లేక ఐదు పాత్రలకు పరిమితమైనది అంతకు మించినచో పాత్రలకు కథలో సరియగు స్థానము కల్పించబడదు కథయందు సుదీర్ఘవర్ణనలకును, సంభాషణల కును అవకాశము తక్కువ కొన్ని కథలు సుదీర్ఘ సంభాషణలతో కూడి కూడియుండుట మనము గమనింపవచ్చును ఉన్న భాషణలు పేలవము గాక చతురతా విశిష్టమునై యుండవలెను శైలి విషయమున కథానిక యందు కాఠినత యుండరాదు రచన విషయమున నవలా రచనకంటే ఉత్తమ కథానిక రచనయే మిగుల కష్టతరమైనది

కథానిక క్లుప్తముగా యుండుటతో కథయందు నీరసత్వముగాని కుంటి నడకగాని లేకుండ యుండి పఠితల మనస్సుల్లో హత్తుకొనునట్లు కథకుడు కథను రచింపవలెను కావున కథలో మనకు ఏకాగ్రతను కల్గించేదిగా యుండవలెను

ఉత్తమ కథానిక లక్షణములను గూర్చి శ్రీ కాకర్లవారు ఇట్లు చెప్పినారు సంక్షిప్తత 2 ఏకాగ్రత 8 సమగ్రత 4 నిర్భరత కలిగియుండవలెను.

మొదటి లక్షణమైన సంక్షిప్తత పరిమాణములోను ప్రయోజనము లోను ఆలోచనయందును కలదు రెండవ లక్షణమైన ఏకాగ్రత రచయితకు సంబంధించినది. సంక్షిప్తతను సాధించవలెనంటే రచయితకు ఏకాగ్రత ముఖ్యముగా నుండవలెను సమగ్రత మూడవ లక్షణము రచయిత సంక్షిప్తత పాటించి ముఖ్య సంఘటనలను విషయములు వదిలి వేయవచ్చును తద్వారా కథలోని పటుత్వము తగ్గి పేలవముగా తయారగుటకు అవకాశమున్నది - కావున సంక్షిప్తత వలన సమగ్రతకు లోటు

రాకుండ చూడవలసిన బాధ్యత రచయితవి మాత్రమే అఖరిదియైన నిర్వరత రసము శిల్పమునకు సంబంధించినవి తాను శిల్పియే యనెడి భావము దృఢముగా నెంకొల్పబడి యుండవలెను కథానిక యందు ఈ లక్షణములు లోపించిన పఠితకు రసానందభూతి కలుగనేరదు

శ్రీ గురజాడ అప్పారావుగారు రచించిన కథానికలే యాంధ్రమున మొదటివిగా భావించుచున్నారు వీరి "అణిముతాలు" ఈ మధ్యననే పకటించబడినది వేదము వేంకట రాయశాస్త్రిగారు భోజకాళిదాసు కథలు భేతా పంచవింశతి కథాసరిత్సాగరము అను కథల సంపుటముల ప్రకటించిరి చిలకమర్తి వారు రచించిన రాజస్థాన్ కథావళి చమత్కార మంజరి భారత కథామంజరి చిత్ర కథామంజరి చిత్ర కథాగుచ్ఛము లందు కథానికలని చెప్పదగిన రచనలు కన్పించుచున్నవి శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు మల్లికాగుచ్ఛము అనెడిపేరిట కథానికలు వ్రాసియున్నారు వీరి శైలి ధారాళమై వ్యావహారికమునకు సన్నిహితమై సలక్షణమై యొప్పారుచుండును

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కథానికా రచనమునను సిద్ధ హస్తులే వీరి "ముగ్గురి బిచ్చగాళ్ళు" "మ్యాక్బే దుర్గంలో కుక్క" మిక్కిలి ప్రసిద్ధినందిన కథానికలు శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామి గారి వీర కంఠం కథలు మిక్కిలి రసవంతమైనవి అడవి బాపిరాజు తిరుపతి కొండమెట్టు భోగీర లోయ అను కథలు శిల్పకళాసౌందర్యమును బూర గొన్న యుత్తమ కథానికలు తరంగిణి రాగమాలిక అంజలి కథా నికలు బహుప్రచారము నందినవి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి గులాబీ అత్తరు తచ్ఛితమైన జవాబు మిక్కిలి ప్రశస్తమైనవి శ్రీ చలం గారి హాస్య కథలు చదివి యానందింపని వారుండరు వీరి సినిమా స్వరము జగద్విఖ్యాతము శ్రీ చింతా దీక్షితులుగారి ఏకాదశి మిక్కిలి ప్రశస్తి నందినది శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి కాంతం కథలు

ప్రఖ్యాతి నందినవి శ్రీ మొక్కపాటి నరసింహారావుగారి చిత్రరువు కథానిక చాల మనోహరముగా నుండును శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి కథలన్నియు అమృతవాహినులే శ్రీ గోపీచందుగారి కథలు నవలలు కూడ ప్రఖ్యాతి గడించినవే శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి గాలివాన ప్రపంచ కథానికల పోటీలో రెండవ బహుమానము పొందినది శ్రీ బుచ్చిబాబుగారి అరవిగాచిన వెన్నెల మేడమెట్లు ప్రాముఖ్యము నందినవి శ్రీ మధురాంతకం రాజారాంగారి వక్రగతులు కుంపటిలో కుసుమములు ముఖ్యములు

కథానికా రచయితలలో శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి మాలతీ చందూరు ఇల్లిందల సరస్వతీదేవి శ్రీదేవి భానుమతి ముఖ్యులు

ఈ విధముగ నేటి కాలమున ప్రసిద్ధులైన ఎందరో కథకులు నేటి పత్రికలలో వారి రచనలను (కథానికలను) పుంఖానుపుంఖముగా ప్రచురించుచున్నారు

## 39 కవిత్వము

కవిత్వము - కవిత్వమొక సృష్టి ఈ సృష్టి రెండు విధములు బహిస్సృష్టి 2) అంతస్సృష్టి భగవంతుని మనస్సులో జనించిన యొక సంకల్పమునకు సృష్టి యనుకరణము ఆ సృష్టికి కావ్య మనుకరణము కనుక కవిత్వము తత్త్వమునకు మూడు మెట్లు క్రిందయని ప్లేటో వాదము కవి సృష్టిని గాంచి దాని తత్త్వమును గ్రహించి ప్రజలకు దానిని వ్యాఖ్యానము చేసి వివరించుచున్నాడు మేథ్యూ ఆర్నాల్డు (Ma hew Arnold అను మహాశయుడు Poe ry s he cr c sm of ife అనుటలో నిదే పరమార్థము సృష్టి రహస్యమును విప్పిచెప్పుటకు కవి సృష్టికర్త యంతవాడు కావలయును కవి సత్యవాది కాని కేవలము యదార్థవాది కాదు ఇట్లు కవిచేయు సృష్టి లోకమునకు ప్రతిబింబముగానూ అనుసర

జముగాను లేదా ప్రతికూలముగా నుండవచ్చును షెల్లి (She y అను ఇంగ్లీషు మహాకవి అన్నట్లు No one mer he name of a crea er except God and he poe అనగా భగవంతుడు ఎట్టి సృష్టికర్తయో కవియు నట్టి సృష్టికర్తయే యని ఒక్క మాటలో చెప్ప వచ్చును

## భావ కవిత్వము

పాశ్చాత్య వాఙ్మయమునందు భావకవిత్వమునకు లిరిక్కు( yric)అని పేరు లైర్ అనునదొక పాశ్చాత్యజంత్ర విశేషము r nged mu cal n rumen ) దానిమీద గానము చేయుటకు వీలుగా వ్రాయబడిన కవిత్వము లిరిక్కు కాని సూక్ష్మముగా చెప్పదలచుకొనిన గానయోగ్యము ఆత్మనాయకము అంతర ప్రవృత్తి ప్రధానమైన కవిత్వము లిరిక్కు జ్రావి Jeo frey) అను పండితుడు "Ly c poe ry was on y ano her name for poe ry se f" అని చెప్పినాడు కవి యొక్క స్వీయప్రవృత్తికి ప్రాధాన్యము వచ్చినచోట y ca poe ry ఉత్పన్నమగును ఇటువంటి ఘట్టములు పురాణములందున ప్రబంధము లందు నాటకములందుండవచ్చును ఆ దృష్టితోనే శ్రీ ఎంగ లక్ష్మీకాంతము గారు ఆంధ్ర భాగవతము విశేషించి yr ca రచన యని చెప్పినారు భావ ప్రధానమయిన కవిత్వము భావకవిత్వమనియు చెప్పుచున్నారు శ్రీ కవికొండల వేంకటరావుగారు "భావము యొక్క కవితా స్వభావము భావ కవిత్వము" అని నిర్వచించినారు

కావ్యము లేక కవిత్వము వచింపబడుటకు రచింపబడుటకు నిర్మింపబడుటకు ముందుగా చేయబడవలెను. కవే కర్మ కావ మ్ - కవి చేయుచున్న పని కావ్యమనబడును. కవితము యొక్క ఈ చేయబడుట యెట్టిదో వివరముగ తెలిసికొందము.

సర్వాకాశములు నిండి మనల నావరించియున్న ప్రకృతి కవిలో ప్రవేశించి అతని మహాత్వము (per ona y)లో శాశితమై తిరిగి కావ్యరూపమున సాక్షాత్కరించినప్పుడు దా కేదో యొక్క క్రొత్త తేజము క్రొత్త శక్తి క్రొత్త ఆకర్షణ క్రొత్త పరమార్థము కలి నవి అనగా మొదట మనము చూచినది ప్రకృతి యొక్క ప్రకృతిత్వము ఇది లౌకికము కవిలో ప్రవేశించి తిరిగి కావ్యరూపాన బయటకి వచ్చినపుడు చూచినది యా ప్రకృతి యొక్క కవిత్వము ఇది యలౌకము కవిలో ప్రవేశించిన ప్రకృతి తన భావమును కోల్పోయి కవి భావమును పొందు చున్నది అనగా కవిత మగుచున్నది ఈ కవిత్వమును చేయుచున్న వాడు కవి వస్తువుకున్నట్లే భావమునకు కూడ రెండు తత్వాలు కలవు భావత్వము, కవిత్వము, అందులో భావము యొక్క కవిత్వము భావ కవిత్వము లోకమునందు శోకమనే భావమున్నది లౌకికమైనంతవరకు దానికి శోకత్వమే స్థితి అదే కవిలో ప్రవేశించి కావ్యరూపమున బయటి ప్రవేశించినప్పుడు దానికి కవిత్వ స్థితి కలిగినది అప్పుడది రసమై కరుణము అనిపించుకొనును అనగా వస్తు భావ భేదాలచేత కవిత్వము స్థూలముగా రెండు రీతులు-వస్తుకవిత్వము భావకవిత్వము

పాశ్చాత్య కవుల ప్రభావంతో ఆధునిక సాహిత్యము భావ కవిత్వమును పేర వెలుగొందినదని చెప్పవచ్చును లఘుకావ్యములు భ ద భావములు ఆత్మాశ్రయ కవిత్వము ప్రకృతి కవిత్వము మర్మకవిత్వ మని చెప్పబడు భాగములే భావ కవిత్వము ఆత్మభావముల వెలయించుచు ప్రకృతి సౌందర్యము పరిమితముగ వర్ణించుచు చెప్పబడునది భావ కవిత్వము గురుజాడ అప్పారావు రాయప్రోలు సుబ్బారావుగార్లు భావ కవితాయుగ ప్రవక్తలు- శివశంకర శాస్త్రిగారు భావకవిత్వ పోషకులు భావకవిత్వములో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి ప్రత్యేకమైన స్థానమున్నది ఈయన స్వచ్ఛమైన భావకవి "ఆకులో ఆకునై- పూవులో పూవునై"

పంటి గేయములు మనోహరములు వీరిని భావకవితాయుగ చక్రవర్తి యన వచ్చును నండూరి సుబ్బారావుగారి ఎంకిపాటలు కూడ భావకవితకు మంచి ఉదాహరణ

ఆంధ్ర సాహిత్యము భావ కవిత్వము నుండి మలుపుతిరిగి విప్లవ విత్వముగ హేతువాద కవిత్వముగ పరిణమించినది ఈ యుగమునకు శ్రీశ్రీ కర్త దీనినే అభ్యుదయ కవిత్వమని చెప్పుదురు సంఘములో నందఱకు సమానముగా శాంతి సుఖము లుండవలెనని ఆర్థిక సమానత్వ ముండవలెనని వీరి యాకాంక్ష ఇందులకై వీరు ఉద్రేకభరితములైన మార్గములలో కవిత్వము చెప్పిరి మహాప్రపంచం మహాప్రస్థానం వీరి ముఖ్య రచనలు

ఆధునికాంధ్ర సాహిత్య క్షేత్రంలో భావచైతన్య ప్రవంతి మూడు పాయలుగా చీలి ప్రవహిస్తున్నది

సంప్రదాయ చైతన ధార - దీనికి నాయకుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

2 సాయుధ విప్లవ చైతన్యధార శ్రీశ్రీ

8 శాంతి విప్లవ చైతన్యధార - దాశరథి

మొదటి రెండు వాదాలను సమన్వయిస్తూ అభ్యుదయం వరించే మధ్య వర్గానికి చెందినవాడు దాశరథి ఈయన జాతీయవాది గాంధేయ విప్లవవాది ఈయన వీర రసానికి ప్రాధాన్యత ఇచ్చి జాతీయకవి అని ప్రజాకవి అని ఉద్యమజీవి అని అభ్యుదయకవి చైతన్యసారథి అని, సమవాదదీపస్తంభమని పేరు గడించుకొన్నారు "విప్లవం హృదయ చైతన్య రూపంగా రావాలిగాని రక్తపాతంతో కా"దని బోధించిన శాంతి విప్లవవాది దాశరథి

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము కవి యుద్ధ భటునివలె గోచరించును

40 గ్రాంధిక వ్యవహార భాషోద్యమములు

నన్నయకు పూర్వమునుండి తెలుగుభాష మారుతునే వస్తున్నది ఇరవై శతాబ్దములోనికి వచ్చేసరికి కావ్య వ్యవహార భాషాభేదాలు తీవ్ర వాదోపవాదాలకు దారితీశాయి కావ్యభాష మార్పగూడదని ఒక వర్గము వ్యవహారభాషనే ఉపయోగించాలని మరియొక వర్గము వాదించడంతో పండితలోకం రెండుగా చీలిపోయింది

నన్నయ కాలమునుండి నాయకరాజులవరకు కేవలము కావ్యరచనకు మాత్రమే గౌరవము ఉండేది. అనగా పద రచనకే మన కవులు గౌరవ మిచ్చారు నాయక రాజుల కాలములోనే ఆంగ్లేయ పరిపాలన దేశంలో మొదలై ముద్రణ సౌలభ్యం సామాన్యులకు కూడా విద్యాసౌకర్యాలు తెలుగువారికి సమకూడడంతో సాహిత్యంలో మార్పులు వచ్చాయి ఆ శతాబ్ది తుదిరోజుల్లో రచింపబడ్డ కన్యాశుల్కం లో ( 896) గురజాడ అప్పారావు గారు ఆంగ్లభాషాపదాలను విపరీతంగా వాడేరు క్రమక్రమముగా వ వహారిక భాషకు తావు లభిస్తూ వచ్చింది క్రి శ 720 నుంచి వ్యవహారి కంలో ఉన్న క్రైస్తవ వాఙ్మయం తెలుగులో రావడం మొదలయింది పాశ్చాత్య విద్వాంసుల్లో పరిపాలకుల్లో కొందరు సంస్కృతాంధ్రాలను ద్రావిడ భాషలను నేర్చి గ్రంథరచన సాగించడంతో నూతన సాహితీ ప్రక్రియలతో బాటు నూతన రచనా ధోరణులు గూడా తెలుగువారికి పట్టు బడ్డాయి రాబర్ట్ కాల్డ్వెల్ రాసిన ద్రవిడ భాషా తులనాత్మక వ్యాకరణం శతాబ్దాలుగా భాషావిషయంలో తెలుగు విద్వాంసులకున్న దురభిప్రాయా లను కొంతవరకయినా పోగొట్టింది భాషలు మారతాయని మార్పు చెడి పోవడం కాదని సకల భాషలకును సంస్కృతం జనని కాదని ఈ వ్యాకరణం ప్రతిపాదించింది పత్రికా ప్రచురణలో కూడ వ్యవహారికానికే స్థానం ఉండేది సామినేని ముద్దు నరసింహం నాయుడుగారు అర్థానుస్వార శకట రేఫలను వర్జించాలని చెప్పిన వారిలో ప్రథముడు గురజాడ

అప్పారావు గారి కన్యాశుల్కము ఆ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టిన మొదటి మహాగ్రంథం

కందుకూరి వీరేశలింగం (1848-1919) తన గ్రంథాలను సరళ గ్రాంథి భాషలో వెలువరించడం ఆరంభించాడు గిడుగు రామమూర్తి గారు విజ్ఞాన సముపార్జనకు వ్యవహారికమే మంచిదని చెప్పసాగారు వేదం వేంకటరాయ శాస్త్రి గారి నాగానంద మనే తెలుగు నాటకంలో (1896) తొలిసారిగా నీచపాత్రలకు వ్యవహారభాష నుపయోగించారు దానితో సనాతనులకు ఆధునాతనులకు పోరాటం ప్రారంభమయింది

వ్యావహారిక భాషోద్యమము 1910 లో ప్రారంభమయిందనవచ్చు నూతన బోధన పద్ధతిని వివరించడానికి 1910 మే నెలలో విశాఖలో సమావేశపరచిన ఉపాధ్యాయులను పనిలో పనిగా గిడుగువారు వ్యవహారిక రచనలను ప్రోత్సహించమని వాటిని పాఠ గ్రంథాలుగా అనుమతించమని అర్థించారు భావంలో భాషలో ఛందస్సులో నూతనమార్గాలు తొక్కిన గురజాడ అప్పారావు గారి నీలి పాటలు ముత్యాల సరాలు ఆ యేడే ప్రచురింపబడ్డాయి గురజాడవారు గిడుగువారి వాదాన్ని సమర్థిస్తూ నవంబరు 24 న గ్రామ్యశబ్ద విచారణ మనే వ్యాసం సంవత్సరాంతంలోగా వాడుకభాష-గ్రామ్యము అనే వ్యాసం వ్రాశారు

గిడుగువారి వాదంలో ప్రధాన సిద్ధాంతాలు నాలుగు-

సామూహిక విద్యా సౌకర్యాలకు కావ్య భాష చాలదు

శాస్త్ర గ్రంథాలను వచన రచనలను శిష్ట వ్యవహార భాషలో రాయటమనే సంప్రదాయము మనకుంది దానిని విడువరాదు

3 ఆధునిక విద్యాబోధనకు వ్యవహార భాషే మనకు తగినది

4 గ్రాంధిక భాష పండితులకే రాదు విద్యార్థులకు ఆ భాషాజ్ఞానం కలేదు

గిడుగు వేంకట సీతాపతిగారి "సొద్దు" గరజాడ అప్పారావుగారు మద్రాసు విశ్వవిద్యాలయానికి ఇచ్చిన ఆధునికాంధ్ర రచన పానుగంటి వారి గ్రామ్యవాద విమర్శనము పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి ఆంధ్ర భాషా సంస్కరణ విమర్శనము మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి గామ మా గ్రాంధి మా అను వ్యాసము పి సూరిశాస్త్రిగారు సంకలనం చేసిన The G amya Con ove y అనేవి వాడుకభాషా వాదానికి తోడ్పడినవి

కందుకూరి వీ"శలింగంగార దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు చిలుకూరి వీరభద్రరావుగారు మొదలైన విద్వాంసులు పాల్గొన్న కొవ్వూరు సారస్వత మహాసభలో 9 6) నూరేళ్ళ గా పెద్దం వాడుకలో ఉన్న పదాలన్నీ సిద్ధప్రాలన్నీ దేశవ్యాప్తంగా ఉన్న రూపాలు పూర్వ పయోగ లేకపోయినా అంగీకార యోగ ములేనని తీర్మానించారు 9 9 లో గిడుగు వారు తెలుగు పత్రికను స్థాపించి ఉద మం సాగిస్తూనే వచ్చారు 988లో జరిగిన అభినవాంధ్రకవి పండితసభ బోధనాభాషగా వ్యవహారికాన్ని స్వీకరించాలని తీర్మానించింది 9ర7 లో జనవాణి అనే దినపత్రికకు సంపాదకత్వం వహించిన తాపి ధర్మారావుగారు మొట్టమొదటిసారిగా వ వహారికాన్ని పత్రికాభాష చేశారు. గ్రా థికభాష చివరకు విశ్వవిద్యాలయాల్లో పాఠ్య గ్రంథాల్లో తలదాచుకోవలసి వచ్చింది గ్రాంథికం కూడ సులభ గ్రాంథికం "సరళ గ్రాంథికం" మొదలగు బహురూపాలతో మునుపటి రూపాన్ని పోగొట్టుకుంది

గ్రాంథికవాదులు కూడ 958-60 లలో 965-70 లో తల యెత్తారు 965 నుంచి మళ్ళీ వాదోపవాదాలు జరిగాయి అనేక తర్జనభర్జనల తరువాత పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ఒక రాజీకి రావడం జరిగింది మొదటి భాషగా తెలుగు నేర్చుకొనేవాళ్ళ పాఠ గ్రంథాల్లోని తెలుగు వాచకాలు మాత్రం సరళ గ్రాంథికంలో ఉండాలని రెండో భాషగా తెలుగు నేర్చేవాళ్ళుగాని శాస్త్ర విషయాలను తెలుగులో నేర్చుకొనే ఆంధ్ర విద్యార్థులుగాని చదివే పాఠ గ్రంథాల్లో వ్యావహారికమే ఉండాలని సూత్ర

హేయంగా నిర్ణయించారు ప్రభుత్వం వారు ఈ నిర్ణయాన్ని ఆమోదించి వరణాత్మకంగా ఆయా శైలీభేదాలకు ఒక శైలీ సంఘాన్ని (Sty e Comm ee నిర్ణయించి పింగళి లక్ష్మీకాంతంగారినే అధ్యక్షులు చేస ఒక సంఘం నియమించారు ఈ సంఘంవారు 966 నాటికి తమ నివేదికను అందజేశారు తెలుగును అధికారభాషగా గుర్తిస్తూ 9 6 లో ఆంధ్రప్రదేశ్ అధికారభాషా చట్టం (9 వ చట్టం శాసించింది తెలుగును అధికారభాష చేయడంలోని కష్టసుఖాలు పరిశీలించి సలహా ఇమ్మని ప్రభుత్వం వారు అప్పటి విద్యాశాఖా కార దర్శి జె పి యస్ గ్విన్ అధ్యక్షతన మరో సంఘం నియమించారు (జి ఎ 806 966 డిసె 28). గ్విన్ సంఘంవారు ముఖ్యంగా ఆంధ్రేతరులకు తెలుగు నేర్పడానికి భాషను అధునీకరించడానికి విశ్వ విద్యాలయాల్లో తెలుగును బోధనాభాష చేయటానికి పరిపాలనా వ్యవహారాలకు కావలసిన సాంకేతిక సహాయం అందివ్వడానికి ఒక స్వతంత్ర సంస్థను నెలకొల్పవలసిందని సూచించారు లక్ష్మీకాంతం కమిటీ నిర్దేశించిన ఆధునిక ప్రమాణ భాషనే (వ్యావహారికాన్నే) ఉపయోగించాలని నిర్దేశించారు రాష్ట్ర ప్రభుత్వం వారు ఈ సూచనలను ఆమోదించి వాటిని అమలుపరచడానికి తెలుగు అకాడమీ అనే సంస్థను 968 ఆగష్టు 6 న స్థాపించారు ఈనాడి రేడియోల్లో పత్రికల్లో సాహితీ రచనల్లో సినిమాల్లో అనుక్షణం వాడుకలో ఉండి ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉన్న వ్యావహారికాన్ని ఏ శక్తి బహిష్కరించలేదు విశ్వ విద్యాలయాల్లో కూడ వ్యావహారిక రచనలే చేస్తున్నారు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం తెలుగు శాఖ పిహెచ్ డి పట్టానికి రాసే పరిశోధనా వ్యాసాల్లో కూడ శిష్ట వ్యావహారికాన్ని 969 లో అంగీకరించింది ఒకటో తరగతి నుంచి పదో తరగతి వరకున్న తెలుగు పాఠ్య గ్రంథాలు ఇప్పటికీ గ్రాంథికంలోనే ఉన్నాయి.

ప్రాచీన వ్యాకరణ సూత్రాలను వేద ప్రమాణాలని భావించి మార్పును వ్యతిరే కించినా కాల ప్రవాహమూ భాషాప్రవాహము ఆగేవికావు వాటిని ఆపడం ఎవరి తరమూకాదు ఆధునిక పరిస్థితుల్లో వ్యవహారికం వినా మరో మార్గాంతరం లేదు పూర్వ కవులు మాత్రమే భాషాస్వరూప నిర్ణేతలనే దురభిప్రాయం ఎంత త్వరలోపోతే అంత మంచిది వ్యవహారిక భాషలో అన్యపదాలు మాండలిక పదాలున్నందువలన భాషలోని పరిశుభ్రత లోపిస్తుందని చెప్పేవారు కొందరున్నారు అన్య పదాలను పరిహరించాలని ప్రయత్నించిన జోనాథన్ స్విఫ్ట్ (Jona han Sw f ) లాంటి పండితులందరూ విఫలులయారు మొదట్లో ఇతర భాషాపదాలైనా ఎరవు తెచ్చుకున్న తరువాత అవి తెలుగు మాటలే వాటిని వాడడంలో తప్పులేదు వెయి సంవత్సరాల నాటి భాషలో రాసిన కావ్యాలకన్నా నేటి వచన రచనలు ఎన్నోరెట్లు ప్రజాసామ్యానికి కూడ అందుబాటులో ఉన్నాయన్నది వాస్తవం

గ్రాంథిక వ్యవహారిక వాదాలవల్ల 20 వ శతాబ్దంలో తెలుగు భాషకు మేలు కలిగిందనే చెప్పాలి తెలుగులో అనేక సాహితీ ప్రక్రియలు వెలిశాయి రచయితలలో నూటికి తొంబది మంది అరసున్నలు విసంధులు బండిరాలు విసర్జించి ఆధునిక భాషలోనే వ్రాస్తున్నారు వేదం వేంకటరాయశాస్త్రి గారు పాత్రోచిత భాష పేరట ఆధునిక భాషకు స్థానం కల్పించారు గిడుగు వేంకటరామమూర్తి గారి ప్రచార ధోరణి గురజాడ అప్పారావు గారి రచనా ధోరణి ఎందరికో ఆదర్శమైనాయి రచయితలు భావకవిత్వం నుంచి అభ్యుదయ కవిత్వం వైపు మొగ్గు చూపేసరికి ఆనాటి రాజకీయ వాతావరణం కూడా వ్యవహారికోద్యమానికి సహాయపడ్డది గిడుగువారి ధర్మమా అని తెలుగు సాహిత్యానికి నూతనోత్తేజం భాషకు నూతన వికాసం కలిగాయి శాస్త్రవిజ్ఞానాన్ని అందించటానికి అధికారభాషగా ఆధునిక ప్రభుత్వ యంత్రాంగాన్ని నడపటానికి వ్యవహారిక భాష ఇప్పుడు ఉపయోగపడుతున్నది

"కాలమునుబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశ భా
షా లలితాంగి మాఱుఁదిసత్కవి సమ్మతమౌట నన దే
శ్యాలును నాంధ్ర భాషగల వౌటను నొచిత్రి బట్టి మేము క
బ్బాలను వాడుచుంటిమని పండితులేగతి నొప్పుకొందురో "
—తిరుపతి వేంకటకవులు

గ్రాంథిక వ్యవహారమను పేర 9 8 వ సంవత్సరమున నుండిన వైమత ము 943 లో టాల వరకు సశించిపోయినది చరిత నుండి ఆ శేషమే లేదని చెప్పవచ్చును

తెలుగులో సాహిత్య విమర్శనం

విమర న సాహిత్యం సాహిత విమర నం రెండు భిన్న శాఖలు తెలుగులో సాహిత్య విమర నం నవల కథానికవంటి విస్పష్టమైన శాఖగా రూపొందలేదు పరిశోధనం విమర్శనం కలగాపులగంగా కలసి తెలుగులో వెలువడుతున్నాయి సారస్వతక చరిత్రలు సారస్వత విమర నంగా పరిగణింపబడుతున్నాయి

నన్నయ సభా సమావేశాలు శ్రీకృష్ణ దేవరాయల భువన విజయం తంజావూరు ఇందిరా మందిరం నాటి సారస్వతావసరం తీర్చగల విమర నం ఇస్తే ఇవ్వచ్చుగని నేటి విమర్శనం నిష్పాక్షికమైనదని చెప్పడానికి వీలు లేదు సాహిత విమర్శ రచన మునుపటికంటే ఎక్కువయింది ఇది పత్రికల ఆదరణ కూడ పొందింది

ప్రసిద్ధ సాహితీ సంస్థలు మునుపటికంటే ఎక్కువగా విమర న వాఙ్మయాభివృద్ధికి అవకాశం కలిగిస్తున్నాయి _ ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ఏటేటా ఉత్తమ సాహిత్య విమర న గ్రంథానికి బహుమతి నిచ్చు చున్నారు కేంద్ర ప్రభుత్వ సహాయం కూడా సారస్వత విమర నం పొందుతూవుంది ఆంధ్ర సారస్వత పరిషత్తు యువభారతి హైదరాబాదు

నగరం నుంచి విమర్శన గ్రంథాలు ప్రచురించడంవల్ల సాహిత్య విమర్శనం పెంపుదలకు ప్రయత్నిస్తున్నాయి రాష్ట్రస్థాయిలో ఏ ప్రక్రియలకూ లేనంత ప్రోత్సాహం ఆర్థిక సహాయం విమర్శన వాఙ్మయానికి లభిస్తూవుంది

పూర్వ సాహిత్య విమర్శనంలో వస్తువు ఎక్కువగా ప్రాచీన వాఙ్మయం ఇప్పుడు అధికంగా ఆధునిక సాహిత్యం పూర్వ విమర్శనంలో సామాజిక దృష్టి అల్పం నేడు అధికం ఒక గ్రంథం మీద విమర్శనం కంటే అనేక గ్రంథాలలో సాహిత్య తత్త్వం పరిశీలించడం సర్వసాధారణం గానే ఏర్పడింది

ఆంగ్లము నందలి టాల్లురు పత్రిక ననుసరించి అనంతపురము నందలి యువకులు కొందఱు వదరుబోతను పత్రికను నెలకొల్పి యందు వివిధ విషయములపై విమర్శనాత్మకములైన చక్కని వ్యాసములు వ్రాయుండిరి

తెలుగులో సాహిత్య విమర్శకు గూడ వీరేశలింగం పంతులుగారే యాద్యులని చెప్పవలెను ఆంధ్ర కవుల చరిత్ర వారి పరిశోధనకును బట్టుదలకును నిదర్శనమైన యుత్తమ గ్రంథము కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగా రాంధ్ర దేశము నందలి చారిత్రక పరిశోధకులలో నగ్ర గణ్యులు పాశ్చాత్య దృష్టితో విమర్శ సాగించిన వారిలో కట్టమంచి రామలింగారెడ్డిగా రగ్రగణ్యులు వీరి కవిత్వ తత్వవిచార ముత్తమ విమర్శ గ్రంథముగా ప్రసిద్ధినందినది సరసము సమంజసమునైన సారస్వత విమర్శకు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పెట్టినది పేరు ఆంధ్ర విమర్శక పరిశోధకులలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి ప్రత్యేక స్థానమున్నది

ఆచార్య కె వి ఆర్ నరసింహం "సాహిత్య దర్శనం" డా కొలకలూరి ఇనాక్ తెలుగు వ్యాసపరిణామం' డా యస్వీ రామా రావు తెలుగు సాహిత్య విమర్శ ఈ దశాబ్దంలో జరిగిన విమర్శ పరి శోధనలు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ స్వర్ణహంస రామాయణంలో

రహస్యాలు సాహిత్యకౌముది విమర్శన గ్రంథాలలో పూర్వకవుల కవితా సౌందర్యాలు రమణీయముగా నుండును డా జి వి సుబ్రహ్మణ్యం సారస్వత సౌరభం నవ్యాలోకం విమర్శ వ్యాస సంపుటాలలో ప్రాచీన కవితాత్మ దర్శనం నుంచి శ్రీ వానమామలై వరదాచార్యుల కవితా పరామర్శ దాకా విమర్శనం సాగింది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కావ్యపరిమళం 'సాహిత్య సురభి గ్రంథాలలో ఆంధ్ర వాఙ్మయంలోని పద్య పట్టు సందర్భ వ్యాఖ్యానప్రాయమైన విమర్శనం ఉంది

కావ్యచరిత్ర విమర్శనం కావ్యం యొక్క చరిత్రకాని కావ్యాల సమష్టి చరిత కాని గ్రహించి రూపొందించిన విమర్శనం ఇక్కడ పుస్తకం కావ్య ఇతిహాస పురాణ ప్రబంధ యక్షగాన ఉదాహరణ ప్రక్రియా చరిత్ర సంబంధి విమర్శనం గూర్చి పరిశీలింపవచ్చు

ఎంగళి లక్ష్మీకాంతం ఆంధ్ర సాహిత్య చరిత్ర పరిశోధన ప్రభావమున్న సాహిత్య విమర్శనం కవిత్రయ భారతం ప్రముఖంగా పరిశీలింపబడినా ప్రబంధయుగం దాకా ఇందుగలవు

శ్రీ విరుదవోలు వేంకటరావు కృషి ప్రముఖంగా పరిశోధనము భిన్న విషయాలమీద తన అభిప్రాయాన్ని వక్తంచేసే వాదోపవాదాలకు కారణంగా ఉండే విమర్శన వాఙ్మయం వీరు వ్రాయడం జరిగింది

కవి చరిత విమర్శనం - కవుల రచయితల ప్రతే కత వివరించే గ్రంథాలు కవిచరిత్ర విమర్శనలలో భాగం ప్రక్రియా గతంగా కాల గతంగా భావపరిణామ గతంగా కవుల రచయితల జీవితం సాహిత రంగం నుంచి పరిశీలించడం అవసరము

ఈ పదేళ్ళ కాలంలో ప్రాచీన కవుల్లో శ్రీనాథుడు ఆధునికుల్లో విశ్వనాథ ఎక్కువ విమర్శన వాఙ్మయంలో కథానాయకులయ్యారు ఈ యుగంలో విశ్వనాథ మీద వచ్చినంత స్తుత్యాత్మకం (Apprec a on) నిందాత్మకం ( Abus ve ) అయిన విమర్శనం ఏ రచయిత మీదా రాలేదు

భాషా విమర్శనం - ఈ పదేళ లో చాల భాషా వ్యాసాలు వెలువడ్డాయి తెలుగు వ్యాకరణ విమర్శనలు ముందే ఉన్నాయి భాషాశాస్త్రం తీరుతెన్నులు వేరు తెలుగు వ్యాకరణం భాషాశాస్త్ర దృష్టితో చదవటం చెప్పటం పరిశోధించటం ఇప్పుడు ఎక్కువయింది భాషా విమర్శన వాఙ్మయ సృష్టిచేస్తున్న తొలితరం వాళ్ళలో ప్రసిద్ధులు శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి బి యన్ రెడ్డి కోరాడ మహదేవశాస్త్రి వ్యవహారిక భాషాచరిత్ర వికాసం తెలిపే విమర్శన గ్రంథాలు డా జాస్తి నారాయణ డా అక్కిరాజు రమాపతిరావు వెలువరించారు

తెలుగు విమర్శన వాఙ్మయం ఇతర భాషల తత్వం గ్రహిస్తూ ఇతర భాషలకు తన శక్తి ప్రసాదిస్తూ రెండంచుల పదునతో పెరుగుతూ ఉంది

విమర్శనం ఆలోచనా ప్రధానంగా ఉండాలి విమర్శనం కళాత్మకంగా ఉండాలి ఉత్తమ సాహిత్య విమర్శన వాఙ్మయం అవతరించ దానికి ఉత్తమ విమర్శకుడు అవసరం ఉత్తమ విమర్శనం ఉత్తమ సమాజం యొక్క కన్నబిడ్డ ఉత్తమ విమర్శనంలో మానవ సమానత స్వాతంత్ర్య ము గలవని చెప్పవచ్చును

నేటి తెలుగు సాహిత విమర్శనం ఈనాటి సారస్వతానికి సమాజానికి ప్రతిరూపం దీనికి ఉత్తమ మానవ ప్రయత్న మవసరము ఈ దశాబ్దిలో తెలుగు సాహిత విమర్శనం పూర్వంకంటే విశిష్టత సంపాదించుకొంది

కొన్ని సారస్వత సమావేశాల సందర్భాలలోను ప్రభుత్వ సాంస్కృతిక కార్యక్రమ సమయాలలోను సంచికలు వెలువడ్డాయి అఖిల భారత తెలుగు సాంస్కృతిక వారోత్సవాలలోను ప్రపంచ తెలుగు మహాసభలలోను ఆంధ్రరాష్ట్ర హరిజన మహాసభలలోను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సారస్వత విమర్శన వ్యాసాలున్న సంచికలు ప్రచురించింది.

ప్రాచీన వ్యాసాలు సారస్వత వ్యాస సంపుటంగా సాహిత్య అకాడెమీ వెలువరించింది ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో ఒక్కొక్క విషయంమీద ఒక్కొక్క విమర్శన గ్రంథం వ్రాయించింది

యువభారతి సాహిత సంస్థ కొన్ని సాహిత విమర్శన సంకలనాలు ప్రచురించింది చైతన్యలహరి కావ్యలహరి వికాసలహరి ప్రతిభాలహరి మొదలగు గ్రంథాలలో విమర్శలతోకూడిన వ్యాసాలు వెలువడినాయి

తెలుగులో సాహిత్య విమర్శనం ప్రచురించే పత్రికలు ఇప్పుడు ఎక్కువే ఉన్నాయి ఆధునిక ప్రక్రియలు ధోరణుల ఉద మూల ఆలోచన నేటి పత్రికా విమర్శనంలో ఎక్కువగా ఉంటూవుంది ఆంగ్లము నందువలె పత్రికా విమర్శనం తెలుగులో విస్తృతం కాలేదు

విమర్శ అనగా ఆలోచించుట అను అర్థము వచ్చును

హడ్సన్ పండితుడు (Hud on) ఈ విధముగా విమర్శను నిర్వచించెను

"C ic m may be rega ded a hav ng wo d ffe- ren func ons ha of n erpre a on and ha of judgemen "

రిచర్డ్స పండితుడు (R cha d ఇట్లు చెప్పుచున్నాడు

"C c sm a I unde tand he endevour o d v muna e be ween e per ence and eva u e h m "

ఆధునిక విమర్శకుడు తాను విమర్శించు గ్రంథమును బట్టి ఈ క్రింది మార్గములన్నిటినిగాని కొన్నింటినిగాని అవసరమైనట్లనుసరించవలెను

నైతిక విమర్శ - నైతికాదర్శముల నాధారముగా గొని సాహిత్యం విమర్శిస్తే అది నైతిక విమర్శ అగును కవి భావములు మానవుని నైతిక విలువలు పెంచునా అన్న విమర్శ ఇందుగలదు

2 మనస్తత్త్వ విమర - దీనివలన కవి జీవితమునకు అతని గంథమునకును గల సంబంధము తెలియును ఆత్మాశ్రయ కవిత్వమున కిది యన్వయించును

3 సాంఘిక విమర - కవి దేశకాల సంఘ పరిస్థితులకుగల సంబంధమును వివరించుటయే సాంఘిక విమర కొందరు కవులు దేశకాలముపై తమ ప్రభావము చూపనివారు లేకపోలేదు కాని అట్టివారు చాల తక్కువ యనవచ్చును

4 కళా విమర - కళాదృష్టితోనే విమరి ంపవలెననెడిది కళా విమర ఇందు కావ మందలి నిర్మాణ వైచిత్రి ల్ప సౌందర మును సమీక్షి చు జరుగును కవి సర్వస్వతంత్రుడు కవి సృష్టి బ్రహ్మ సృష్టి

5 పౌరాణిక విమర ఇందు మనస్తత్వ పరి లనయు కలదు సాహిత మందలి సాంకేతిక భాష సుగమము చేసి అందలి పరమార్థమును వ కరించుట పౌరాణిక విమర

6 చారిత్రక విమర ఇది సాంఘిక విమర లోని భాగమే కవితా విమర నము చేయువారి దేశకాల పరిస్థితులతో పరిచయ మవసరం లేనిచో కవుల రచనా తత్వమును అర్థము చేసికొన వీలుగాదు

విమర కుని లక్షణములు

మాథ్యూ ఆర్నాల్డు Ma h w Arno d ఈ విషయము చెప్పెను

**"A d n re d end avou o arn and p opa gate he b ha known and though n he wo d and hu o e ab h a curr n of f e h and rue dea "**

దీనిని బట్టి విమర కుడు ముఖ్యముగా ఈ లక్షణములను కలిగి యుండవలెను

విమర కుడు కవి చెప్పిన దానిని సంపూర్ణముగా నిష్పక్షపాతముగా అర్థము చేసుకొనవలెను దానిని తన వ్యాఖ్యానమేమియు లేకుండ పాఠకున కందించవలెను

విమర కుడు ఉన్నత భావముల సమర్థించును

కవి హృదయమును గ్రహింపశక్తి విమర కున కుండవలెను.

విమర యన కావ్య మందలి లోపముల నెన్నుటయే యను ఉద్దేశము కొందరు కలిగియున్నారు కాని కావ్య మందలి గుణములను లోపములను సహృదయతో చెప్పగలిగిన వాడే విమర కుడు

కవి ఆత్మీయతను దర్శించుట విమర కుని ధర్మము దర్శించిన విషయమును రమణీయముగా చెప్పగలుగుటయు విమర కుండవలసిన లక్షణమే అనగా విమర కుడు చక్కని వచన రచయిత అలంకారశాస్త్ర ముతో పరిచయము గలవాడు మరియు శాస్త్ర ప్రమాణ వచనములను తెలిసియుండవలెను

ఎంతటి ఉత్తమ కావ్య మునందైనను చంద్రునిలో మచ్చవలె ఏదైనా లోపముండి యుండవచ్చును విమర కుడు దానిని చెప్పవలెను విమర కుకి పక్షపాత బుద్ధి పనికిరాదు విమర కుడు దోషనిరూపణార్థమే గ్రంథమును చేపట్టరాదు కొందరు కవుల మీద ఇష్టమున్నను, లేకున్నను తన విమర సమగ్రమైనదై సహేతుకమైనదై యుండవలయును విమర కుడు కావ్య మంతయు నామూలాగ్రముగ పఠించి విమర్శింప వలయునేగాని ఏదో యొక భాగమును మాత్రమే గొని, గుణ దోష పరిశీలనము చేయరాదు

విమర యనగా కావ్య ము యొక్క గుణదోషములను నిష్పక్షపాత ముగ ప్రకటించుటయేగాక ఆ కావ్య మందలి కల్పన, పాత్ర సృష్టి మొదల

లగు వానిని గూడ కూలంకషంగా చర్చించి పాఠకునకు ఆ కావ మందలి విషయములను కరతలామలకముచేసి ఆలోచింపజేయునది అనవచ్చును

## 42 తెలుగుభాషకు విదేశీయులు చేసిన సేవ

క్రీ శ పదునారవ శతాబ్దము నుండియు పాశ్చాత్యులు మన దేశమునకు రాకపోకలు సాగించిరి గొందరు వ్యాపారార్థము కొందరు తమ క్రైస్తవ మతమును ప్రచారము చేయు నిమిత్తము వచ్చిరి మతప్రచారకులుగా వచ్చినవారు మన భాషా సాహిత్యములను అధ్యయనము కావించి సాహితీ రంగములో కొంత సేవ చేసిరి కొందరు నాలుగు కాలములపాటు నిలువగల చక్కని రచనలను చేసిరి అట్టి వారిని గూర్చి కొంత తెలిసికొందము

### రాబర్ట్ డి నోబిలి Rob rt De Nob

ఈయన జెసూట్ మిషనరీ చెందిన పాదరీ తమిళముతోపాటు సంస్కృతాంధ్రములు నేర్చెను తెలుగు నేర్చిన తెల్లవారిలో నితడే ప్రథముడు ఈయన ఇటలీలోని మోస్ దేపుల్సియానా అను ఊరిలో 577 వ సంవత్సరమున జన్మించెను ఆయనకు వ ఏటనే క్రైస్తవ మత వ్యాపనము చేయవలెనని కోరిక కలిగెను అతడు భారత దేశమునకు వచ్చి కొచ్చిన్‌లోవున్న మత పాఠశాలలో చేరి మత ప్రచారకుడుగా శిక్షణ పొందెను ఆ కాలములో నాయకరాజులు పాలించుచుండిరి ఇతడు తెలుగు నేర్చుకొన్ననూ తెలుగులో గ్రంథరచన చేసినట్లుగా లేదు తమిళములో చాల రచనలు చేసెను

### జోసెఫ్ కాన్‌స్టన్‌టైన్ Jo ph Con tan ne

ఇతడు 680 లో జన్మించెను 7 0 లో నితడు మన దేశమునకు వచ్చెను ఇతడు ఇటలీ దేశమునకు చెందినవాడైననూ భారతదేశమునకు మత వ్యాప్తికై వచ్చి భారతీయునివలె వీరమాముని అని భారత నామము ధరించి, భారత సంప్రదాయములను పాటించెను వీరమాముని

బహు భాషావేత్త తమిళముతోపాటు అతడు తెలుగు కన్నడములను హిందూస్తానీ పారశీకమును సంస్కృతమును నేర్చినట్లు తెలియుచున్నది తెలుగున కొన్ని గ్రంథములు నొక వ్యాకరణము నీతడు రచించినట్లు తెలియుచున్నది

## బెంజమిన్ షూల్జి

భాషా సాహిత్యములందే కాక ముద్రణ కళయందును పాశ్చాత్యులు అపూర్వమగు కృషి సలిపిరి మన దేశమున ముద్రణ యంత్రముల స్థాపనమునకు పుస్తక ప్రచురణమునకు వారే కారకులు క్రైస్తవ మత గ్రంథములను ముద్రించు నుద్దేశముతోనే వారు ముద్రాక్షరశాలలు నెలకొల్పిరనుట నిర్వివాదము

749 వ సంవత్సరమున కలకత్తాకు సమీపమున శ్రీరాంపురమునకు ఏతెంచిన డా. కేరీ డా. మార్షమన్ వార్డు మున్నగు మత ప్రచారకులు ఆ ఊరిలో మిషనును స్థాపించి వ్యయప్రయాసలకోర్చి వారు సంస్కృతము తెలుగు బెంగాలి మొదలగు భాషలలో ముద్రణాక్షరములు పోతపోయించి ముద్రణాలయములు నెలకొల్పిరి

తెలుగున క్రైస్తవ మత వాఙ్మయమన్నను పుస్తక ప్రచురణమన్ననూ రెవరెండు బెంజమిన్ షూల్జి పేరు తొలుదొలుత స్ఫురణకు వచ్చును అతడు డేనిష్ మిషనరీ చెందిన పాదిరీ 7 9 న అతడు మన దేశమునకు వచ్చెను

బెంజమిన్ షూల్జి బహు భాషావేత్త ఆనాటిలో అతనివలె తెలుగు భాషయందు ఆదరాభిమానములు ప్రదర్శించిన పాదరీ మరి యొకడు లేడనుట అతిశయోక్తి కాదు తెలుగున అతడు కావించిన పరిశ్రమ బహు కొనియాడదగినది షూల్జి తెలుగులో ఈ క్రింది రచనలు చేసెనని తెలియుచున్నది

సత్యమైన వేదంలో వుండె జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం ( 746

2 మోక్షాని కొంచ్చుపొయె దోవ ( 746

3 బుద్ధి కలిగిన నూరు జ్ఞానవచనాం యొక్క చిన్న పుస్తకం

4 ఒక గురువు ఐదు బ్రహ్మాం యొక్క పెద్ద స్వామి మీద ప్రసంగించిన తర్కమిదె 747

5 దేవుని యొక్క నమస్తమైన వాక ము సువిశేషము మమ్మును రక్షించ్చె కర్త అయిన యేసుక్రీస్తు యొక్క శుభసరమ

ఇవి 746 747 సం॥ర్సరముల మధ ముద్రితము లయె ను షూల్జి వీనిని జర్మనీలోని హాలీ-పట్టణమున అచ్చొత్తించెనట పై పుస్తక ములనే కాక బెంజమిన్ షూల్జి బైబిలును కూడ తెనిగించెనని విదితమగు చున్నది బైబిలు ఆంధ్రానువాదకులలో అతడు ప్రముఖుడు తెలుగు సేత వెలుగు చూడకయే చనిపోయెను ఈయన 728 లో తెలుగు భాషకొక వ్యాకరణము వ్రాసెననియు దానిపేరు వరూగియన్ గ్రామర్ అనియు తెలియుచున్నది

## జీగెన్‌బాగ్

బైబిలును తెలుగు చేయ నభిలషించిన వారిలో ఆదు డు ఐ త్తరలోమ్యో జీగెన్‌బాగ్ అను పాదరీ అతడు కూడ డేనిష్ పాదరీయే ఈ తెలుగు సేత తమిళనాడులోని తరంగంబాడి (ట్రాంక్‌బార్ అను చోట ప్రారంభ మయె ను ఆ కాలమందు తరంగంబాడి డేనుల అధీనమున నుండెను

## ఎల్లిస్

796 లో సివిల్ ఉద్యోగిగా ఎల్లిస్ మన దేశమునకు వచ్చెను తెలుగు తమిళము మలయాళము మొదలగు వానిని నేర్చుటయే కాక అతడు ఆయా భాషలను గురించి ప్రశస్తములగు వ్యాసములు కూడ వ్రాసెను తెలుగు ధాతువుల స్వభావము కూడ వివరించెను ద్రావిడ భాషా

తత్త్వశాస్త్ర విషయమై తన సమకాలికులతో ఏకీభ. పక ఒక నూతన సిదా తమును స్థాపించిన కీర్తి ఎల్లిస్‌కు చెందినది

సాహిత రంగమున ఎల్లిస్ ఎనలేని కృషి గావించెను అతని రచనలు వెలుగులోనికి రాలేదు. దురదృష్టవశమున ఎల్లిస్ రచనలన్నియు అగ్నిహోత్రుని పాలయ్యెను. తెలుగు భాషాతత్త్వమును ప్రథమముగా పాశ్చాత్య పండిత లోకమునకు పరిచయము కావించిన ఎల్లిస్ చిరస్మరణీయుడు.

## జె సి మారిస్ J C Morr )

ఈయన 798 న జన్మించెను కొంతకాలము తూర్పు ఇండియా కంపెనీ డైరెక్టరుగా కూడ పనిచేసెను తరువాత సివిల్ సర్వీసులో చేరెను. విశ్రాంతి లభించినప్పుడెల్ల తెలుగు హిందూస్తానీ భాషలందు కృషి చేయుచుండెడివారు తెలుగుభాషే ఆయన ఎక్కువ ఆసక్తి కనబరచుచుండెను చాలకాలము జర్నల్ అఫ్ లిటరేచర్ అండ్ సైన్స్ Jou nal of Lit rature and Science) అను పత్రికకు సంపాదకుడుగా నుండెను 882 లో మారిస్ ఇండియా ప్రభుత్వమునకు తెలుగు అనువాదకుడుగా నియమితుడయ్యెను ఈయన నిఘంటువును వ్రాసెను - John Carnac Morri ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు ఇది రెండు సంపుటములుగా వెలువడెను మొదటిది 885 లోను, రెండవది 889 లోను వెలువడెను ఇది 8 పుటల నిఘంటువు తెలుగు నేర్చుకొనదలచిన పాశ్చాత్యుల కొరకేగాక ఆంగ్లము నేర్చుకొనవలసిన భారతీయులకు కూడ తోడ్పడగల నిఘంటువు.

నిత జీవితమునకు సంబంధించిన మాటలెన్నో ఇందు చోటు చేసుకొనెను వాడుకలో లేకపోయినను కవి ప్రయోగములు గల తెలుగు మాటలను కొన్నింటిని మారిస్ తన నిఘంటువు సందర్భ తొలిపుటలతో చేర్చెను వేమన పద్యములన్ను కూడ అటనట ఉదహరించినాడు అవసర

మని తోచినప్పుడు హిందువుల ఆచార వ్యవహారములను కూడ వివరించినాడు

కడుపు ఒకు మారిస్ ఇచ్చిన ఈ క్రింది వివరణ పరిశీలింపదగినది

"Th wo d s used on y n such ph a e as నీ కడుపుకాల = May your ch d d e " నీ కడుపు చల్లగా ఉండని = May your ch dren ve happ

ఈ ఒక్క నిఘంటువునేకాక మారిస్ "Te ugu e ec on w h an a ons and G amma ca Ana y es" అను పాఠ పుస్తకమును కూడ రచించెను ఇది ఆ దినములలో సుప్రసిద్ధమైన పాఠ గ్రంథమట మారిస్ తెలుగులో పరీక్షాధికారిగా ఉండ నుండెనని తెలియు చున్నది మారిస్ తెలుగుభాషకు మిగతా విదేశీయులవలె అమోఘమైన సేవ చేసెను అయన రచించిన నిఘంటువు ఆ కాలములో ప్రామాణికమైన నిఘంటువుగా పరిగణింపబడెనని D c ona y of Na ona B o graphy (Vo X నుండి విదితమగుచున్నది పాశ్చాత్య పండిత లోకములో తెలుగు భాషా వ్యాప్తికి తోడ్పడిన చిరస్మరణీయుడు జె సి మారిస్

విలియం కేరీ W am Carey)

76 లో కేరి జన్మించెను మన దేశమునకు 794 లో వచ్చెను అప్పటికతడు ముప్పదిమూడేండ్ల యువకుడు మరణించునాటి కతని వయస్సు డెబ్బదిమూడేండ్లు ఈ నలుబదేండ్ల సుదీర్ఘ కాలములోను అతడు మరల తన దేశమగు ఇంగ్లాండునకు వెళ్ళలేదు అతని తలంపు లన్నియు భారతావనియందే లగ్నమై యుండెను మత ప్రచారము మీది ఆసక్తితో మన దేశమునకు వచ్చి అతడు భారతీయభాషల నభ్యసించెను మన దేశమును రెండవ స్వదేశముగా భావించి భారతీయ భాషలకు సేవ చేసి ఆదర ప్రాయుడయ్యెను మన దేశమునకు వచ్చిన మొట్టమొదటి బాప్టిస్టు మిషనరీ అతడే కేర్రీ ఒక ముద్రణ యంత్రమును కొని అచ్చు

పమంలో నిమగ్నుడయ్యెను కాని 799 లో కురిసిన వానల ఫలితముగా అతని కృషి నిష్ఫలమయ్యెను అచ్చుపడిన ఫారములు మున్నగునవి వెల్లువలో కొట్టుకొనిపోయెను

ఇట్లుండగా అప్పటి గవర్నరగు లార్డ్ వెల్లస్లీ ఒక ప్రకటన కావించెను దేశ భాషలలో తగినంత పరిజ్ఞానము సంపాదించిన సివిల్ ఉద్యోగులకే బాధ్యతాయుతములగు పదవులు లభింపగలవు అనునది ఆ ప్రకటనలోని ముఖ్య విషయము తత్ఫలితముగా సివిల్ ఉద్యోగులకు దేశభాషలు బోధించు నుద్దేశముతో కలకత్తాలో ఫోర్టు విలియం కాలేజీ స్థాపింపబడెను ఆ కళాశాలలో కేరీ సంస్కృత వంగ భాషోపన్యాసకుడుగా నియమించెను కొన్నాళ్ళకు మరాఠీ కూడ బోధింపవలసివచ్చెను తరువాత కేరీ ప్రభుత్వ అనువాదకునిగా కూడ నియమితుడయెను

స్వయముగా తాను భాషాధ్యయనము చేయునప్పటికంటె, ఇతరులకు భాషా బోధన కావించునప్పుడే వ్యాకరణములయు నిఘంటువులయు ఆవశ్యకతను కేరీ బాగుగా గుర్తించెను కనుకనే అతడు తొలుత బెంగాలీ వ్యాకరణమును బెంగాలీ నిఘంటువును వ్రాయుటకు పూనుకొనెను. కాలక్రమమున మరాఠీ ( ౦05) సంస్కృతము 806), పంజాబీ ( 8 2) తెలుగు 8 4) భూటానీస్ 826) మొదలగు భాషలకు వ్యాకరణములను మరాఠీ ( 8 0) బెంగాలీ ( 8 6) భూటానీస్ ( 826) మున్నగు భాషలలో నిఘంటువులను ప్రచురించెను 8 8 లో తన ఆప్తమిత్రుడగు ఫుల్లరునకొక జాబు వ్రాయుచూ అందులో నిట్లు పేర్కొనెను ఇప్పుడే నా తెలుగు వ్యాకరణపు ప్రెస్సుకాపీ పూర్తి అయినది పంజాబీ వ్యాకరణపు తుది పుట అచ్చులో ఉన్నది కర్ణాట వ్యాకరణపు ప్రెస్సు కాపీ కూడ తయారయినట్లే కాశ్మీర్ పుస్తో బిల్లోచి భాషల వ్యాకరణముల రచనకు కావలసిన విషయములను సేకరించితిని ఒరియా వ్యాకరణమును

మొదలిడితివి. బర్మన్ వ్యాకరణమును ఒక్కసారి సరిచూచి ప్రకటించు భారము నాపై గలదు. బైబిలులోని క్రొత్త నిబంధనను అన్ని భాషలతో పాటు తెలుగులోనికి అనువదించెను

కలకత్తాలోని ఫోర్టు విలియం కాలేజిలో సంస్కృత వంగ మహారాష్ట్ర భాషలలో ఆచార్య పదవి నలంకరించిన పండితుడు బైబిలు అనువాదమును నలువది భాషలలో ప్రచురించుటకు తోడ్పడిన బహు భాషాభిజ్ఞుడగు డాక్టరు విలియం కేరీ చేసిన తెలుగు ప్రశంస ఇది

"తెలింగ (తెలుగు) కార్నాటక్ (కన్నడం) తమిళం మలయాళం, సింగాలీస్ (సింహళం) ఈ అయిదు భాషలలోను తెలుగు బహుశా పరిణతి చెందిన భాషగా కనపడుచున్నది ఇది కష్టమైన భాషయే అయినను నేర్వదగిన భాషలలో ఒకటి ఇందు విభక్తి వైవిధ్యముగలదు ఈ కారణమున ఈ భాషలో సులభముగా సుందరముగా ఎక్కువ తక్కువలు లేకుండగను భావ ప్రకటన చేయుటకు ఎక్కువ అవకాశము గలదు

18 4 లో ఆయన ప్రచురించిన తెలుగు వ్యాకరణము నందలి మున్నుడిలో ఈ ప్రశంస అందాలు దిద్దుకున్నది తెలుగు భాషను గురించి ఇంతగా ప్రశంసించిన ప్రముఖ పాశ్చాత్య పండితులలో బహుశ కేరీయే ప్రథముడనదగును. ఆ కాలములో విలియం కేరీ వంటి బహుభాషావేత్త మరొకరు లేరనుట అతిశయోక్తి కాదు

కేరీ తన తెలుగు వ్యాకరణమున వ్రాసిన మున్నుడిలో తెలుగు తమిళము మున్నగు దాక్షిణాత్య భాషలను గురించి ముచ్చటించుచు ఇట్లనెను:

"The languages of Ind a are pr nc pal y derived from he Sanskrit The s ructure of most of the languages in the m dd e and north

of India gene a y he same the ch ef d ffer - ncc n them es n he erm na on of nouns and b and n hose dev a ons from San kr or- thography wh ch cu om ha g adua y e ab hed in he Coun r e where hey are poken "

అతని దృష్టిలో భారత భాషలన్నియు సంస్కృత జన్యములనుట నిస్సంశయము అనేక పాశ్చాత్య పండితులుగూడ భారతీయ భాషలకు సంస్కృతము జనని అనియు సంస్కృత భాషా సహాయము లేకుండా ఈ భాషలలో ఒక్క వాక మైనను వ్రాయుటకు వీలుపడదనియు పేర్కొనిరి ఈ సిద్ధాంతములను సహేతుకముగా ఖండించి తెలుగు తమిళము మొదలగు దక్షిణ దేశభాషలు సంస్కృత భాషాజనములు కావనియు కాల్డ్వెల్ మొదలగు పండితులు భావించిరి దక్షిణదేశ భాషా కుటుంబమునకు ద్రావిడ భాషా కుటుంబమని నామకరణము చేసనవాడు కూడా కాల్డ్వెల్ పండితుడే.

ఆ కాలములో మన దేశము నందలి వివిధ భాషలకు ముద్రణాక్షరములు లేకుండెను కనుక శ్రీరాం పురం ప్రెస్సుకు మరొక ఫౌండ్రీని స్థాపించి ముద్రణాక్షరములు పోత పోయించిరి కాని 8 2 మార్చిలో ప్రెస్సులో ఏర్పడిన అగ్నిప్రమాదము వలన కేరీ కృషి చాలవరకు విఫలమయ్యెననియే నుడువవలసి యున్నది మూడున్నర టన్నుల ఇనుము కరిగిపోయెను అచ్చు ఫారములు కేసులు కుర్చీలు కాగితములు వ్రాతప్రతులు మొదలగునవి దగ్ధమయ్యెను 0 000 పౌనులు విలువ చేయు వస్తువులు నష్టమయ్యెనని అంచనా కట్టిరి అప్పుడును నిరుత్సాహమును చెందక, అకుంఠితమైన కార్యదీక్షతో అచంచలమయిన విశ్వాసముతో కేరీ ఒక మిత్రుని సహాయముతో మరల తన పనులలో నిమగ్నుడయ్యెను

ఇటుల ఆపదలలో ధైర్యము కూడగట్టుకొని కష్టములను సహించి తెలుగు భాషకు ఎనలేని సేవ చేసిన డాక్టరు విలియం కేరీ 83 వ సంవత్సరములో అస్తమించెను

## 43 సి పి బ్రౌన్ సాహితీ సేవ

తెలుగు భాషా వాఙ్మయ చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోయిన మహనీయుడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (Char e Ph p B own కాలగర్భంలో కలిసిపోకుండ ఎన్నెన్నో తెలుగు రచనలను ఎంతో శ్రమ పడి కాపాడిన మనుడు కనకనే కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆ నిష్కామ భాషాభిమాని ఆంధ్రులకు బూజాపాత్రుడు అని పేర్కొన్నారు

క్రీ శ 817 లో తూర్పు ఇండియా కంపెనీ (Ea ndia Company) ఉద్యోగిగా బ్రౌన్ భారత దేశానికి వచ్చిన కొంతకాలము నకు కడప జిల్లా కలెక్టరుకి అసిస్టెంటుగా నియమితులయ్యారు హన్బ (Honbary) అనే ఆయన అప్పటి కలెక్టర్ ఆయన తెలుగులో అనర్గళంగా మాట్లాడేవారు ఆయనవలె తానూ తెలుగు బాగా మాట్లాడాలనే అభిలాష బ్రౌనుకు కలిగింది రెండు సంవత్సరములలో తెలుగు బాగా నేర్చుకొని సునాయాసంగా మాట్లాడటం అలవర్చుకొనెను

స పి బ్రౌన్ తెలుగు వారికి చిరస్మరణీయుడు కావడానికి కారణం తెలుగు భాషా సాహిత్యాలకు ఆయన చేసిన అనల్పమైన సేవయే అం చెప్పుట అతిశయోక్తి కాదు కావ్యసేకరణ ప్రచురణతో పాటు వేమన పద్యాలు సుమతి శతకం మొదలైన వాటిని బ్రౌన్ ఆంగ్లము చేసెను. ఈ ఆంగ్లానువాదమువలన వేమన మొదలైన తెలుగు కవులు అన్యదేశర

లకు పరిచితులైనారు అదే విధముగా బైబిలునుంచి లూకా సువార్త అపోస్తలుల కార్యములు (The go pe accord ng S Lûke and he Book of Ac s from he New Te amen of he Ho y B b e) అనే అనువాదములను ప్రకటించెను ఇవిగాక బ్రౌన్ ఎన్నో లఘు రచనలను చేసెను అయితే ఆయనకు అపారమైన కీర్తిని ఆర్జించి పెట్టినవి ఆయన వ్రాసిన తెలుగు వ్యాకరణము తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు ఇంగ్లీషు తెలుగు నిఘంటువు మిశ్రభాషా నిఘంటువు మొదలైనవి

ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణం వ్రాసిన వారిలో బ్రౌన్ ఆద్యుడు కాకపోయినా అతి ముఖ్యుడు బ్రౌన్ వ్యాకరణంలో పన్నెండు భాగము లున్నవి మొదటి భాగంలో వర్ణ సమామ్నాయము రెండవ భాగంలో నామవాచకములు మూడవ భాగంలో సర్వనామములు నాలుగవ భాగములో క్రియలు అయిదవ భాగంలో వాక్యరచన ఆరవ భాగంలో విశేషణములు ఏడవ భాగంలో వాక రచనలో క్రియలు ఎనిమిదవ భాగములో అసమాపక క్రియలు తొమ్మిదవ భాగంలో భూత భవిష్యత్ వర్తమాన కాలములు పదవ భాగంలో సహాయక క్రియలు పదకొండవ భాగములో ఛందస్సు పన్నెండవ భాగంలో శబ్ద వ్యుత్పత్తి మొదలగునవి వివరించబడినవి ఈ వ్యాకరణంలోని ఛందో ప్రకరణం పరిశీలించిన యెడల బ్రౌన్‌కుగల బహు భాషా పాండిత్యము స్పష్టమవుతుంది ఇతడు వ్యావహారిక భాషావాదియే అయినా ఆయన తన వ్యాకరణంలో గ్రాంథిక వ్యవహారిక రూపాలకు సమాన ప్రాధాన్యం ఇవ్వడం గమనించదగిన అంశం

తెలుగులో పాశ్చాత్యులు కూర్చిన నిఘంటువు అనగానే బ్రౌన్ పేరు స్ఫురణకు రావడం పరిపాటి బ్రౌన్స్ తెలుగు-ఇంగ్లీషు ( 6+ 804 పుటలు) నిఘంటువు 852 లో వెలువడింది తెలుగు భాషాధ్యయన

సందర్భంలో తానీ నిఘంటువును తనకోసం సమకూర్చుకున్నట్లు బ్రౌన్ ఉపోద్ఘాతంలో వ్రాసుకొనెను అయినా ఇది అందరికి కల్పవృక్షమైంది 1852 లోనే బ్రౌన్ కూర్చిన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు (80+ 872 పుటలు) వెలువడింది ఈ నిఘంటువు తెలుగువారి సౌకర్యార్థంకోసం యుద్దేశింపబడినట్లు ఆయన తన మున్నుడిలో పేర్కొనెను కావున బ్రౌను నిఘంటువులు తెలుగ వారికి తరగని పెన్నిధులు యని చెప్పడం యెంతైనా సమంజసం

వేమన పద్యాలను ఆంగ్లానువాదము చేయడం ద్వారా తెలుగు కవితను తొలిసారిగా ఇంగ్లీషు చేసిన ఘనత బౌనుకే దక్కింది ఫ్రెంచి దేశస్తుడైన జె ఎ దుబాయ్ అనే ఆయన వ్రాసిన హిందూ మేనర్స్ H ndu manners) అనే పుస్తకంద్వారా వేమన పేరును తెలుసుకొని దాదాపు రెండు వేలదాకా వేమన పద్యాలు ప్రోగు చేశాడు ఆ తరువాత వాటిని నీతి వ్యంగ్య అనే ప్రధాన భాగాల క్రింద వర్గీకరించెను బ్రౌను గారికి బాగా నచ్చిన ప్రజా కవి వేమన యనవచ్చును

బ్రౌనుగారి జీవితకాలం ఆర్జించిన ధనం గడించిన విజ్ఞానం, బౌద్ధికమైన పలుకుబడి అన్నీ తెలుగు సాహిత్యపునర్వికాసానికే ఎంతగానో తోడ్పడినవి తెలుగుసాహిత్యంలో నవ్యతను ప్రవేశపెట్టిన బ్రౌన్ నవ్యాంధ్ర సాహిత్య నిర్మాతలలో ఒకరని నిస్సంశయముగా చెప్పవచ్చు

44 ఆధునిక యుగమున తెలుగు భాషలో చేయబడిన ప్రక్రియలను పాశ్చాత్య రంగములో సమీక్షించునది

ఆధునిక యుగమునందలి కొందఱు కవులు తమ ప్రాచీన సాహిత సాంప్రదాయములను పునరుద్ధరింపవలెనని దీక్ష పూనిరి ఈ కాలముననే చిన్నయ సూరి యాంధ్రభాష కొక వ్యాకరణము నిర్మించిరి దానికి సరిపోవునట్లుగా నీతి చంద్రిక యను గద్య కావ్యమును రచించి, చిన్నయ

ఎద ముతకు దాను గద్యమున కాద్యు డనిఎంచుకొనెను ఆయన యొక ఎఘంటునుగూడ రచించుట కారంభించి యది ముగియకుండానే దివంగతు డయె ను ఈ సమయములోనే చార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్ (Char es Ph p B own అను ఆంగ్లేయుడు ఆంధ్రదేశమునకు కలెక్టరుగా చ్చి యాంధ్రభాష కపారమైన సేవ యొనరించెను ఆంధ్రా గ్ల నిఘంటువును గూడ నిర్మించెను తరువాతి కాలములో కొన్ని స్వతంత్ర రచనలు జరిగినవి శ్రీపాద కృష్ణమూర్తిగారు రచించిన శ్రీక ష్ణ భారతము వావిలికొలను సుబ్బారావుగారి ఆంధ్ర వాల్మీకి రామాయణము మంచి శేషాద్రిశర్మగారి జనమంచి రామాయణ బ్రహ్మా ద పురాణములు మొదలగునవి సంస్కృత నాటకముల యాం ధీకరణము కూడ జరిగినది పురాణము ప్రబంధము శతకము నాటకము మున్నగు ప్రాచీన సాహిత్య ప్రక్రియలన్నియు బునరుద్ధరింపబడెను

శ్రీ తిరుపతి వేంకట కవులు పాండవ వనవాసము పాండవ జననము ఉద్యోగము విజయముల నాటకములు రచించిరి వీరు దేవీ భాగవతము శ్రవణానందము బుద్ధచరిత్రము నానారాజ సందర్శనము మొదలగు గ్రంథములను గూడ రచించిరి ఆధునిక యుగములో కందుకూరి వీరేశలింగం పంతులుగారికి ప్రత్యేక స్థానమున్నది నవయుగ కానుద న్న బిరుదము కలదు నవల కథ ప్రహసనము, నాటకము స్వీయ చరిత్రము రచించిరి శకుంతలానువాదము, రాజశేఖర చరిత్ర యను తెలుగులో మొదటి నవల వీరిదే ఆంగ్ల ప్రభావముచే ఖండకావ్యములు ఖండ కావ్యములు ఆత్మాశ్రయ కవిత్వము, ప్రకృతి కవిత్వము మర్మ కవిత్వమని యైదు విధములుగా విభజింపవచ్చును

క్రి శ 9 0 ప్రాంతమున క్రొత్త పాత మేలుకలయిక క్రొమ్మెలుంగులు చిమ్మ కి శే గురజాడ అప్పారావుగారు క్రొత్త పద్ధతిలో రచనలు గావించిరి ఇదే సమయములో రాయప్రోలు సుబ్బారావుగారు

లలిత యను లఘు కావ మును రచించిరి శ్రీ దువ్వూరు రామిరెడ్డిగారు కూడ కొన్ని లఘు కావ్యములు వ్రాసిరి

క్రీ శ 922 లో నవ కవితా ప్రచారమునకొఱకు సాహితి భారతి యను ప త్రికలు నెలకొల్పబడెను వాటిలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు జాషువా కవి రచనలు ప్రచురింపబడెను బసవరాజు అప్పారావుగారు నవ కవులలో మొదటివారు ప్రేమ వేదన నిరాశ యను భావము వీయన కావ ములలో నిండియుండును శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కాలమననే సాహితీ సమితి సభ్యులై పద్యములు ప్రకటింప నారంభించిరి సాంఘిక సాహిత్య శృంఖలాలను ఛేదించి, వ్యక్తికి సుఖ శాంతులు ప్రసాదింపలేని సంఘముపై తిరుగుబాటు చేసెను దువ్వూరి రామిరెడ్డిగారు కర్షక జీవనము చిత్రించుచు, చక్కని కావ్యము రచించి నారు వీరు రచించిన కృషీవలుడు దేశమున మంచి ప్రతిష్ఠ నార్జించి నది దానికిని పాశ్చాత్యుల పాస్టరల్ పొయిట్రీ Pa ra Poe ry కిని చాలా సాదృశ్యమున్నది ఇదే సమయమున కవికొండల వేంకటరావు గారు అడవి బాపిరాజుగారు జానపద గీతములు వ్రాయ నారంభించిరి బాపిరాజు కవి గాయకుడు చిత్రకారుడు ఈ మూడు కళలను ముద్దజేసి అద్భుతమైన గేయములు రచించారు ఆయన రచించిన వరద గోదా వరి అద్భుతమైన క్షుద్రకావ్యము

పాశ్చాత్యుల మిస్టిక్ పొయిట్రీ (My c Poe ry ని ననుసరించి యువకవులు కొందఱు తెలుగున కూడ మర్మకవిత్వము సాగించిరి దువ్వూరి రామిరెడ్డిగారిట్టి కవిత్వమునకు మార్గదర్శకులు మల్లవరపు విశ్వేశ్వరరావుగారు, కొంపెల్ల జనార్దనరావుగారిట్టి కవిత్వ మును అనుసరించిరి. విశ్వేశ్వరరావుగారిపై రవీంద్రుని ప్రభావము పుష్కలముగా గోచరించును గిడుగు రామమూర్తి పంతులుగారు నడిపించిన వ్యవహార భాషోద్యమము గమనీయము నండూరి వెంకట

బ్బారావుగారి ఎంకి పాటలు ఈ కోవకు చెందినవి విశ్వనాథ సత్య నారాయణగారి కిన్నెరసాని పాటలు కూడ వ్యవహారిక భాషలో వ్రాయ బడినవే

తరువాత దేశభక్తిని పబోధించే గురజాడ అప్పారావుగారి దేశమును ప్రేమించుమన్నా" గరిమెళ్ళ సత్యనారాయణగారి మాకొద్దీ తెల్లదొరతనము బసవరాజు... లక్ష్మీకాంత కవిగారి స్వరాజ్య రథము ఈ కోవకు చెందియున్నవి ఒకవంక దేశ ప్రజలలో స్వాతంత్ర్యవాంఛ చెం గుచుండ నాంధ్రులలో ప్రత్యేక రాష్ట్రవాంఛ ప్రబల జొచ్చినది శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ విద్యాలయములు మున్నగు పద్యములు విశ్వనాథగారి ఆంధ్ర పౌరుషము ఆంధ్రప్రశస్తి మున్నగునవి

శ్రీశ్రీ పిప్లవకవి "పద డి ముందుకు పదండి త్రోసుకుపోదాం పోదాం పైపైకి" ద్వితీయ సంగ్రామానంతరము కవి యుద్ధభటునివలె గోచరించును ఈ కాలపు కవితకు అభ్యుదయ కవిత యను పేరు గలదు కర్షక కార్మికుల కడగండ్లు ధనికుల దౌష్ట్యములు వీరి కవితా సామాగ్రి ప్రేమ కరుణరసముల స్థానములో రౌద్ర బీభత్స భయానక ములు నెలకొనినవి నారాయణబాబు ఆరుద్ర దాశరథి కాళోజీ నారా యణరావు పట్టాభి మొదలగువారు ఈ కోవకు చెందినవారు పలువు రాధునిక కవులకు ఎతమై యొప్పువారు కవిసామ్రాట్ విశ్వనాథ సత్య నారాయణగారు

ఈ విధముగ నాధునిక కాలమున ప్రతిభావంతులైన కవులు పలువురు నూతన ప్రక్రియలను చేపట్టి పలువిధముల కాటుపడియుండిరి వానిలో గొన్ని స్వల్పకాలము మాత్రము నిల్చి సడలిపోయినవి కొన్ని

యిప్పటికిని గొంయూవరితో గొనసాగచునే యున్నవి నూతన మార్గము లెన్ని వచ్చినను ప్రాచీన విధానము నవలంబించువారు పూర్వకవుల మార్గము ననుసరించి కావ్యములను సృజించుచునే యున్నారు కాళిదాసు చెప్పినట్లు ప్రాతదైనంతమాత్రాన ప్రతి కావ్యము సాధువు కాజాలదు నవీనమైనంత మాత్రమున దేనిని నిరసింపరాదు బుద్ధిమంతులు బాగుగా బరిశీలించి యుత్తమము ప్రశస్తమైన పద్ధతి నాదరింపవలయును అట్టియే ప్రశస్తమై యుజ్జ్వలమైన కవిత్వమును నిర్మింపజాలును

45 తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు భాషా సాహిత్యములు నెరపిన ప్రభావమును సంగ్రహముగా విశదీకరించునది

తన ఇరుగు పొరుగు సాహిత్యము - సంస్కృతుల ప్రభావము సోకని సాహిత్యమనునది లేదనుట సత్యదూరముకాదు అతి ప్రాచీనమైన సంస్కృతము గ్రీకు లాటిను భాషల విషయములోనే ఈ వాక్యము సార్థకమైయుండదు మిగిలిన భాషల విషయములో వేరుగా జెప్పబనిలేదు. ఈ సంబంధము వలన క్రొత్తదనము సాహిత్యమునకు వచ్చును అవి కలుపు మొక్కలో ఎరువు మొక్కలో నిర్ణయించుకొను నధికారము సాహిత్యమునకు గలదు

ఇట్టి సంబంధమే పాశ్చాత్యులు మన భారతదేశమునకు వచ్చుట వలన మన భాషలకును వారి భాషలకును కలిగెను ఆంగ్ల సాహిత్యము నందు విదేశసాహిత్యముల ప్రభావము అనంతముగ కనిపించును ఆంధ్ర సాహిత్యము మీద 850 సంవత్సరముల నుండి కొలదిగనో గొప్పగానో ప్రభావము చూపుచూ వచ్చిన ఆంగ్ల సాహిత్యము ఇతర భాషల సంబంధము లేకుండా పెరుగనేలేదు

7 వ శతాబ్ది ప్రారంభములోనే పాశ్చాతులు ఆంధ్రభూమిపై కాలిడిరి క్రమ క్రమముగా ఇంగ్లీషు చదువులు దేశములో స్థిరపడిన తరువాత పాశ్చాత సాహిత ములతో ఆంధ్ర విద్యా వంతులకు సంపర్కమ్ము కలిగెను

ఆంగ్లేయుల సంపర్కమువలన తెలుగు భాషా సాహిత్యములలో కలిగిన మార్పులను నాలుగు భాగములుగా విభవింపవచ్చును

1 ఉష కాలము కీ శ 16 17 18 శతాబ్దముల కాలము

ఈ కాలమున పాశ్చాతులు రాక క్రైస్తవ మత ప్రచారము మొదలయిన వానివలన తెలుగు సాహిత్యములో మార్పులు వచ్చుట ప్రారంభమయ్యెను క్రైస్తవ ధర్మముతో గూడ ప్రజలకు ఈ కాలముననే తగినంత పరిచయ మేర్పడెను ఆ మతావేశముతో వ్రాయబడిన తెలుగు గ్రంథములలో అనువాదములలో దానికి సంబంధించిన పదజాలము భావ ప్రాచుర్యము కొంత ఉండుట సహజము

2 19 వ శతాబ్దపు పూర్వార్ధము - ప్రౌఢ్యయుగము

పాశ్చాత్యులు తెలుగు నేర్చుకొని కృషిచేసిన కాలమిది ఇట్లు తెలుగు నేర్చుకొన్నవారిలో 8 తెగల వారున్నారు

క్రైస్తవ మత వ్యాప్తికై తెలుగు నేర్చుకొని అందు కృషి చేసిన మిషనెరీలు మొదటి తెగవారు.

ఉద్యోగధర్మము ననుసరించి వాణిజ్య మభివృద్ధి చేసుకొనుటకుగాను తెలుగు నేర్చుకొని అందు వ్యవహారిక జ్ఞానము తోడనే తృప్తిపడినవారు రెండవ తెగవారు

( ) భాషాభిమానముచే అందు కృషిచేసిన మిషనెరీలు (ఉదా C P B own మూడవ తెగవారు

3 వీరేశలింగయుగము - 9 వ శతాబ్ది ఉత్తరార్ధము

వీరికి నవయుగ వైతాళికుడన్న బిరుదము కలదు ఈయన రచనలు ఆంగ్ల సాహిత్య సాంస్కృతులు సోకిన రచనలు ఈయనకు నవయుగ భానుడన్న బిరుదముకూడ కలదు W ca of he wake f e d ను అనుసరించి రాజశేఖర చరిత్రను వీరు రచించిరి

4 నవీనయుగము - 9 వ శతాబ్ది ఉత్తరార్ధము నుండి నేటివరకు ఆధునిక రచనలు సాగినకాలము

పాశ్చాత్యుల రాకతో క్రైస్తవ మత ప్రభావము ఆం ధ దేశముపై బడెను ఈ మతమునందుగల నమ్మకము చేతనో పాశ్చాత్యుల ప్రాపు సంపాదించుటకో క్రైస్తవ మత ప్రధానములైన ఇతివృత్తములను గ్రహి చి రచనలు సాగించిన కవులు గూడ 8 వ శతాబ్దమందు కలరు

9 వ శతాబ్ది ప్రారంభము వరకు తెలుగులో జరిగిన రచనలలో పాశ్చాత్య భావ ప్రాబల్యముకంటె భాషా ప్రాబల్యమే ఎక్కువగా కనిపించింది మొట్టమొదట సలక్షణ భాషలో గ్రంధశైలిలో క్రైస్తవ మత ప్రధానమైన రచనలు బయలుదేరిననూ కాలక్రమమున తెలుగు నేర్చుకొని వ్రాసిన పాశ్చాత్యుల రచన లధికములగుటతో క్రైస్తవాంధ్రము విలక్షణమైన తెలుగుగా రూపొందింది

ఈ సమయమందే చార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్ (Char e Ph ps Brown) అను ఆంగ్లేయుడు ఆంధ్రదేశమునకు కలెక్టరుగా వచ్చి యాంధ్ర

భాష కపారమైన సేవ యొనరించెను ఈయన తెలుగు నుండి ఇంగ్లీషున కును ఇంగ్లీషు నుండి తెలుగునకును నిఘంటువులు వ్రాసెను

పాశ్చాత్యుల పాస్టరల్ పొయిట్రీ (Pa a Poe ry) ననుసరించి దువ్వూరు రామిరెడ్డిగారు కృషీవలుడు రచించిరి మిస్టిక్ పొయిట్రీ (My c Poe y యనవకవులు కొందరు తెలుగున మర్మ కవిత్వము సాగించిరి ఆంగ్ల నాటకానువాదములు ఈ కాలముననే జరిగి నవి నాటకములోని ప్రొలొగు ఎపిలోగు (Pro ogue ep ogue) ప్రవేశపెట్టుట ఈ కాలముననే ప్రారంభమయ్యెను

క్రైస్తవులు కాని విద్యావంతులైన తెలుగువారిపై బైబిలు ప్రభా వము పరోక్షముగా పడినది క్రైస్తవ మిషనరీలు దేశములో దాల విద్యా సంస్థలు నడుపుచుండుట చేతను అందు బైబిలు పఠనము ప్రోత్సహించు చుండుటచేతను నవీన విదా పద్ధతి పాశ్చాత్య సంస్కార యుగమగుట చేతను క్రైస్తవేతరులపై గూడ బైబిలు తన ప్రభావమును చూపినది

క్రమముగా దేశమున నైతిక పురోభివృద్ధి కాంక్షించిన విద్యావంతు లందరును మతముతో నిమిత్తము లేకుండ క్రైస్తవ మత సిద్ధాంతము లపై గౌరవాభిమానములను చూపి బైబిలు పఠింప జొచ్చిరి పాశ్చాత్య నాగరికత ఆంగ్ల సంస్కారము మూలమున మనకు తెలియబడుటవలనను ఆంగ్లేయులు క్రైస్తవులగుట వలనను మనవారికి పాశ్చాత్య సభ్యతలోని మంచి అంతయు క్రైస్తవ సిద్ధాంతాచరణమువలననే వచ్చినట్లు తట్టినది కనుక పాశ్చాత్య నాగరికతాభిమానులందరు క్రైస్తవ నీతి సిద్ధాంతము లను గౌరవింప జొచ్చిరి

సంఘములోని లోపములను సంస్కరింపవలెనని బద్ధకంకణులైన వారందరకును క్రైస్తవ సిద్ధాంతములోని సాంఘికమైన విలువ ఆదర పాత్ర మయినది అందువలన వారు ఆ సిద్ధాంతమును మనసులో నుంచుకొని సంఘసేవ చేయ జొచ్చిరి సంస్కరణాభిలాషులై దానికి పనికివచ్చు సాహిత్యమును సృష్టింప జొచ్చిరి ఆ సిద్ధాంతములను బోలిన సిద్ధాంతములను సనాతనములైనవాటిని పైకి తీసిరి

భారతదేశములో ఆంగ్లేయుల పరిపాలన స్వదేశీయుల రాజకీయార్థిక నైతిక జీవితములందు మార్పులు తెచ్చెను ఆ సమయాంతరములోని భారతదేశ మొక్కసారిగా యూరపు దేశములో నున్నట్లయ్యెను

అట్టివారిలో ఆంగ్ల సాహిత్య స్రవంతిలో దిగినవారు కొందరు జలకమాడినవారు కొందరు, తీరమున నడచినవారు కొందరు ఎవరేం చేసిననూ ఆ నదీశీకరముల చలువ కొంతకు కొంత సోకనివారు అరుదే

సాహిత్యమును సంఘ సంస్కరణార్థ సాధనముగా నుపయోగించి ఒకవైపు సాహిత్యమును ఇంకొకవైపు సంఘమును అభ్యుదయ మార్గమున పవర్తింపజేసిన నవయుగ మార్గదర్శకులు వీరు

శ్రీ కందుకూరి వారు 848 లో రాజమహేంద్రవరములోని ఒక బీద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు తెలుగు సంస్కృత ఆంగ్ల భాషలో పాండిత్యం సంపాదించి రాజమహేంద్రవరం కళాశాలలో తెలుగు ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించిన పంతులుగారు మొట్టమొదట తన దృష్టిని సంఘ సంస్కరణపై ప్రసరించారు బాల్య వివాహాలు పనికి రావని వితంతు వివాహాలు జరిపించవచ్చునని స్త్రీలకు విద్య సమాన హోదా ఉండవలెనని వాసాల ద్వారా ఉపన్యాసాల ద్వారా బ్రహ్మాండమైన ప్రచారం చేశారు

పంతులుగారు విద్యార్థి దశలోనే సరస మంజులమైన కవిత్వము రచించుటకును విషయ గంభీరములైన యుపన్యాసము లొసంగుటకును ప్రారంభించిరి సంఘములో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలపై యొక స్థిరమైన యవగాహనకు రాగలిగిన స్త్రీ జనోద్ధరణ పరాయణుడు వీరేశలింగంగారు అందుకువారు వివేకవర్ధిని యను పత్రికను స్థాపించి, యందు వితంతు వివాహములను స్త్రీ విద్యావశ్యకతను సమర్థించుచు పెక్కు వ్యాసములు రచించెను వారే వితంతువులకు స్వయముగా వివాహములు జరిపించుటయేగాక వితంతు శరణాలయములను స్థాపించి యనాథ వితంతువులకొక మార్గము జూపిరి ఇట్లు వారు కావించిన ప్రయత్నమే తరువాత పట్టణములందేకాక పల్లెలందు కూడా బాలికా పాఠశాలలు వెలయుటకు నాందీవాక్యము పలికించినది

కులభేదాలు హిందూ సంఘ పతనానికి మూలకారణమని గుర్తించి వానికి వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభించారు మూఢ నమ్మకాలను మతాచారాలను ఛాందస భావాలను నిరసిస్తూ అనేక రచనలను సాగించారు హిందూమతం యొక్క సంస్కరణ రూపమైన బ్రహ్మ సమాజానికి ఆంధ్రదేశంలో పునాది వేశారు బహుదేవతోపాసనము విగ్రహారధనము సౌశీల్యరాహిత్యము మున్నగునవి మానవుని యభ్యుదయమున కాటంకములని వారు భావించుటచే బ్రహ్మ సమాజ సిద్ధాంతముల నాదరించుటకు పూనుకొనెను వారి విద్యాభిమానమే వారిని రాజమహేంద్రవరమున వీరేశలింగోన్నత పాఠశాలను స్థాపించుటకు ప్రేరేపించినది

వాఙ్మయ సేవ - వారు మొదట ప్రౌఢ ప్రబంధముల రచనకు పూనుకొన్నను అవి సమాజాభివృద్ధికి దోహదము చేయలేవని గుర్తించి సరసమైన వచన రచన కుపక్రమించారు వారు రచించిన సరస్వతీ నారద సంవాద మను బంద కావ్యము కావ్యవాఙ్మయ దుస్థితిని వ్యక్తము చేయుచున్నది

పంతులుగారు ఆంధ్ర వాఙ్మయమున నాదరింపని ప్రక్రియలేదు నవల నాటకము ప్రహసనము జంతు జీవ ఖగోళ భూగోళ పదార్థ విజ్ఞాన శాస్త్రము జీవిత చరిత్రలు స్వీయ చరిత్ర విమర మొదలైన రూపాలలో భాషాసేవచేసి గద్యతిక్కన అను సార్థకనామం ధరించారు నన్నయ నాటినుండి తమ కాలమువరకు ఆంధ్రకవుల పుట్టు పూర్వోత్తరములను బహు పరిశ్రమతో పరిశోధనా పూర్వకముగా ఆంధ్ర భాషా చరిత్రకు పునాదిగా ఆంధ్రకవుల చరిత్ర అను గ్రంథాన్ని ప్రకటించారు

తన జీవితాన్నంతా సంఘ సంస్కరణకు భాషాభివృద్ధికి వినియోగించుటతోపాటు పుస్తకరచనద్వారా తాను సంపాదించిన లక్షరూపాయల ఆస్తిని హితకారిణీ సమాజమను ప్రజాసంస్థ పరంచేసి ఆంధ్రదేశంలో అపూర్వమైన త్యాగప్రమాణాలను సృష్టించారు

క్రీ శ 879 లో వీరేశలింగం పంతులుగారు రచించిన రాజశేఖర చరిత్ర కు ప్రథమాంధ్ర నవలగా ప్రఖ్యాతి లభించినది ఇది ఆంగ్ల నవల వికార్ అఫ్ ది వేక్‌ఫీల్డు ననుసరించి వ్రాయబడెను ఇందు సాంఘిక దురాచారములను మూఢ నమ్మకములను పంతులుగారు నిరసించిరి తన అవసానదశలో అప్పుడప్పుడే తలఎత్తుచున్న కాంగ్రెసు ఉద్యమాన్ని వా వహారిక భాషోద్యమాన్ని అభిమానించారు

వీరేశలింగంగారు ప్రారంభించిన భాషాసంస్కరణోద్యమాన్ని గిడుగు రామమూర్తి గురజాడ అప్పారావుగారలు మరింత ముందుకు తీసుకువెళ్ళి, తెలుగుభాషను ప్రజాసామాన్యానికి అర్థమయ్యే విధంగా వ్రాయవలెనని వ్యవహారిక భాష మాత్రమే ప్రజాస్వామ్యయుగానికి అనుగుణమైన భాషారూపమని నిరూపించారు

కం తన దేహము తన గేహము
తన కాలము తన ధనంబు తన విద్య జగ
జ్జనులకై వినియోగించిన
ఘనుడీ వీరేశలింగ కవి జనులారా

అను శాశ్వతకీర్తిని సంపాదించారు

ఆదర్శోపాధ్యాయులుగా నాటక కర్తగా స్త్రీ జనోద్ధరణ పర్యాయ ణువిగా సంఘసంస్కర్తగా పత్రికా నిర్వాహకులుగా ఆంధ్ర ప్రజ కపార మైన సేవగావించిన పంతులుగారిని ఆంధ్ర ప్రజలు యుగకర్తగా భావించ వచ్చును

## 47 తిరుపతి వేంకటకవులు

ప్రబంధ యుగంలో పాండిత్య ప్రకాశకరులైన రామరాజభూషణాది కవుల తీక్షణకదీత ఆవిరై ఆకాశమండలమునకు చేరిన తెలుగు పద ముసు

భూమండలానికి దించి అఖండ గోదావరీ ప్రవాహంలాగ ప్రవహింపజేసి తెలుగు సాహిత్య క్షేత్రాన్ని శ్యామలంగాను కోమలంగాను వెలుగొంద జేసిన మహానుభావులు శ్రీ తిరుపతి వేంకటకవులు

దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కలిసి తిరుపతి వేంకటకవులనే పేరుతో తెలుగునాట గడించిన కీర్తి ఆంధ్ర సాహిత్య రంగంలో చిరస్థాయిగా నిలిచిపోయింది తిరుపతి శాస్త్రిగారి జన్మస్థలం కృష్ణా జిల్లాలోని ఎండగండ గ్రామం ( 87 - 9 9) వేంకట శాస్త్రిగారి నివాసం గోదావరి జిల్లా కడియం ( 870- 950) వారి నాటకాలలో ముఖ్యమైనవి పాండవోద్యోగ విజయాలు ముద్రారాక్షసము మృచ్ఛకటికము మొదలగునవి బుద్ధచరిత్ర శ్రవణానందము దేవీ భాగవతము మొదలగునవి వారి నవ్యకృతులు విక్రమాంకదేవ చరిత్రాదులు వచన గ్రంథాలు నానారాజ సందర్శనాదులు శతావధాన కృతులు సాహిత జగత్తులో వారి ఏకచ్ఛత్రాధిపత్యాన్ని అందరూ స్వీకరించి మోకరిలిన వారేగాని ఎదిరించి నెగ్గిన వారెవ్వరూ లేరు వీరు భారతాన్ని ఆరు భాగములుగా విభజించి నాటకములను వ్రాసిరి పాండవ జననము పాండవ ప్రవాసము పాండవ రాజసూయము పాండవ ఉద్యోగము పాండవ విజయము పాండవాశ్వమేధము అనునవి ఈ నాటకములలో పాండవ ఉద్యోగ విజయములు ప్రసిద్ధిగాంచెను

తెలుగు పద్యం సాహిత్యలోకంలో సుమారు 800 ఏండ్లకు పైగా నిరంకుశంగా పరిపాలన సాగించింది ఈ నాటికి తెలుగునాట పద్యం నాటకాల్లోను, సినిమాలలోను యథాపూర్వకంగా ప్రయోగింపబడుతుండ డము దానిని వింటూ వేలాది ప్రజలు తన్మయత్వంలో మునిగిపోవడం చూస్తే పద్యానికి ఎంత ప్రభావము ఉందో తెలుస్తుంది పద్యానికి తెలుగు దేశంలో ప్రతిష్ఠాకరమైన శాశ్వతమైన స్థానాన్ని గడించిపెట్టినవి తిరుపతి

వేంకట కవులచే రచింపబడిన పాండవోద్యోగ విజయాలు అందులోని ఈ కింది పద్యాలు ఇప్పటికీ తెలుగువారి నోట వినిపిస్తూంటాయి

"జెండాపై కపిరాజు" "అదుగో ద్వారక" "బావా యెప్పుడు వచ్చితీవు" అటువంటి నాటకాలలో తమ ఆశుకవిత ప్రవహింపజేసి తెలుగు సాహిత్యాన్ని తెలుగు ప్రజలను ఉర్రూతలూపారు శ్రీ తిరుపతి వేంకట కవులు అఖండ సన్మానాలు పదవులు వలచిన వీరికి ఎందరో రాజులు తలలు వంచి మ్రొక్కినారు

అవధాన విద్యతోను వాదోపవాదాలతోను ఎందరినో ఎదిరించి, బెదిరించి పొరద్రోలి సాహిత్య రాజసూయం చేసిన ప్రతిభా ధురంధరులు శ్రీ తిరుపతి వేంకటకవులు ఆంధ్రదేశపు విశిష్ట లక్షణంగా అవధాన విద్యకు జగద్విఖ్యాతి కూర్చినవారు తిరుపతి వేంకటకవులు

"అభినవ రామలింగ బిరుదాంకుడ నా కవనమ్ము నందు నీ యధ జపుగాళ్ళు తప్పులిడ వచ్చెదరే" అని సింహగర్జనతో శత్రువులపై విరుచుకు పడేవారు

"ఏనుగు లెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము
సన్మానము లొందినాము
బహుమానములన్ గ్రహియించినార మెవ్వానిని లెక్కసేయక ని
వారణ దిగ్విజ
యంబొనర్చి ప్రజ్ఞానిధులందు బేరుగొనినారము నీవలనన్ సరస్వతీ"

అంటూ ఈ జంటకవులైన తిరుపతి వేంకటకవులు జీవితం చాలించారు

## వేమన

తిక్కన సోమయాజి హరిహరనాథ ఉపాసనాప్రకారమును ఆంధ్రావనిలో నెలకొల్పి మనస్పర్థలను మటుమాయంజేసి సామరస్యమును నెలకొల్పిన సిద్ధుడు కాగా వేమన బ్రాహ్మణాధీనమందున్న శాసనుగూడ

ప్రజల కందించెను మత విప్లవవాది అయి ప్రజాకవిగా మారినాడు లోకోక్తులతో దృష్టాంతాలతో సత్యమును బట్టబయలు పరిచినాడు.

ఆంధ్ర వాఙ్మయమున యాతని స్థానము తమిళమున వైష్ణవ ఆళ్వారులు, శైవ నాయనారులవంటిదే - వారిలో హాస్యము తక్కువ వేమనలో ఎక్కువ ఈయన చెప్పినది పాత వేదాంతమైనా చెప్పిన తీరులో క్రొత్తదనము జీవము, భాషలో చేవ బిగువు సూటిదనము కలిగియుండును కదిం కులాచారములు మూఢభక్తి వేషధారి తనము మొదలగు వానిని దూలనాడుట యందితం డద్వితీయుడు ఇతని పద్యములన్నియు లోకోక్తులు ఇతని పద్యములలో పరిహాసము దట్టము మరుగు మర్యాదలు లేని మోటు విధమున దిట్టుట నొప్పించెందు వాడు సైతము ఇతరులతో గలసి నవ్వునట్లు చేయగలిగిన సమర్థుడు

నిదర్శనముల జూపుటలో నిత డద్వితీయుడు అవి నిగూఢములు గాక స్పష్టముగా నుండును

పాశ్చాత్య విమర్శకులు వేమన పద్యములకు ముగ్ధులై ఇట్లు ప్రశంసించినారు

రామకృష్ణ పరమహంస "పూర్వకవి రూపమే వేమన వేమన ఉపదేశకుడు ప్రవక్త ప్రజా కవులలో వేమన ఒక్కడే మహాకవి వేమన తన యుగపురోగామి-వేమన ఒక తిరుగుబాటు కవి-వేమన తెలుగు కవులందరిలోను ఎక్కువ ప్రజాభిమానమును పొందిన లోకకవి"

"ఆయన ప్రకృతి ప్రియుడైన సహజ కవి ఆచార మూఢ విశ్వాసములను ఛిన్నాభిన్నము చేసి పాత గురువులకు దాసులైన కంటనున్న ముసలమ్మ అధికారమును ద్రోయమని ఆయన రచనలు ప్రబోధములు గావించినవి" అని డా కట్టమంచి రామలింగారెడ్డిగారనుచున్నారు

"మానవతకు సంబంధించిన దేనిని గాని వేమన నిర్లక్ష్యము చేయలేదని" బార్నెట్ అనుచున్నారు.

"వేమన నేటి తెనుగు కవులందరిలో ఎక్కువ ప్రశంసమానము పొందినాడు. ఇప్పుడు వాడుకలో నున్న ఏ చాటువుకుగాని సామెతకుగాని అర్థపూర్ణమైన నీతిసూక్తికిగాని వేమన కర్తృత్వం అంటగట్టబడలే"దని సర్ జార్జి అబ్రహాం గ్రీర్సన్ అనుచున్నారు

"వేమనను నేను కనుగొంటిని" అని చార్లెస్ ఫిలిప్ బ్రౌను ఉప్పొంగిపోయినారు

వేమనచే ఆకర్షింపబడిన మొట్టమొదటి పాశ్చాత్యుడు ఫ్రెంచి మత గురువు జె. ఎ. డూబాయ్ (Duboi) హిందువుల ఆచారములను గురించి వ్రాస్తూ అందలి వేదాంత విషయములను గుర్తించి మూఢ మతాచారములను విమర్శించిన కొద్ది మందిలో వేమన ఒకరన్నారు. డూబాయ్ వేమన పద్యాలను ఫ్రెంచి భాషలో అనువదింపగా హెన్రి బ్యూఛాంప్ వాటికి ఆంగ్లానువాదం చేశాడు

చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ - "వేమనను నా కవి" అని సొంత డబ్బుతో దేశం నాలుగు చెరగులనుండి వేమన పద్యాలను సేకరించి ప్రతులు వ్రాయించి 2000 పద్యాలను 824 లో అచ్చువేయించినాడు. ఇంగ్లీషు తాత్పర్యములను వ్రాసి ఇంకొక ముద్రణను వెలువరించినాడు. బ్రౌను దొరే కొన్ని పద్యాలను లాటిన్ భాషలోనికి అనువదించినాడు. వేమన నైతిక సూత్రాలు గ్రీకు వేదాంతులు - సోక్రటీస్ డెమోక్రటీస్ సూత్రాల వంటివన్నీ, సాహిత్యము ల్యూషియన్ సాహిత్యము వంటిదని వర్ణించాడు

### విలియం హోవర్డు క్యాంబెల్ (1859 - 19 0)

గుత్తి జమ్మలమడుగు ప్రాంతములందు తిరిగి వేమన విషయములను సొంతంగా అడిగి తెలుసుకున్నారు. వేమన నిక్కమైన ప్రజాకవి అని, సంఘ సంస్కర్త అని విపర్ల ప్రేమలతో వ్రాసినారని ప్రబంధరీతులను శాస్త్రీయ పద్ధతులను తృణీకరించి వాడుక భాషలో వ్రాయుట యందే

వేమన గొప్పతనము అమిడియున్న దన్నారు ఇంగ్లండు పీక్లిస్ పంచననే ప్రపంచ చరిత్రయందు కవి వేమనకు స్థానము గలదన్నారు

### డాక్టర్ జి యు పోప్

ఇతడు క్రైస్తవ మివనెరీ తమిళమున మహాపండితుడు దూబాయ్ వ్రాసిన వేమన గ్రంథాన్ని ప్రకటిస్తూ "వేమన పద్యాలలో గల సౌంపైన నైదిక భాషలోని తియ దనమూ ఏ ఇతర వ్రాతగానికి అబ్బలే"దన్నారు

### వేమన యొక్క పాశ్చాత్య కవితారీతులు

"నీ కుడిచేయి చేసిన దానిని ఎడమ చేతికి తెలియనీయకు" అన్న బైబిలులోని మత్తయి సువార్తలోని మాటను పెట్టి చెప్పరాదు పేదకైన అనుచున్నారు అటులనే శత్రువులను ప్రేమించుమను బైబిలు మాటను

చంపదగిన యట్టి శత్రువు తన చేత
చిక్కెనేని కీడు చేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు

అన్నారు

వేమన పద్యాలు సంస్కృతంలోనికి అనువదించబడ్డాయి వేమన పద్యములను 4000 పైన సంకలము గావించి బ్రౌను తరువాత "వేమన సూక్తి రత్నాకరము" పేర 9 8 లో అచ్చువేసి యా కవి పేరు బాగా బయటకు తెచ్చిన భాషాభిమాని ఆర్ పూర్ణాచార్యులు తరువాత అనేక కవులు విమర్శకులు వేమన పద్యముల విషయములో కృషి చేసినారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి వేమన ఉపన్యాసములు గ్రంథమందు వేమన పద్యములపై సమగ్ర కృషిచేసి ఆంధ్ర సాహిత్యమునందు వేమన కీర్తి ధ్వజమును ఎగురవేసినారు

సాంఘిక సంస్కరణలు

కులభేదమును పాటించుట కితనికి ఏవగింపు

"రామనామ పఠన మహిమచే వాల్మీకి

పరగబోయడయు బాపడయ్యె

కులము ఘనము గాదు గుణము ఘనంబురా"

అని "ఎరుక గలుగువాడె ఎచ్చయిన కులజుండు" "జంగమైన ఎదః జాతి నెంచగరాదు" అన్నాడు

"బాపడనగ నేమి భక్తుడనగ నేమి" అని ప్రశ్నించి.

పరగబొమ్మ గడ్డు పరికించి చూచిన

కులములన్ని అందుగూడ బుట్టె

అని దేవ రహస్యమును దెలుపుచున్నాడు

మాలవాని నేల మహిమీదనిందింప

నొదల రక్తమాంస మొకటికాదొ

వానిలోన మెలగు వానికులంబేది

అంటూ మానవతావాదము చేశాడు

మాలవాడైనను మరి యాత్మమీదను

మనసునిలిపెనేని మాలగాడు

మనసు నిలుపకున్న మహిమీద మాలడు

అంటూ శాశ్వతమైన సత్యమైన నిర్వచనం చేశాడు

తనదు తల్లి లంజ తన యాలు మాదిగ

శ్రీపతికి గురు వసిష్ఠ దరయ

తపముచేత ద్విజుడు తర్కింప కులమెట్లు

అంటూ దైవమతాన్ని ప్రచారం చేశాడు

నానాత్వంలో ఏకత్వం (un y of d vers y) ని ఈలాగ

నిర్వచించాడు

పసులవన్నె వేరు పాలెల్ల నొక్కటి
పుష్పజాతివేరు పూజయొకటి
దర నంబులారు దైవంబు ఒక్కటి

అంటూ-

అరు రుచులు వేరు సారంబు నొక్కటి
సత్యనిష్ఠవేరు సత్యమొకటి
పరమ ఋషులువేరు భవు ంశు నొక్కండు

అని మరోగమించాడు

## వేమన నాటి కాలపరిస్థితులు

వేమన ఉపదేశాలు కేవలము సామాన గ్రామీణుల కుద్దేశించబడినవి "కొండ పద మందు కొంచెమైయు దదా" అన్నట్లు కొండంత వేదాంతాన్ని చిన్నదైన అద్దంలో ఇమిడ్చాడు సామాన్య ప్రజల కర్థమయ్యే రీతిలో బోధించాడు మతగురువులైన బ్రాహ్మణులేకాక బ్రాహ్మణేతరులే ఉపదేశకులైనారు ప్రజలకు ఆత్మగౌరవము లభించింది తెలుగుభాషే మతవిద్యను తెలిపేభాష అయినది అనగా తెనుగుకు జాతీయ భాషాస్థాయి దొరికింది తెనుగులో గీతాలు పాటలు రూపాన మత వాఙ్మయం పెరిగింది మత విద్యకు తెనుగుతనమబ్బింది జంగం దేవరలు పురోహితులైనారు

ఈ కాలమందే పోతులూరి వీరబ్రహ్మం విశ్వబ్రాహ్మణ ధ్వజంతో బయలుదేరెను విశ్వబ్రాహ్మణులు వీరశైవుల భాషను మంత్రమును గరపుచు గురువులైనారు ఈయన శిష్యులలో అన్ని కులములవారు, మతములవారు చేరినారు దీనితో మతం అగ్రజాతుల గుప్పెటనుండి బయల్పడినది యోగివేమన, ఎర్ల రామదాసు మొదలగువారు వేమనచే ప్రభావితులయా రు

## సామెతలు వేమన భాష

వేమన సామెతలను నానుడులను వాడుటవలన ఆయన కవితకు ప్రమెచ్చింది పెద్ద భావములను చిన్నమాటలతో చెప్పగలిగిన మహ శిల్పి వేమన అందరికీ అర్థమయ్యే పోలికలు దృష్టాంతాలతో ఆయన కవిత్వం నిండియుండును

లోకానుభవము - వేమన కవితకు ఒక అమూల్య సామాగ్రి లోకానుభవం ఉన్నదానినే నేర్పుతో ఉపయోగించి ప్రాణము పోసి పాఠకుని మెరాల నిలబెట్టుటయే ఆయన విశిష్టత ఈ ప్రతేకత వలననే వేమన పద ంరాని తెనుగువారు ఆంధ్రదేశంలో లేరనవచ్చును ఇట్టి లోకవా ప్త వేమన తర్వాత బద్దెనదే (సుమతి శతకం)

### ఆటవెలదులు

సాధారణంగా కవికి కంసాలికి ఎసం తేలిక అంటారు కాని ఆటవెలది వేమనకు తేలిక తన నిండు భావాన్ని మూడు చిన్నపంక్తులలోనే ఇమిడ్చిచెప్పుట ఒక అపూర్వ ప్రతిభ అందులో ఒక పంక్తి సామెతయో అర్థాంతరన్యాసమో అయి ఉండును భావప్రకటమునకు చాలినవాడు ఒక్క డొక్కడే దీటనవచ్చు

### ఉపమాలంకారములు

వారకాంతల వెంట దిరుగువాడు వెర్రివాడు" అని అంటూ ఇది పంటచేను విడిచి పరిగ యేరినయట్లు అని ఉపమించాడు "చెప్పు దినెడి కుక్క చెఱకుదీపెమెరుగు" భూమినాదియన్న భూమి ఫక్కున నవ్వు గంపెడంత తవుడు గంపలో బెట్టిక చన్నుబట్టనీదు కొన్నబఱ్ఱె "వాన రాకడవచ్చు వడగండ్లు" మొదలగునవి

### వేమన సూక్తులు-సామెతలు

వేమన ఆయన పద్యాలలో సూక్తులు సామెతలు కోకొల్లలుగా ఉన్నవి మచ్చునకు కొన్ని ఇందులో ఉదహరించబడ్డవి

ఆలివంకవారు అందరు చుట్టాలు
బ్రహ్మకైనను బుట్టు రిమ్మతెగులు
గడుసురాలు మగని గంపబెట్టమ్మరా
గొడ్డుటావుపాలు గోకితే చేపునా
పుట్టమీదగొట్ట భుజగంబు చచ్చునా
అప్పులేనివాడె అధిక సంపన్నుడు
కుక్క సింహమగునె గోదావరికి బోవ
కాశీవాసులైన కనబోరు మోక్షంబు
కొండముచ్చు పెండ్లి కోతి పేరంటాలు

వేమన మతం గురించి మూడు రకాల అభిప్రాయాలున్నాయి వేమన అద్వైతి 2 వీరశైవుడు 3 లోకాయతుడు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వేమనను ఒక రకమైన అద్వైతిగా ఒప్పుకొన్నారు వేమన వేద ప్రామాణ్యాన్ని ఒప్పుకోలేదు ("వేద విద్యలెల్ల వేశ్యవంటివి" వేమన వీరశైవుడని శ్రీ బండారు తమ్మయ్య ప్రతిపాదించారు తత్వానుభవానికి వేమనచెప్పిన సాధన కొంత శైవ సంబంధిగానే కనిపిస్తున్నదని డాక్టరు ఎన్ గోపిగారి పరిశోధనలనుబట్టి విదితమగుచున్నది

వేమన కవిత్వం - వేమన ప్రారంభించిన వృత్తములన్నియు ఆ వెలదులు పద ధోరణి ద్రాక్షాపాకములో నున్నదనుటకు ఏ మాత్రము సందియములేదు పదలాలిత్యము భావగౌరవము లోకానుభవము నీతి సంపత్తి ఈ వృత్తములందు వెల్లివిరియుచున్నవి వేమన పద్యరచనలో ముఖ్యముగా కొన్ని దృష్టాంత విషయములు గోచరించుచున్నవి

చాల కాలము నుండి హైందవ సాంఘికాచారములలోనున్న అస్తవ్యస్థ పరిస్థితులను వెలికి దీయుట

ప్రజల హృదయములలో నాటుకొనియున్న మూఢ విశ్వాసములను దృష్టాంతముల మూలమున తొలగింప జూచుట

లోభులను దేవాలయ పూజారులను విమర్శించుట ఇట్టివి హాస్య ధోరణిలో సూక్ష్మముగా పద రూపమున ప్రబోధించెను సమాజములోని మూఢాచారములను ఈ క్రింది విధముగ నిరసించెను

ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ

మరియు "తలలు బోడులైన తలపులు బోడులా" అని అపహసించి విమర్శించిన స్వేచ్ఛాప్రియుడు యోగి వేమన సమాజమందలి లోపములను సామాన్య ప్రజలకు చక్కగా తేటపర్చినాడు

కులము గల్గువారు గోత్రము కలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడికల్గువారి బానిస కొడుకులు విశ్వ

నీతులను ధర్మములతో మేళవించి ఆటవెలది పద్యములతో కూడి యున్న వేమన పద్యములు నేటివరకు ఆంధ్ర దేశమందు వినాశిల్లుటకు మొదటిది తేటతెనుగు మాటలలో సాగిపోయిన కవితాధార రెండవది లలిత హాస్యము మూడవది నీతిబోధనములు కారణములని చెప్పవచ్చును

వేమన పద్యాలు సూక్తులకు సామెతలకు నిధులు "వేమన గారు బంగారం చేశారో లేదో తెలియదు కాని దొరికిందల్లా బంగారం చేశారు" అని శ్రీ ఆరుద్రగారు వాస్తవిక దృక్పథంతో వ్యాఖ్యానించారు

వేమన ప్రజాకవి సమాజాన్ని పట్టించుకొని, సమాజంలోని సమస్యల్ని గుర్తించి ఆ సమస్యల్ని తన కవిత్వంలో వర్ణించటం ప్రజాకవి మొట్టమొదటి లక్షణం ఈ లక్షణం వేమన ప్రతి పద్యములో కనబడు తుంది నేరుగా సమాజములోనికి దూరి నీతి ధర్మముల నుపదేశించిన యోగి వేమన నిజముగా అవతార పురుషుడు

## రాయప్రోలు సుబ్బారావు గారు

శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు 892 మార్చి 3 వ తేదీన గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా గార్లపాడు గ్రామంలో జన్మించారు మేనమామ వద్దనే సంస్కృతాంధ్ర భాషలను అభ్యసించారు 908 లో రాజమహేంద్రవరము చేరుకున్నారు హైస్కూలు చదువు 9 0 లో ముగించారు ఆయన తొలి కావ్యాన్ని 909 లో ప్రచురించారు తరువాత నిజాం కాలేజీలో (హైదరాబాదు) చదివి తరవాత మద్రాసు వెళ్ళిపోయారు అక్కడ కొమ్మరాజు లక్ష్మణరావుగారి ప్రాపకంలో వారి విజ్ఞాన సర్వస్వపు సంపాదక మండలిలో ఒకరుగా చక్కని కృషి చేశారు సుబ్బారావుగారు మద్రాసులో ఉన్న కాలంలోనే రవీంద్రుని గీతాంజలి బయటకు వచ్చింది అది చదివిన తరువాత 9 5 డిసెంబరులో ఆయన బయలుదేరి శాంతి నికేతనము చేరుకున్నారు రవీంద్రుని సన్నిధిలో తన కవిత్వానికి మెరుగులు దిద్దుకున్నారు

తెలుగు దేశంలో జాతీయోద్యమం ముమ్మరంగా కొనసాగుతున్న కాలమది ఆంధ్రోద్యమం కూడా బలపడి ఆంధ్రరాష్ట్రం కొఱకు కృషి ప్రారంభమైంది ఆంధ్ర రాష్ట్రోద్యమానికి భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతం ప్రతిపాదిత అయింది 9 7 లో 5 వ ఆంధ్ర మహాసభ నెల్లూరులో జరిగింది అక్కడనే జాతీయోద్యమ ప్రబోధ కవిత్వాన్ని ప్రారంభించారు

ఉపాధ్యాయుడుగా ప్రొఫెసరుగా ప్రిన్సిపాలుగా ఉద్యోగాలు నిర్వహించారు. తిరుపతిలో నెలకొల్పిన శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం తెలుగు విభాగంలో మొట్టమొదటి ప్రొఫెసరుగా 958 లో చేరి ఆ విభాగానికి రూపురేఖలు దిద్దారు.

వారు వ్రాసిన గ్రంథాల వివరాలు:-

1 కావ్యాలు

ఆంధ్రావళి కన్నెపాటలు కష్ట కమల జడకుచ్చులు తృణకంకణము తెనుగుతోట మాధురీ దర మ మిశ్రమంజరి రమ్యాలోకం, లలిత వనమాల స్వప్న సుకుమారము స్నేహలత మొదలగునవి

2 కావ్య సంపుటాలు

అభినవ కవిత అభినవ కావ మాల ఆంధ్రావళి జడకుచ్చులు కవితాంజలి కావ్యఖండిక మొదలగునవి

3 నాటకాలు

రూప నవనీతము (ఇది నివేదన పేర వ్రాశారు) వనమాల

4 వ్యాసాలు

అక్బరు పాదుషాహి అధ్యక్ష వచనము అభినవ కవిత ఆధునికాంధ్ర సారస్వతము కవిత ఒకమాట కవిత్వం కవిత్వాభిరుచి కళా కవిత్వము కాటూరి అస్తమయం గురించి కొన్ని జ్ఞాపకలు గ్రంథాలయములు సరస్వతీ సామ్రాజ్యము జాతీయోద్ధారకులు జానపద గేయములు నా తొలిరచన ఎంగళి సూరన భగవాన్ మోహనదాస కరుణాసాంద్ర గంధి భావకవిత్వము మహాకవి రవీంద్రనాథ ఠాకూరు దివ్యస్మృతి ముట్నూరి కృష్ణారావు, విజ్ఞాన పరిషత్తు, విశ్వనాథను గురించి శాకుంతల పరిశీలనం మొదలగునవి.

ఇంగ్లీషులో వ్యాసాలు

Leaders and Land marks of Te ugu terature

ఒక అమెరికన్ మహిళ రాయప్రోలు వారి కవిత్వాన్ని గూర్చి ఈలాగు చెప్పారు

"Your yric poe ry s small sweet and Creature acted me nfluenced me to adopt it my mother

ongue Apart from poe c embe men s and conven ion I made a change I made an ernes a emp to d vorce he y c from sexvertone and une h v bera on of k ndness, fe ow h p and fr endsh p and o her sof v bra on of he human hea he d v ne n he man "

రాయప్రోలు వారు ఈలాగన్నారు

"స్త్రీని భార గానూ కామ ద ష్టితోనూ చూడ్డం అలవాటైపోయింద మనకు ఇంతవరకూ వచ్చిన ప్రబంధాల్లో అంతా ఇదే దృష్టి ఇదేం బాగుంది స్త్రీని మంచి స్నేహితురాలిగా ఎందుకు చూడకూడదు ఇప్పటి చదువుల్లో ఆడపిల్లలూ కలిసి చదువుకుంటున్నారు ఈ సమయంలో మన పాత ప్రబంధాల్లోని భావాలనే చేస్తే ఎట్లా స్త్రీ పురుషుల మధ స్నేహం ఉండాలి అందుకనే వాళ్ళ లిరికల్ పొయట్రిని తీసుకొని దానికి దయ స్నేహం వాత్సల్యం మొదలయిన సుగుణాలన కలిపి కొత్త కవిత్వం వ్రాశాను "

"పదాలను కానీ పద్యాలను కాని అర్థము చేసుకునేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి దాని గురించి ఆలోచించాలి మన ఒరిజినాలిటీని వ్యక్తం చేసే ఆలోచనలను నిర్భయంగా బయటపెట్టాలి పెద్దలు సంప్రదాయము అంటూ వాటిని ఎదుర్కొన్నా సరే మనం మాత్రం స్వతంత్రంగా ఆలోచించాలి" అన్నారు రాయప్రోలు

ఉద్యోగం చేసుకోటంతోను అభినవ కవితలు రచించడంతోను ప్రబోధ కవిత్వం వెలయించడంతోను మాత్రమే ఆగకుండా రాయప్రోలు సుబ్బారావుగారు 940 ప్రాంతంలో ఆంధ్ర సారస్వత పరిషత్తును నెలకొల్పి కురుగంటి సీతారామయ్య , ఖానంఖాన్ మొదలైన వారిని

కలుపుకొని హైదరాబాదులో తెలుగుభాషా సాహిత్యాల ప్రచారానికి ప్రచుర ణకు కూడా కృషిచేశారు

సుబ్బారావుగారికి జరిగిన కొన్ని సన్మానాలు

958 లో ఆంధ్రా యూనివర్సిటీ విద్యార్థులు విశాఖపట్టణం పుర ప్రముఖులు కలిసి ఆయనకు షష్టిపూర్తి ఉత్సవంచేసి సన్మానించారు

960 మే నెలలో అఖిల భారత తెలుగు రచయితల మహాసభల సందర్భంగా ఆయనకు హైదరాబాదులో ఘనమైన సత్కారం లభించింది

962 లో వారి మిశ్రమంజరి కావ్యానికి కేంద్ర సాహిత్య అకాదమీ వారి బహుమతి లభించింది

966 జూలై వ తేదీన సాహిత అకాడమీ కళాభవన్‌లో సన్మానించింది

968 లో ఉస్మానియా విశ్వ విద్యాలయ స్వర్ణోత్సవాల సంద ర్భంగా డాక్టరేట్ బిరుదునిచ్చి గౌరవించింది

9 6 జూన్ 26 న హైదరాబాద్ జీవిత బీమా ఉద్యోగుల తెలుగు సమితివారు ఆయనను సన్మానించారు

97 ఫిబ్రవరి 26 న కళాప్రపూర్ణ బిరుదునిచ్చి ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆయనపట్ల తనకున్న గౌరవాన్ని ప్రకటించుకొంది

979 జూలై 9 వ వజ్రోత్సవాల సందర్భంగా ఉస్మానియా విశ్వ విద్యాలయం ఆయనను గౌరవించింది

గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు

రామమూర్తిగారి విద్యా సంపద స్వయంకృషి వలననే కలిగినది వారు పర్లాకిమిడిలో ఉపాధ్యాయ పదవి నిర్వహించుచునే స్వయముగా చదువుకొని కళాశాల విద్యను పూర్తిచేసి పట్టభద్రులు కాజాలిరి ఉపా ధ్యాయునిగా అతని పాఠ్యబోధన విధానము సాటిలేనిది

వ్యవహారికభాష కూఒరిపోని ఆంధ్రభాష కింపుసొంపులు చేకూర్చిన వారు కళాప్రపూర్ణ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు శ్రీకాకుళ మండలమందలి చరిత్ర ప్రసిద్ధమైన ముఖలింగ క్షేత్ర దేవాలయము గోడలపై చెక్కబడిన శాసనములను పర్లాకిమిడి ప్రాంతమందలి పర్వత గుహలలో నివసించు సవరల భాషాచార వ్యవహారములును తమ దృష్టి నాకర్షించుటచే పంతులుగారు శ్రమకోర్చి ప్రాచీన శాసన లిపిని సవర భాషను నేర్చుకొని వానిని గూర్చి పరిశోధనలు కావింప నారంభించిరి దీర్ఘాసి శాసనము వజ్ర హస్తుని దానశాసనము మున్నగు శాసనములను చరిత్రాంశ వివరణ సహిత మైన వ్యాఖ్యానములతో ప్రచురించి వారు చరిత్ర పరిశోధకులకు మహోప కార మొనర్చిరి వీరు పరిశోధనలు చేసి కళింగరాజులకు రాజధాని ముఖ లింగమేకాని కళింగ పట్టణము కాదని నిరూపించారు సవరల ఆచార వ్యవ హారములను గూర్చి ఆంగ్లమున నొక గ్రంథమును ప్రచురించుటయేగాక సవర కథలను పాటలను సేకరించి వారికి విద్యా గంధము కలిగించుటకై సవర వాచకములను రచించిరి తరువాత నిరంతర పరిశ్రమ కావించి తెలుగు-సవర సవర-తెలుగు నిఘంటువులను సవర-ఇంగ్లీషు ఇంగ్లీషు-సవర నిఘంటువులను తయారుచేసిరి ఈ గ్రంథములన్నిటిని మదరాసు ప్రభుత్వమువారు ప్రకటించిరి వీరు సవరలకును సవరభాషకును కావించిన సేవలను గుర్తించి వీరికి ౯౧౩ లో రావుసాహెబు బిరుదమును ౯౩౪ లో కైజరు-ఇ-హింద్ బంగారు పతకమును ఇచ్చి సత్కరించారు లిపిగాని వాఙ్మయము కాని లేని భాషకు రూపము తీర్చిదిద్దిన పంతులుగారి ప్రతిభా విశేషము శ్లాఘనీయము

సవర భాషాభివృద్ధితో నూరకుండక మాతృభాషయందు కూడ కొంత సంస్కరణకు పూనుకొన్నారు అప్పుడు పాఠశాలలకు పరీక్షాధి కారిగా నుండిన ఏట్సు దొరగారు అనేక విధాల ప్రోత్సహించారు గ్రంథ రచన కూడ వ్యవహారభాషలోనే జరుగవలెనని వారి వాదము వ్యవహారిక

భాషోద్యమమునకు ఉజ్జ్వలప్రచారము కలిగించుటకై పంతులుగారు తెలుగు అను మాసపత్రికను నిర్వహించారు వారందు ప్రకటించిన వ్యాసాలు ప్రయోగాలు వ్యాకరణాంశాలు-ఆంధ్రభాషాచరిత్రకు అమూల్యమైనవి 25 వ సంవత్సరమున తుణుకులో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్సభలో (వు దీర్ఘోపన్యాసములో అనేక ప్రయోగ ప్రక్రియల-ద్వారా వ్యవహారిక భాషావాదము సమంజసమైనదని నిరూపించారు ఈనాడు వ్యవహారికభాష పవ్యగ్రంథములందేగాక పద్య గేయకావ్యముల యందు బహుజనాదర పాత్రమగుటకు పంతులుగారి నిరంతర కృషియే కారణము

పంతులుగారి సప్తతిపూర్తి మహోత్సవ సందర్భమున వారి రచన లన్నియు గ్రంథరూపమున ప్రకటింపబడినవి బాలకవి శరణ్యము వ్యాస మంజరి "పండిత భిషక్కుల భాషాభేషజము గద్యచింతామణి అను గ్రంథములు వ్రాసిరి బహు ప్రాచీనప్రత గ్రంథములు పరిశీలించియు నిఘంటువులను శోధించియు ప్రయోగపూర్వకముగా అనేక వ్యాసములు రచించారు అవి తెలుగు పండితులకు పెన్నిధానములు

పంతులుగారి ఆంధ్రాభిమాన మత ంత ప్రశంసనీయమైనది పర్లా కిమిడి రాజావారు-పర్లాకిమిడి తాలూకానంతను ఒరిస్సా రాష్ట్రమున చేర్పింప యత్నించినప్పుడు పంతులుగారు ధైర్యసాహసములు వహించి ఆంధ్రులకు నాయకులై వారిని ప్రతిఘటించిరి ధర్మవిరుద్ధముగా ఆంగ్ల ప్రభుత్వము రాజాగారి ప్రతిపాదనే అంగీకరించెనని విని 1936 వ సంవత్సరమున ఒరిస్సా రాష్ట్రారంభోత్సవము జరుగనున్ననాటి ఉదయమే పంతులుగారు పర్లాకిమిడి నుండి రాజమండ్రికి చేరుకొని తమ జీవిత శేషము వచ్చుటనే గడిపిరి "వారి ఆంధ్రాభిమానము ప్రశంసనీయమైనది

రామమూర్తి పంతులుగారు భాషాతత్వ విజ్ఞాన నిధులు పరిశోధకా గ్రేసరులు మంచి వ్యాఖ్యానకులు, గొప్ప పండితులు వారికి వాద

శత్రువులేకాని సహజ శత్రువులు లేరు హేతువాద బలముతో పాండి
ప్రతిభంతో వా వహారిక భాషకు ఊపిరిపోసి ఆంధ్రభాషకు జీవంపోసి
వారు కళాప్రపూర్ణ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు శ్రీకాకు
మండలమునకు చెందిన పర్వత శ్రేణులలో జన్మించి విజయ నగరములో
విదా భా సము కావించి ఉపాధ్యాయ పతంసులై ఉపన్యాసక శిరోమణులై
భాషాచరిత్ర పరిశోధన పారంగతులై సవర భాషా సముద్ధరణపరులై
ఆంధ్రాభిమానమున కొటపట్టులై కళాప్రపూర్ణులై యఖండకీర్తి నార్జించిన
వారు పంతులుగారు

## ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు

శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు కేవలం నాటక కర్తలు
ఒక్క నాటక రచన చేతనే ఆయనకు ఆంధ్ర సాహిత్యంలో శాశ్వత స్థానం
లభించింది ఆంధ్ర సాహిత్య లోకంలో నాటకాలంటే ఎరుగని రోజుల్లో
9 వ శతాబ్ది ఉత్తరార్థంలో రామకృష్ణమాచార్యులు గారు సుమారు 80
నాటకాలు వ్రాశారు అప్పటికే అక్కడక్కడ కొన్ని సంస్కృత నాటకాను
వాదాలు ఇంగ్లీషు నాటకానువాదాలు కనబడుతూ ఉన్నప్పటికి విజయనగర
ప్రభుత్వ నాటక ప్రదర్శనలు వారి ఆస్థానంలో జరుగుతున్నప్పటికి
నాటకానికి దేశంలో పేరేలేని ఆ రోజుల్లో కేవలం రంగస్థల ప్రయోజనం
కోసమే నాటకాలు వ్రాసి వాటిని ప్రదర్శించి స్వయంగా ఆ నాటకాల్లో
నటకులుగా పాల్గొని దేశంలో ఒక అపూర్వ కీర్తిని గడించారు తెలుగు
దేశానికి వారు చేసిన విశిష్ట సేవకు గుర్తుగా గద్వాల మహారాజు గారు
9 0 లో "ఆంధ్రనాటక పితామహ" అనే బిరుదిచ్చి రత్నఖచిత సువర్ణ
పతకంతో ఆచార్యులవారిని సత్కరించారు

ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి జన్మస్థలం అనంతపురం జిల్లా
లోని ధర్మపురి అగ్రహారం ఆచార్యులవారు 858 లో జన్మించారు వీరి

పండితవంశం ఎత్మఎతామహులు సంస్కృతాంధ్రాల్లో అఖండ పండితులు ఆచార్యుల వారు ఆంగ్ల పరీక్షలో ఉత్తీర్ణులై బళ్ళారి నగరం చేరి వ లు వృత్తి అవలంబించి విశేషమైన కీర్తిని ధనాన్ని ఆర్జించారు వారు అద్భుత మేధాశక్తి సంపన్నులు అవడంచేత ఆయుర్వేద జ్యోతిశాస్త్రాలలో కూడా అద్భుతమైన పరిజ్ఞానాన్ని సంపాదించారు చదరంగంలో వారికి ఫక్కటి ప్రజ్ఞ కలదు అయితే ఆయన ఆంధ్ర నాటక కర్తగానే తెలుగు వారి మనస్సుల్లో నిలిచిపోయారు

వారు వ్రాసిన నాటక ప్రదర్శనాలకోసం సరస వినోదినీ సభ స్థాపించి తద్వారా నాటక ప్రదర నలు కవిపండిత సమ్మేళనలు నిర్వ హించి నాటకానికి తెలుగు దేశంలో ముందెప్పుడూలేని గౌరవ స్థానాన్ని సంపాదించారు

ఆచార్యులవారు నాటక రచనలో పాశ్చాత్య సంప్రదాయాల ప్రవేశపెట్టారు నాటకాన్ని అంకాలుగా గాక రంగాలుగా విభజించడం నాటకాన్ని విషాదాంతం చేయడం ప్రొలోగు (Pro ogue) ఎపిలోగ్ (Ep ogue) పెట్టడం మొదలయిన నూతన పద్ధతుల్ని ప్రవేశ పెట్టారు వీరు వ్రాసిన విషాద సారంగధర మనే నాటకంలో ఆ పేరే సూచిస్తున్నట్లు సారంగధరుడు రాజశిక్షగా కరచరణాలు నరికివేయబడి మరణిస్తాడు ఆ విధంగానే నాటకం ముగించబడింది వారి నాటకాలన్నిటి లోనూ చిత్రవశీయం అగ్రగణ్యం అందులోని పద్యగద్యాలు అత్యంత ప్రౌఢమైన కావ్యశైలిలో నడిచాయి వీరి నాటకాలలో సాహిత్య పుష్టి కను పిస్తుంది వీరి నాటకాలు బహుళ ప్రచారం పొందాయి

బళిరే కంటిని గంటి నప్తజలధి ప్రావేష్టితా ఖండ భూ
లలనాధీశ కిరీటవారిరుహరోలంబాయమాన ప్రభో
జ్జ్వలితారింద మనూపురాత్త పదసేవాప్రత గోత్రాధవ
నశభూమీధవు నాశ్రితౌఘ కరుణావన్య ప్రభామాధవున్

ఆంధ్ర నాటక ప్రక్రియకు వేగుచుక్కగా ఆంధ్ర తారాపథంలో కాలందారు ఆచార్యులవారు

9 2 లో అఖండకీర్తితో దివంగతులైనారు అశేషజన సందోహంతో వారి అంత్యక్రియలు ఒక ఉత్సవంగా జరిగాయి

కాశీనాథుని నాగేశ్వరరావుగారు

నాగేశ్వరరావు గారు 867 మే వ తేదీని జన్మించారు స్వగ్రామం కృష్ణాజిల్లాలోని ఎలకుఱ్ఱు అగ్రహారం తల్లి శ్యామలాంబ తండ్రి బుచ్చయ్య గారు నాగేశ్వరరావుగారి చదువు బందరు హిందూ హైస్కూలులోను గుంటూరులోని ఏ ఈ యల్ యమ్ కాలేజీలోను తరువాత మదరాసు క్రిష్టియన్ కాలేజీలోను సాగింది

చదువు ముగియకముందే నాగేశ్వరరావు గారి దృష్టి వ్యాపారం మీదికి మరలగా ఆయన బొంబాయి చేరి విలియమ్ అండ్ కంపెనీలో ఉద్యోగిగా ప్రవేశించారు అక్కడ ఆయనకు అదృష్టం కలిసి వచ్చింది ముఖ్యంగా అమృతాంజనం వ్యాపారం లాభదాయకమైనది

నాడు మహారాష్ట్రీయు వార్తా పత్రికల ద్వారా ప్రజలలో దేశభక్తి భావాన్ని పెంపొందిస్తూ ఉండడం నాగేశ్వరరావు గారి దృష్టి నాకర్షించింది 907 లో జరిగిన సూరత్ కాంగ్రెస్ సమావేశం ఆయనలో దేశ సేవా సక్తిని రగిల్చింది తెలుగుజాతి వికాసానికి అభ్యుదయానికి వార్తాపత్రిక ఆవశ్యకమని గుర్తించి 908 సెప్టెంబరు 9 వ తేదీన ఆంధ్రపత్రికను వారపత్రికగా ప్రకటించడం మొదలు పెట్టారు తెలుగునాడులో ముద్రణా యంత్ర సౌకర్యాలు లేనందువలన బొంబాయి నగరం నుంచి పత్రికను ప్రచురించడం ప్రారంభించారు బొంబాయిలో పత్రికా ప్రచురణ అతికష్టముతో ఖర్చుతో కూడిన పని అయినను పట్టువదలక కార్యనిర్వాహణకు ఉపక్రమించారు. తరువాత 914 లో తమ నివాసాన్ని మదరాసుకు మార్చుకొని అక్కడ నుండి ఏప్రిల్ మొదటి తేదీ నుంచి ఆంధ్రపత్రికను

దినపత్రికగా ప్రకటించటం మొదలుపెట్టారు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము విశ్వవిద్యాలయము లభించిన నాడే ఈ జాతి ప్రగతి పథంలో పయనించగలదని నాగేశ్వరరావుగారి దృఢ విశ్వాసం అందుచేత ఆయన అటు స్వరాజ్యోద్యమానికి ఇటు ఆంధ్రోద్యమానికి ఆంధ్రపత్రికను ప్రచార సాధనంగా రూపొందించారు

నాగేశ్వరరావుగారు 920 నాటి గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణోద్యమంలో చేరి దేశసేవా ప్రబోధం చేస్తూ రాష్ట్రమంతటా పంచరించారు ఉప్పు సత్యాగ్రహం లో పాల్గొని కారాగార శిక్షను అనుభవించారు ఆయనకు 986 లో భారతదేశ కేంద్ర శాసన సభలో సభ్యత్వం లభించింది ఆయన సేవల్ని గుర్తిస్తూ 924 లో జరిగిన ఆంధ్ర మహాసభలో "దేశోద్ధారక" బిరుదాన్ని 989 లో విజయవాడలో జరిగిన ఆంధ్ర మహాసభలో "విశ్వదాత" బిరుదాన్ని ఇచ్చి సత్కరించారు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆయనకు "కళాప్రపూర్ణ" బిరుదాన్ని ప్రసాదించింది

ఇక సాహిత్యపరంగా చూస్తే ఆంధ్ర సాహిత్యానికి నాగేశ్వరరావుగారు ఎనలేని సేవ చేశారు పానుగంటివారి "సాక్షి" ఉపన్యాసాలు సుప్రసిద్ధులైన కవుల ఖండకావ్యాలూ ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలోనే తొలిసారి ప్రచురింపబడ్డాయి 9 0 లో ప్రారంభమైన ఉగాది సంచికలు ఆంధ్ర సంస్కృతి క్రమపరిణామాన్ని గ్రహించడానికి కరదీపికలు సాహిత్య సముద్ధరణకు 924 లో భారతి మాసపత్రికను స్థాపించారు

ఆంధ్ర గ్రంథమాలను వెలయించి 1927 వరకు ఆంధ్ర వాఙ్మయంలో ఉన్న ముద్రిత గ్రంథాల సూచికను బసవపురాణం పండితారాధ్య చరిత్రాది కావ్యాల ప్రామాణిక ముద్రణలను ప్రకటించి పరిశోధకులకూ సాహిత్య ప్రియులకు ఉపకారం చేశారు కొమర్రాజు లక్ష్మణరావుగారు కూర్చిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని కూడా ప్రకటించడానికి ఆయన

ఉద్యమించారు ఇతరుల గ్రంథాలను వెలుగులోకి తేవడం మాత్రమే గాకుండా వారే స్వయముగా ఆంధ్ర వాఙ్మయ చరిత్ర ను భగవద్గీత కు వ్యాఖ్యానాన్ని రచించారు విజ్ఞాన సర్వస్వంలో ఆయన వ్రాసిన అనాహతము అపరోక్షానుభూతి అనుభవ సారము అల్లమ ప్రభువు అన్న వ్యాసాలు ఆయన పండిత ప్రకర్షకు నిదర నాలు

ఆంధ్రుల సర్వతోముఖ వికాసానికి అనేక రంగాలలో కృషి చేసి సమకాలిక సాంస్కృతికోద మాలకు అనేక విధాల తోడ్పడి ఆంధ్రులను జాగృతం చేసిన నాగేశ్వరరావుగారు మనకు చిరస్మరణీయులు

చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు

శ్రీ చిలకమర్తి వారు గోదావరి జిల్లాలోని ఖండవల్లి గ్రామానికి చెందినవారు నివాసము రాజమహేంద్రవరము 867 లో జన్మించారు ఆధునిక కవులలో పేరెన్నికగన్న వీరేశలింగం వెంకట్రాయశాస్త్రి కొక్కొండ గిడుగు గురజాడ పానుగంటి మొదలైనవారిలో శ్రీ చిలకమర్తి పంతులుగా రొకరు వారు రచించిన గ్రంథాలు సుమారు ఒక వందయినా ఉంటాయి గ్రంథ రచనచేత ఆ కాలములో లక్ష రూపాయలకు పైగా సంపాదించినట్లు చెప్పుకున్నారు

వారి రచనలలో సౌందర్య తిలక కర్పూర మంజరి అనే నవలలు ప్రసిద్ధి చెందాయి కళాశాలల్లో పాఠ గ్రంథాలుగా కూడ నియమించబడ్డాయి గణపతి గ్రంథ ప్రకటనము మొదలైన ప్రహసనాలు అనేకము తెలుగు వారిని హాస్యములో ముంచెత్తాయి

ఆయన నాటకాల్లో అద్వితీయ ప్రఖ్యాతి గడించినది గయోపాఖ్యానం ఆ నాటకం తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగ విజయము వలె పేరు పొందింది

"అల్లుడా రమ్మని యాదరంబున పిలిచి
మామను బట్టి చంపగలఁ?

"వీతో ముఖ్యముగా నీ బావ చెప్పుకొమ్మన్న సందేశము వినుము

షార్దునులు పోరుకు తలపడి పరస్పరం దద్దించుకుంటూ చేసిన సంభాషణలు బహు పటిష్టముగా నున్నవి

వారు వ్రాసిన పద్యాలు శ్రీ ఆంధ్రునినోట పలికినవి పంతులు గారు గొప్ప ఉపన్యాసకులు దేశభక్తులుగా కూడా మంచి పేరు సంపాదించుకొన్నారు

"భరత ఖండంబు చక్కని పాడియావు హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ తెల్లవారను గడుసరి గొల్లవారు పితుకుచున్నారు మూతులు బిగియ గట్టి" అని బిపిన్ చంద్రపాల్ గోదావరి మండలంలో పర్యటిస్తున్నప్పుడు ఒక సభలో పద్యాన్ని చదివి సభికులను ఉద్రిక్తులనుగా చేశారు 'దేశమాత మనోరమ పత్రికలు ప్రకటించి దేశభాషా సేవ చేశారు శ్రీ వీరేశలింగం పంతులు గారికి వారి సంస్కరణోద్యమంలో కుడి భుజంగా పనిచేశారు వారిని ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 958 లో కళాప్రపూర్ణ బిరుద మిచ్చి సత్కరించారు

ఆంగ్ల భాష నవలాకర్త వాల్టర్ స్కాటువలె తెలుగులో నవలా సాహిత్యమునకు నాటక సాహిత్యమునకు కృషి చేసినందున ఆంధ్ర స్కాటు అను పేరు తగియున్నది

దురదృష్టవశాత్తు 42 వ ఏట నుంచి అంధత్వం ప్రాప్తించినప్పటికి వారి సాహిత్య సేవ నిరాటంకముగా జరిగింది

946 లో నిర్యాణం చెందారు

9 పానుగంటి లక్ష్మీనరసింహారావు

వీరు సీతానగరమునందు 865 వ సంవత్సరమందు జన్మించిరి రాజమహేంద్రవరము నందు చదువు సంధ్యలు సాగించిరి ఆంగ్లము నందును సంస్కృతాంధ్రములందును వీరికి ప్రజ్ఞ కలదు రాయలసీమలోని

అనెగొంది సంస్థానములో ఉర్లాము దివానములో లక్ష్మీనరసాపురము ఎస్టేటులో కొన్ని కొన్ని యేండ్లుగా దివానుగా చేసిరి ఆయన వ్రాసిన సాక్షి వ్యాసములు బహు ప్రశంసల నందుకొన్నవి ఒకే యొక హాస్య రసమును వెలికిదీసిన వారిలో పానుగంటివారు అద్వితీయులు. ఇవిగాక దొంగ పెళ్ళిగ్రామ బుడబుక్కలవాడు తురాపాలెము కొత్తరాణి మొదలయిన చిన్న కథలుగూడ వ్రాసినారు వీరు సుమారు ముప్పదికి మించిన నాటకాలను వ్రాసి ఆంధ్ర షేక్స్పియరు అను బిరుదు పొందినారు వీనిలో పాదుకా పట్టాభిషేకము రాధాకృష్ణ సారంగధర కోకిల కంఠాభరణము మొదలగు నాటకములెన్నో పర్యాయములు రంగస్థలము నందు ప్రదర్శింపబడి తెలుగు ప్రేక్షకుల ప్రశంసాపాత్రములైనవి ఆనాటి పెద్దలచే అభినవ కాళిదాసు గా కొనియాడబడినారు వారు ప్రయోగించిన ఉపమానములు అర్థాంతరములు నేటికాలమునకు చెందినవైయుండి రసానందము కలిగించుచుండును పానుగంటి వారి నాటకములలో గీతములు ఆటవెలదులు బాగుగా చోటు చేసుకొన్నవి తరువాతి స్థానము సీసములది. వారి నాటకములలో సంభాషణములు సన్నివేశములు లోకోత్తరాహ్లాదము కలిగించును పండితులకు పామరులకు సరిపోవునట్టి హాస్యమందించుటలో దిట్ట నాటక సంఘటనలు గూడ వారి ప్రతిభను చాటుచుండును

వారి వ్యాసములనుండి నాటకములనుండి మనలో మనము నవ్వుకొనుటకు వేలకొలది వాక్యము లేరుకొనవచ్చును ముసిముసి నవ్వులు నవ్వుకోవచ్చును కడుపుబ్బ నవ్వుకోవచ్చును ఆయన సాహిత్య సృష్టి తెలుగు వారికి నూతనమైన పుష్టి

పానుగంటివారు పంతులుగారి యాత్మసాక్షి విశ్వాసమునకు పరమోదాహరణములు పానుగంటివారు "వీరేశలింగంగారివలె" వచన రచనకు నాడు చాల దోహదము చేసినారు వీరి హాస్యరచన తమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యముల రచనలందలి వ్యాసరచనకంటె అధికముగా కనిపించుచున్నది.

ఆనాడు సాక్షి ఉపన్యాసములు కొఱకు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము ప్రత్యేకముగా కేటాయింపబడినది ఆయన వచన రచనను ప్రోత్సాహపరచిన కవి సముదాయముమీద వారు చూపిన చమత్కృతులు హాస్యాస్త్రములతో వారి పరిచయము వారి పద్యరచనా రీతులు వారి లోకానుభవము వారి భక్తిభావము మున్నగునవి ప్రశంసాపాత్రములు. పానుగంటివారి వివిధశాస్త్ర కళావిజ్ఞానమునకు ద్రవివతండములైన యుదాహరణములు వారి నాటకములే యెత్తిచూపును ఆంగ్ల వైద్యపరిజ్ఞానము ఆయుర్వేద విజ్ఞానము వారికి లెస్సగా దెలియును.

వారి కలమును తెలుగువారి గుణగుణములు మేలుగిక్కు అల్లరకై పట్టి దంభాచారుల యెడల అవినీతుల యెడల అహంకారుల యెడల ప్రయోగించినారు

'సాక్షి వ్యాసాలు కేవలం వినోదానికి మాత్రమేగాక సంఘంలో ప్రబలిన దురాచారాలను నిర్మూలించడానికి చేపట్టిన ప్రక్రియ జంఘాలశాస్త్రి ఆవేశంతో చేసిన ఈ ఉపన్యాసరూప వ్యాసాలను చదవడానికి ఆకాలంలో పత్రికకోసం ప్రజలు ఎగబడేవారట అవి ఆంగ్లములో అడిసన్ వ్రాసిన స్పెక్టేటరుకు అనుకరణలు కావచ్చు దానినిబట్టి ఆయనను ఆంధ్ర అడిసన్ అనవచ్చు కాని ఆ రచనలు మాత్రం అత్యంత అమూల్యమైనవి అత్యంత ప్రయోజనకరమైనవి

అందరూ ఈ ప్రకారముగా వ్రాయలేరు? అందరూ వ్రాయగలిగితే ఎందుకు వ్రాయలేకపోయారు? అటువంటి రచనలు చేయాలంటే రచయిత దాని అనుభవం కలిగియుండాలి ఎంతో ఎత్తుకు పెరిగి యుండాలి నైతికంగా బలం కావాలి అవి నవలలూకావు నాటకాలూకావు దానితోపోలింది మన వాఙ్మయంలో మరొకటిలేదు. అటువంటి రచనలు చెయ్యడానికి రచయిత ధైర్యమున్నది కలిగియుండాలి ఈ రెండు లేకుండా వ్రాస్తే అవి గుడ్డిరాతలుగానే మిగిలిపోతాయి. అయితే పానుగంటివారి సాక్షి వ్యాసాలు అట్లాంటివి

కారాన్ని పటాపంచలుచేసే కాంతిపుంజాలుగా తెలుగు సాహిత్యములో చోటు చేసుకున్నాయి

సాక్షి వ్యాసాలు ఆరు సంపుటాలలో ప్రచురింపబడ్డవి వ్రాసిన నాటకాలు 30 అయినా ఉంటాయి ప్రహసనాలు కథలు కూడా వ్రాశారు వారు వ్రాసిన నాటకాలలో కంఠాభరణము సుప్రసిద్ధమయినది వారి నాటకాలు ప్రదర్శనా ప్రయోజనతో వ్రాయబడ్డవి కనుక సంభాషణలు అతి సహజంగా ఉంటాయి వారు గ్రాంథిక భాషావాదులైనా వారి శైలి వ్యవహారిక భాషకు అతి సన్నిహితంగా ఉంటుంది నాటక సంభాషణలు కేవలం కథాసన్నివేశానికి పనికివచ్చేవిగాక చమత్కారంగానూ ఆలోచనా పూరితంగానూ ఉంటాయి

వారి రచనలలో ఛలోక్తులు చమత్కారాలు ఉపమానాలు రత్నాలు ముత్యాలులాగ వెదజల్లుతూ ఉంటాయి విదేశీ వాఙ్మయాలను అభ్యసించుకొన్ననూ స్వభాషాభిమానం విడనాడక తన దేశంకోసం తన ప్రజలకోసం ఆవేశంతో సేవాకుసుమంగా సమర్పించిన మహానుభావుడు శ్రీ పానగంటి లక్ష్మీనరసింహారావుగారు

ఏది మనస్సులో అనుకుంటాడో అదే వ్రాశాడు భర్తృహరిలాగా వేమనలాగా త్రికరణశుద్ధితో రచనలు చేశాడు

50 విశ్వనాథ సత్యనారాయణ

రామాయణ కల్పవృక్షము ద్వారా 970 వ సంవత్సరపు భారతీయ జ్ఞానపీఠ అవార్డు అందుకొని ఆంధ్ర దేశానికి తెలుగు భాషకు విశిష్ట గౌరవాన్ని సముపార్జించిన కవిసామ్రాట్ డాక్టర్ విశ్వనాథ సత్యనారాయణ ఆధునికాంధ్ర సాహిత్య జగత్తులో మహోన్నతమైన వ్యక్తి

ముక్తక కావ్యాలు గేయ కావ్యాలు ఖండ కావ్యాలు శతకాలు మహాకావ్యాలు కథలు నవలలు నాటకాలు విమర్శలు మొదలగు

న్ని ప్రక్రియలలో రచనచేసి తన సాహిత్య వైవిధ్య నైపుణ్యాన్ని రూపించుకున్న విశ్వనాథ తెలుగు సాహిత జగత్తులో హిమాలయ సదృశుడు

దేశ స్వాతంత్ర్యోద్యమ ప్రభావంతో విశ్వనాథ ఆంధ్ర ప్రశస్తి ఆంధ్ర పౌరుషము అనే దేశభక్తి పూరిత రచనలను చేశారు

వీరి రచనలు ఏకవీర వీరి ప్రథమ నవల అందలి శైలియు కానిర్మాణ కౌశలము పాత్రపోషణమును నేర్పుతో గూడినవి చెలియలి ట్ట ధర్మచక్రము బద్దన్నసేనాని తెరచిరాజు మా బాబు స్వర్గానికి నిచ్చెనలు వారి వేయిపడగలు పరిమాణమునందు వలెనే గుణమునందును నగ్రగణ్యమైనది అది యాధునికాంధ్ర దేశ సాంఘిక మత రాజకీయ పరిస్థితులకు మణిదర్పణము అందలి వర్ణనలు భావ గంభీరములు పాత్రలు సజీవములు శైలి మధుర గంభీరము అది ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి నవలల పోటీలో అడవి బాపిరాజు నారాయణరావుతో పాటు ప్రథమ బహుమానము నందుకొన్నది శ్రీ విశ్వనాథగారి నవలలలో ప్రకృతి పరిశీలనమువలెనే ప్రపంచ పరిశీలనము పిక్కుటముగా గోచరించును అందు ప్రతి పుటయు వారి సనాతన సాంప్రదాయాభిమానమును, ఆక్కగా బాటుచుండును ఈయన సుమారు 0 నవలలు రచించారు

వీరి నవలలలో వేయిపడగలు హిందీలోనికి ఏకవీర హిందీ, ఆంగ్ల భాషల్లోనికి అనువదింపబడ్డవి

కిన్నెరసాని పాటలు ఈయన రచించిన పేరొందిన గేయకావ్యం దీనిలో ఈయన భావనాసంపత్తి ఉన్నతమైన కల్పనల పరిచయం పాఠకులకు లభిస్తుంది

కరిగింది కరిగింది
కరిగింది — కరిగింది

తరుణి కిన్నెరసాని వరదలై పారింది
తరుణి కిన్నెరసాని తరకలు కట్టింది.
పడతి కిన్నెరసాని పరుగులు పెట్టింది

పై విధంగా సంగీతాత్మక కవితద్వారా శృంగారం యొక్క వర్ణన చక్కగా చేశారు కోయిలమ్మ పెళ్ళి ఈయన రచించిన మరో గేయం.

నాటక కర్తగా గూడ ఈయన మంచిపేరు గడించారు. నర్తనశాల అనార్కలి వేనరాజు త్రిశూలం మొదలయిన తెలుగు పౌరాణిక నాటకాలు, ఆశపీరాసమ్ అమృతశర్మిష్ఠం అనే సంస్కృత నాటకాలను కూడ రచించారు.

రామాయణ కల్పవృక్షము :

తెలుగు సాహిత్యంలో ఇది మణిదీపము వంటిది. దివాకర్ల వేంకటావధానిగారన్నట్లు కల్పవృక్షము నిజముగా గల్పవృక్షమే దీనిలో అమృతమున్నది. అమూల్య రత్నములున్నవి. ఓషధులున్నవి కైకేయి మంథర రాముడు, దశరథుడు, విభీషణుడు రావణుడు శబరి మారీచుడు మొదలగు పాత్రల చిత్రణలో ప్రాచీన నవీన భావాల కలయిక విశ్వనాథ సహజ నైపుణిలో కనిపిస్తాయి

ఈయనకు ప్రజా హృదయంలో విశిష్ట స్థానముంది. వేయిపడగలకు ఆంధ్ర విశ్వ విద్యాలయ బహుమతి లభించింది. ఈ సందర్భంగా బందరులో జరిగిన సన్మాన సభలో ఈయనకు కవిసామ్రాట్ అనే బిరుదు లభించింది

ఆంధ్ర వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలు ఈయనకు కళాప్రపూర్ణ డాక్టరు బిరుదములిచ్చి గౌరవించినవి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు కేంద్రీయ సాహిత్య అకాడమీ అవార్డు ఈయనకు లభించాయి.

ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా విధాన పరిషత్ నామినేటెడ్ సభ్యుడుగా సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడుగా పద్మభూషణ్ బిరుదాంకి

కుడుగా భారతీయ జ్ఞానపీఠ అవార్డు గ్రహీతగా ఖ్యాతిగాంచిన సత్య నారాయణగారు ఆధునికాంధ్ర కవులలో అగ్రగణ్యులు

51 మహాకవి శ్రీశ్రీ

"దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అన్న గురజాడ గొంతుక విని సాహిత్య జగత్తులో మనిషి మేల్కొన్న తరువాత పతనమవుతున్న సమాజమును చక్కదిద్దడానికి తన కలమును ఒక సాధనముగా నుపయోగించాడు శ్రీరంగం శ్రీనివాసరావుగారు శ్రీవాణితో ప్రారంభమైన ప్రాచీన మార్గం శ్రీశ్రీవాణితో మహాప్రస్థానం సాగించ డానికి మరో నాందిని పలికించిన సూత్రధారి శ్రీశ్రీ

శ్రీశ్రీ గారి రచనలలో ముఖ్యమైనవి - మహాప్రస్థానం మరో ప్రపంచం ఖడ్గసృష్టి మహాసంకల్పం వంపుతేరిన కత్తి ఆకాశపు ఎడారిలో కాళ్ళు తెగిన ఒంటె ఇంకా చేదుపాట కేక దేవి కొరకు మున్నగు గేయములు అమిత ప్రచారరణ నొందినవి

శ్రీశ్రీ రచనల్లో మహాప్రస్థాన కావ్యసంపుటి మకుటాయమానం అభ్యుదయ ఆంధ్ర సాహిత్య మార్గానికి మహాకావ్యం ఇందు వీర రస ప్రస్తావం విస్తారంగా చేశాడు పీడితవర్గం స్వేచ్ఛా స్వాతంత్ర్యం కోసం రక్తవిప్లవము సాగించాలన్న ప్రబోధమే ఆయన కవితలలో కనబడే ఉత్సాహం తిరుగుబాటులో ఎంత ఉత్సాహముందో కష్టజీవుల దుర్భర జీవితంలో అంత కరుణం ఉంది లలిత రసాల్లో శృంగారం తరువాత కరుణం ప్రధానం పెట్టుబడిదారుల దారుణకృత్యాలను సృష్టిస్తే అందులో రౌద్రం భాసించేది శ్రీశ్రీ ఆ అంశాన్ని అధికంగా ప్రస్తావించకుండా బాధితుల విషాదవేదనలనే విపులంగా సృష్టించాడు వీరం పౌరుష రసం కాబట్టి గేయంలో వేదనతో కూడిన గతితోపాటు పదునుదేరిన పదజాలం ఉంటుంది అంతేగాక శార్మిక శ్రామిక లోక కల్యాణానికై కలం పట్టిన

కవి శ్రీశ్రీ వారి వృత్తి చిహ్నాలనే మన ప్రవృత్తి సంకేతాలుగా భావించి కీర్తించిన ఇతని కవిత్వానికి ఈ క్రింది గేయం ఒక మచ్చుతునక

"నాలో కదిలే నవ కవిత్వం
కార్మిక లోకపు కల్యాణానికి
శ్రామికలోకపు సౌభాగ్యానికి
సమర్పణంగా
సమర్పనంగా

శ్రీశ్రీ కరుణరస ఘట్టాలను చిత్రించే కవితల్లో ఆడంబరం లేని అర్థవంతమైన రచనా శిల్పాన్ని ప్రదర్శించెను మహాప్రస్థానంలో ఆకాశ దీపం బాటసారి భిక్షువర్షీయసి ఇందుకు నిదర్శనములు

శ్రీశ్రీ ప్రాచ్య పాశ్చాత్య కావ్య సాంప్రదాయాల్లో ఉన్న ల్పి రహస్యాలు తెలిసిన మనిషి సంస్కృత ఆంధ్ర పాశ్చాత్య సాహితీ సాంప్రదాయాల త్రివేణీ సంగమమే శ్రీశ్రీగారి ప్రతిభకు ప్రబల నిదర నము శిల్పులైన అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ ప్రథమ గణ్యుడు కాని వీరి ప్రధాన దృక్పథం భౌతికవాదం "వీరు ఆకాశంలోకి వెళ్ళి నక్షత్ర పథాల్లో విహరించినట్లే భూమికి సమీపంగా వచ్చి ఇదివరకు కవులు ప్రవేశించని చీకటి కోణాలలోనికి కాంతి కిరణాలు పంపిస్తున్నారు" నగర జీవితం పారిశ్రామిక పరిస్థితుల హృదయ విదారక దృశ్యాలు పతన స్థితిలో నున్న సమాజము యొక్క నిజ స్వరూపములను తన కావ్య వస్తువులుగా చేసుకున్నారు ఈ మార్గంలో వీరికి రష్యన్ వ్యాచరిజం ఆదర్శమౌతుంది ఆయన ప్రతీక వాదానికి ప్రతి కావ్యఖండం ఉదాహరణమైనా అందులో మిన్నగా కనబడుతుంది జగన్నాథుని రథచక్రాలు ఇది ప్రజాశక్తి సాధించే సమసమాజ వ్యవస్థకు ప్రతీక

స్వాతంత్ర్యం సమభావం సౌభ్రాత్రం, సౌహార్దం
పునాదులై ఇక లేని జనావళికి శుభంపూని

శాంతి శాంతి శాంతి శాంతి జగమంతా జయిస్తుంది
ఈ స్వప్నం నిజమౌతుంది ఈ స్వర్గం ఋజువౌతుంది
అని సమసమాజ శాంతి పాఠం పఠించారు

శ్రీశ్రీ రచనకు స్వేచ్ఛ ప్రధాన గుణం, పద్యమైనా గేయమైనా ఆయన చేతుల్లో వింత మార్పు పొందుతుంది బహిరాకృతి కంటే భావ లయలకు ఆయన ప్రాధాన మిస్తాడు భాషా విప్లవమే భావ విప్లవం అని వ్యవహారిక ఆంధ్ర భాషనే తన గేయాల్లో వాడెను ఈ విధంగా భాషలో భావంలో ఛందంలో పదబంధంలో అలంకారంలో ఉక్తి చమత్కారంలో క్రొత్త పోకడలు పోయి తనదైన ఒక జగత్తును సృష్టించుకొన్నాడు శ్రీశ్రీ ఆయన తన ఖడ్గసృష్టి మహాసంకల్పం మొదలగు ఇతర కృతుల్లో ప్రయోగానురక్తి అధికంగా ప్రదర్శించినాడు సాంప్రదాయ నిర్మూలనానికి ఆయన కలాన్ని ఖడ్గంగా ఉపయోగించినాడు ఈ క్రింది గేయంలో తన వీరవాది ఉగ్రవాది లక్షణములను నిక్కచ్చిగా వాడెను

"ఈ కత్తి బూజుపట్టిన భావాలకి పునర్జీవం ఇవ్వటానికి కాదు
కుళ్ళిపోతోన్న సమాజ వృక్షాన్ని సమూలచ్ఛేదం చేయడానికి"

అంతేగాక శ్రీశ్రీ మరో ప్రపంచంలో సూచించింది మార్క్సిజం వ్యవస్థలో ఉన్న మానవ సమాజమునే-

బలవంతులు దుర్బల జాతిని - బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై - చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి

అని చెప్పటలో వర్గ కలహం చరిత్ర గతికి మూలకారణమనే ఆయన భావన స్పష్టమగుచున్నది ప్రతి పదంలో ప్రగతి శీలం ప్రతి ధ్వనించాలనేది ఆయన ఆశయం. ఈ లక్ష్యంతో శ్రీశ్రీ మరో ప్రపంచాన్ని చూస్తూ పాడిన గీతమిది

పదండి ముందుకు పదండి త్రోసుః
ప్రభంజనంవలె హోరెత్తండి

భావవేగమున ప్రసరించండి
వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె
పెళపెళపెళ విరుచుకు పడండి

మేల్కొన్న జాతిని ముందుకు నడిపించే సమర గీతి ఇది. ఈ పాటలో జీవమంతా గతిలో ఉంది. శ్రీశ్రీ అవగాహనలో మానవుడు శరీరం కంటే భిన్నమైనవాడు. తాను శరీరం కంటే భిన్నమనే ఒక భావాన్ని మానవునికి అనుభవం చేసే తాత్విక చిత్తవృత్తిని శ్రీశ్రీ సూచిస్తున్నారని చెప్పవచ్చు.

వీరు 'ప్రతిభ' లాంటి పత్రికల సంపాదకత్వం నిర్వహించారు. సినీరంగములో పాటలు మాటలు వ్రాసి అందులోను తన వ్యక్తిత్వాన్ని నిలుపుకున్నారు. 'సాహిత్యాచార్య' మొదలగు బిరుదులు పొందినారు. కేంద్ర సాహిత్య అకాడమీ, సోవియట్ బహుమతులు కూడ పొందినారు.

అభ్యుదయాంధ్ర కవితా యుగకర్త శ్రీశ్రీ. ప్రజాకవి. సమాజ చైతన్యాన్ని మేల్కొల్పి దానిలోని వేడి శక్తాన్ని ఉడికించి, కవితను ప్రజా వాణిగా పలికించిన మహాకవి శ్రీశ్రీ. ప్రపంచ పదితుల బాధామయ గీతాన్ని హృదయగీతిగా పాడించి జీవితానికి, సాహిత్యానికి మంగళ సంవిధానాన్ని సాధించిన ఆధునికాంధ్ర సాహిత్య రథసారథి శ్రీశ్రీ. తిక్కన వేమన గురజాడ - ఆయనలో కొత్తరూపం దాల్చి తెలుగు వారికి తెలుగు వారికి ఒక అంతర్జాతీయ కవిని సమర్పించారు.

నిజంగా నేను
ప్రజలకవినేను
వింటేతం టేను
వాళ్ళను చదివేను
చదివించే రాసేను

ప్రజలను చదివిన వాడూ చదివించి వ్రాసినవాడూ ప్రజాకవి. దానికి మారుపేరు శ్రీశ్రీ.

52. గురజాడ అప్పారావు

సాహిత్యం ఒక పరమార్థసాధనకు సాధనం మాత్రమేగాని అదే పరమార్థకంగాదు మహాకవులెవ్వరూ సాహిత్య సంసార లంపటులేగారు ఈ సత్యం గురజాడ అప్పారావు పంతులుగారిలో సార్థకమయింది అటు కందుకూరి సాంఘిక విప్లవమును ఇటు గిడుగు రామమూర్తి పంతులుగారి భాషా విప్లవమును సమన్వయము చేసిన సరికొత్త సాహిత్య విప్లవమునకు ప్రారంభకులు గురజాడ అప్పారావుగారు ఈయన నివాసము విజయ నగరము జననం 886 మరణం 9 5

ప్రారంభదశలో అప్పారావుగారు సాంప్రదాయరీతినే ఖండకావ్యములు రచించిరి ఈయన తన ఇరువదవ ఏటనే ఆంగ్లమున సారంగధర కృతికతో కవిత్వరచన చేసిరి విజయనగరమందలి అధికారుల అగడములు మాయమాటలు మాటల మబ్బులు లో అన్యాపదేశముగ చెప్పిరి సంస్కృత చాటు శ్లోకము లనేకములనువదించినను వారి అనువాదమున తెలుగు నుడి కారము చక్కగా చోటు చేసికొనినవి వీరు ఋతుశతకము అను శత కమునుగూడ వ్రాసిరి ఇందు అన్ని పద్యములందు త ప్రాసము గలదు

"వీరు ఆంధ్ర కవిత్వ రంగమున చేసిన సాహస ప్రయోగములు ప్రాచీన కవులలో పాల్కురికి సోమనాథుని తలపింపజేయును" అని డాక్టరు శ్రీ సి నారాయణరెడ్డిగారన్నారు

మంచితనం వెల్లివిరుస్తూ సాంఘిక దురాచారాలు లేని ఒక సముజ్జ్వల నూతన వ్యవస్థను నూతన ప్రపంచమును దర్శించిన కవి శ్రీ అప్పారావు గారు వారి కలమూ కాలమూ సర్వస్వమూ ఆ నవప్రపంచానికే అంకితం చేయబడ్డాయి

గురజాడవారు తెలుగుదేశంలో భావవిప్లవానికి వేగుచుక్కై ప్రకా శించారు అంధపరంగా తయారైన తెలుగు కవిత్వాన్ని ఛాందస గ్రంథాలాం

నుంచి తప్పించి ప్రప్రథమంగా గేయ నేపథ్యం సమకూర్చి స్వేచ్ఛా పథంలో ప్రతిష్ఠించారు దేశము మనిషి అనే భావాలను రెండినీ జాజు దులిప అపూర్వ నూతన కాంతిలో మెరిసేటట్లుచేసి సాహిత్యంతో మేళవించి తెలుగువారికి అందజేశారు వారి తరువాత బసవరాజు అప్పారావు శ్రీశ్రీ మొదలగువారు ఆ మార్గాన్ని అనుసరించి తెలుగు సాహిత ం దానిని ఒక ప్రధాన భాగముగాను అత్యంత ప్రశాంతిమాన్ని చూరగొన్న మార్గముగాను స్థిరపరిచారు ఆ విధంగా గురజాడవారు నవకవితా లోకానికి మార్గ దర్శకులుగా తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగకర్తలుగా శాశ్వత ప్రతిష్ఠ పొందారు

గురజాడవారి రచనలలో ముఖ్యమైనవి కన్యాశుల్కము కొండు భట్టీయము బిల్హణీయము ముత్యాల సరాలు పూర్ణమ్మ కథ లవణరాజు కల కన్యక మనిషి లంగరెత్తుము దేశభక్తి అను గేయము వీరి గ్రంథముల నుండి వీరి భావములు సంఘ సంస్కరణ నూతన సాహిత ప్రయోగము మానవతావాదము దేశభక్తి మొదలగునవి తెలియును

1 మానవతావాదము - తన మతము మానవత్వ మతమని గురజాడ తన రచనలందు నిరూపించెను వారి రచనలన్నిటిలోను అపార మైన కీర్తి గడించినది కన్యాశుల్కమను నాటకం కన్యాశుల్కము వ్రాయు టలో వీరికి రెండు ఉద్దేశములు కలవు సంఘ సంస్కరణము, 2 వ్యవహారిక భాషను సాహిత్యములోనికి ప్రవేశపెట్టుట మొట్టమొదటి సారిగా గ్రంథాలలోనికి అన్యదేశ పదాలను ముఖ్యంగా ఆంగ్ల పదాలను సుమారు ఆరువందల పదాలను ఈ నాటకములోని కెక్కించిరని కేతవరపు రామకోటి శాస్త్రిగారు చెప్పుచున్నారు నాటక రచనలో ఒక అపూర్వ మార్గాన్ని చూపించారు ఒక్క మాటలో చెప్పాలంటే "ఆనాడు భాషలో చెలరేగుతున్న వ్యవహారిక భాషోద్యమానికి గిడుగు రామమూర్తిగారు లక్షణం చెపితే అప్పారావు పంతులుగారు ఈ నాటక రచనచేత లక్ష్యాన్ని

ప్పినట్లు మనము గ్రహించవచ్చును ఈ నాటకము సహజసుందరమైన మాండలిక పద ప్రయోగమునకును, నిర్మలమైన హాస్యమునకును శక్తివంతమైన సంస్కరణ ప్రబోధమునకును నిలయమైనది తెలుగు నాటక రంగమందు ఈ నాటకము ఒక విప్లవము తెచ్చినది " అంత సజీవము సహజమునైన పాత్ర ఆంధ్ర నాటకము లందెచ్చటను కానరాదని దివాకర్ల వారు చెప్పుచున్నారు

సంఘమును సంస్కరించవలెనను పట్టుదల ఇతని రచనలలో మిక్కుటముగా కనబడుచున్నది వీరి రచనలందు స ఘములోని దురాచారములు ఖండించుటయు మూఢ విశ్వాసములను నిరసించుటయు కలదు వర్ణవ్యవస్థను విమర్శించడం కూడ జరిగింది వృద్ధ వివాహముల వలన కలిగెడి దుష్ఫలితములను తెలియజెప్పి అది ఎంత సాంఘిక దురాచారమో 'పూర్ణమ్మ కథ'లో చిత్రించారు ఈ విధంగా మూఢాచారాలను హాస్య భావనం చేసి సామాన్య ప్రజల్లో వాటిపట్ల తొలిసారిగా కనువిప్పు కలిగించిన అత్యుత్తమ నాటకం కన్యాశుల్కం

2 దేశభక్తి వీరి దేశభక్తి నిరుపమానము దేశభక్తి యనగా దేశమందలి మనుష్యులపై భక్తి ఆరాధన అని ఆయన వ్రాసిన ఈ క్రింది గేయము ప్రబోధించుచున్నది

"దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్, గట్టి మేల్ తలపెట్టవోయ్
ఈసురోమని మనుషులుంటే - దేశమేగతి బాగుపడునోయ్
దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్"

అని ఎలుగెత్తి చాటిన నవ ప్రపంచ సందేశం తెలుగు హృదయాల్లో ఒక నవీన భావచైతన్యాన్ని కలిగించింది

3 కవిత్వ రీతులు - గురజాడవారు కవిత్వములో అనేక ప్రయోగాలు చేసిరి నూతనత్వమును ప్రవేశపెట్టిరి అది భావమున శైలిలో

పద ప్రయోగమున ఛందస్సును స్వీకరించుటలోను కలదు తిక్కన కందమునకు వేమన ఆటవెలదికి ఎట్లు నవ తను అలంకారమును కూర్చిరో అట్లే గురజాడ ముత్యాల సరమను కావ్యములో నూతన ఛందస్సుకు ప్రారంభోత్సవము చేసెను వీరి భావనాశక్తి అపూర్వము "మనిషికి ధనము ఒక్కటే చాలదు- విజ్ఞానము ధైర్యము అవసరము" అని తన "కన్యక" ద్వారా మానవులందరికి హితోపదేశము చేసెను వీరు నవ కవిత్వపు రచనలన్నింటి యందును వ్యవహారిక భాషనే వాడెను అదే విధముగ ప్రబోధ కవిత్వమునకు అప్పారావుగారు నాంది పలికిరి "మనిషి లోనే దేవుడు కలడు అతడిని కొలిచిన దేవున్ని కొలిచినట్లే" యనుచు "మానవసేవయే మాధవసేవ"యని తన గేయము మనిషి లో ప్రబోధించుట కాననగును గురజాడ వ్యక్తిత్వంలో కాననగు అనేక గుణాలలో ప్రముఖంగా కనబడేది ఆయనలోని ఆధునికత "భాష భావం ఇతివృత్తం ఛందస్సు అన్నింటా ఆధునికత" అని రమణారెడ్డి గారు తను వ్రాసిన మహోదయం లో గురజాడలోని ఆధునికతను ప్రశంసించినారు తెనుగు కవిత్వమున అనేక నవ్య ప్రక్రియలు ప్రారంభించి తదుపరి కవులకు మార్గ దర కులైన గురజాడ గారిని "యుగకర్త" గా శ్రీశ్రీ పేర్కొనిరి

తెలుగు జాతికొక క్రొత్త చూపు తెలుగు సాహిత్యానికొక క్రొత్త రూపు యిచ్చి మంచి యను విలువైన వస్తువును లోకంలో పెంచడానికి తన కలాన్ని కాలాన్ని వినియోగించిన అద్వితీయ ప్రతిభాశాలి కవి నాటక కర్త మహాప్రముఖుడు శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు

సనాతన మతం పేరట జరుగుతున్న అన్యాయాల్ని అరికట్టాలి అనేదే ఆయన దృష్టి మతాన్ని గురించి మనకున్న అభిప్రాయాలన్నీ ఆయనకి ఉన్నాయి అనుకోవడం పొరపాటు క్రొత్త పాతల మేలుకలయిక ఆయన ఆదర్శం దాన్ని పూర్తిగా సాధించాడు.

ఆయన కథలకు ఒక విశిష్టత ఉంది కథా ప్రారంభంలోనే పఠితం మనస్సుల్ని ఆకర్షిస్తాడు దిద్దుబాటు మీ పేరేమిటి మొదలైన కథలు విశ్వసాహిత్యంలో ఉన్న ఏ కథంకి తీసిపోవు కన్యాశుల్కంలోని ఏ

ఘట్టంలోనూ ఏ పాత్రలోనూ ఏ మాటలోనూ బింకం సడలిపోలేదు. ఈ లక్షణాలు అన్నీ గురజాడ రచించిన చిన్న కథల్లో మనకి కనబడతాయి అప్పారావుగారు ధేయం మానవుల హృదయాన్ని సంకుచితపరిచి బంధించి వుంచే శృంఖలాల్ని ఛేదించడం వ్యాసరచన బుద్ధివికాసానికి తోడ్పడాలని ఆయన భావం అందుకే ఆయన రచనల్లో హాస్యం గుణదోష విచారం, సందేశం తగిన మోతాదుల్లో కలిసి పఠితల హృదయానికి మనస్సులకి కూడ రంజకంగా ఉంటాయి.

గురజాడని మహానాటక కర్తగా అంగీకరించినవాళ్ళు కూడా ఆనారు ఆయన్ని మహాకవి అనడానికి అంత సుముఖంగా లేరు అయితే ఆయన్ని మహాకవి అన్నవారు అసలే లేరనికాదు మహాకవి అన్నవాళ్ళలో దేవుల పల్లి కృష్ణశాస్త్రి నిడుదవోలు వేంకటరావువంటి వారున్నారు రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైన తరువాత మనకు స్వాతంత్ర్యము లభించిన తరువాత గురజాడ రచల్ని నవ్యదృష్టితో చూడడం ప్రారంభించారు దీనితో యువతరంలో గురజాడకి మంచి ప్రచారం లభించింది ఇదిగాక అంతకు పూర్వం విశేష ప్రచారంలో లేని ఆయన రచల్ని అవసరాల సూర్యారావుగారు విశాలాంధ్రవారి ద్వారా ప్రచురించడంతో గురజాడ పూర్తి స్వరూపం ప్రజలముందుకు వచ్చింది అప్పటికే పాతరచనలతో విసిగి ఉన్న తెలుగువారికి గురజాడవారి రచనలు "క్రొత్త పాతల మేలుకల యికగా క్రొమ్మెరుంగులు" చిందించాయి

ఆయన మానవతావాది గనుక ప్రజలకు సన్నిహితులయ్యారు అందుకే "నాది ప్రజల ఉద్యమం" అని ఆయన ధైర్యంగా వ్రాయ గలిగారు

53 గుఱ్ఱం జాషువా కవి

జాషువా సుకవి అతని వ్యక్తిత్వం సంస్కార ప్రియుల హృద యాల్లో జీవిస్తున్నది అతని కవిత ప్రజల నాలుకలపై ఎప్పుడూ నిలిచి వుంటుంది జాషువా కవిత్వాన్ని అతని వ్యక్తిత్వం నుంచి విడదీయలేము అంటరానితనం విషాగ్నులు చిమ్మినపుడు మన హృదయాలు కోటుకునే అతని రచనలు జ్ఞాపకమొస్తాయి వాటిలో ముఖ్యమైనవి పిరదౌసి గబ్బిలం

శ్మశానవాటి మొదలగునవి జాషువా కవికున్న ఎన్నో బిరుదుల్లో చిర స్థాయిగా నిలిచిపోయింది - కవికోకిల

జాషువా హృదయంలో వెలరేగిన ఒక్కొక్క వేదన ఒక్కొక్క ఖండాకృతిగా రూపొందింది

ఫిరదౌసి లోని ఇతివృత్తం కవితకు రాజు (ప్రభుత్వం) చేసిన అన్యాయం

గబ్బిలానికి ఇతివృత్తం అస్పృశ్యుని ఆత్మఘోష
శ్మశానవాటి కి నేపథ్య రంగం సమతా దృక్పథం

జాషువా కవిగారి కవితా దృక్పథము ఈ క్రింది పద్యములో ప్రతిధ్వనిస్తున్నది

"మధుర రసమును గడుపున మాటుకొన్న
ద్రాక్ష పం గుచ్ఛముల యందముల తూగు
వర కవీంద్రుని కావ్య ప్రపంచమందు
ప్రతి పదంబున మదికి దర నమొసంగు

ఈ పద ంలో ఉత్తమ కవిత్వానికి ఉండవలసిన లక్షణాలు సూచింప బడ్డాయి. కవితా లక్షణ నిర్దేశంలో శ్రీనాథునికి జాషువాకు ఎంతో సాదృశ్యం వు ది కవిత్వం భువన హితం కోరేదిగా ఉండాలని జాషువా విశ్వాసం రాజుల భోగ వర్ణనలు విరహిణుల అంగాంగ వర్ణనలు అతనికి గిట్టవు

జాషువాలాగ అనేక ఉర్దూ పారసీక పదాలను ప్రయోగించిన కవి మరి ఎవరూ లేరు కుమ్మక్కు (కుమ్మక = సహాయం) నగిషీ (నక్ష్ = అలంకరణ) హయాం (అయ్యాం = దినాలు రోజులు) గలాభా (ఘలాభ = గొడవ పురమాయించి (ఫర్మానా = సెలవిచ్చుట ఇంకా షరాబు, కులాసి నిఖలు తయారు ముస్తాబు మామూలు దర్జా ధీమా పసందు కోన్కిస్కాగాదు వంటి ప్రయోగాలు జాషువా కవితలో కోకొల్లలుగా దొరకుతాయి.

వ్యవహారంలో ఉన్న పదాలు ఏ భాషవైనా కావచ్చు స్వేచ్ఛగా కావ్యంలో ప్రయోగించాలన్న ఆధునిక దృక్పథాన్ని జాషువా సమర్థించారు.

తాను ఛందోబద్ధంగా పద్యాలు వ్రాసినా భాషా విషయికంగా వ్యావహారిక పద ప్రయోగానికి బాసటగా నిలబడ్డారు ఛందో నిబంధనలను కొంత సడలించాలన్నారు సంఘ సంస్కరణ రంగములో కందుకూరి వీరేశలింగంగారికి కైమోడ్పులు ఘటిస్తూనే అతడు తన ఆంధ్ర కవుల చరిత్రలో ప్రజాకవి వేమనను చేర్చక పోవడాన్ని నిరసించాడు తెలుగు నుడులను సమాదరించని పండితులను పరిహసించాడు

భావకవితా నిరసనం

భావకవితా యుగం మహోజ్జ్వలంగా వెలుగుతున్న రోజుల్లో తలెత్తిన కవి భావకవితలో ప్రణయ కవిత బహుగా విస్తరించింది జాషువా దేశాభిమాన కవిత్వం సంఘ సంస్కరణ కవిత్వం వెలయించెనేగాని ప్రణయ కవిత్వము వైపు పోలేదు- సఖి వంటి ఒకటి రెండు ఖండ కృతులలో తప్ప కంటికి కనిపించిన వాస్తవాలనే ప్రవచించాడు ఊహా ప్రేయసి వర్ణనను నిరసించాడు సాలీడులో కూడ కళల పరమార్థం కేవలం అందమే కాదని నలుగురికి ఉపయోగపడని జిలుగు నగిషీలు వ్యర్థమని అభిప్రాయపడ్డాడు

పదాల పొందికలో కూడ పొదుపును పాటించాడు తోచినంతలో తూచి వేయడం నొక్కి చెప్పవలసి వచ్చినప్పుడు చేయి సాచి వేయడం జాషువా పదప్రయోగ విశిష్టత

విసర్గ శైలి

జాషువా కవికి పద్యాన్ని చిత్రిక పట్టడం తెలుసు భావాల్ని చిత్ర చిత్రాలుగా కూర్చడమూ తెలుసు అతని కవిత్వానికి ఆవేశం జీవం అసలు ఏ కళకైనా రసావేశమే ప్రధానం. అందుకే జర్మను మహాకవి గెథే అన్నాడు- "True art canno ex w hou emot on" అని జాషువా అనుభూతితో చూసాడు* ఆవేశంతో వ్రాస్తాడు క్రమ పద్ధతిలో తన కవితను కొనసాగిస్తాడు.

జాషువా రసావేశానికి ఫిరదౌసి ముంతాజ్ మహల్ గబ్బిలము శ్మశానవాటి వంటివి ఉదాహరణలు

కరుణవీరం

జాషువా కవిత కరుణ వీరరస ప్రధానము జాషువా కవిత్వం చింతిస్తే కరుణ రసం ఉత్త కన్నీళ్ళది కాదు ప్రతిఘటనా పూర్వక మైనది ఈ కవి కరుణరసంలో నుంచి వీరరసాన్ని పొంగించారు

కరుణరస మొకండె కఠిన రాక్షసముల్
హృదయములను గలచి ముదము గూర్చు
వేడి కండనీటి విలువ సహజమైన
చలువలీను అశ్రువులకు లేదు ముసాఫం

జాషువా కృతుల్లో కరుణ వీరానికి కీలకము మూలకము అయిన పద్యమిది

"కఠిన చిత్తుల దురాగతములు ఖండించి
కనికార మొలకించు కలము నాది"

అని చెప్పగలిగారు

"నిమ్న జాతుల కన్నీటి నీరదములు
ఎడుగులై దేశమును కాల్చివేయు"

నని హెచ్చరించగలిగారు కార్చే కన్నీళ్ళను తిలకించడం అంటే కరుణ వీర రస సిద్ధాంతానికి బాటవేయడమే కదా

"వాని తలమీద పులిమిన పంకిలమును
కడిగి కరుణింపలేదయ్యె గగన గంగ
వాని నైవేద్యమున అంటుపడిన నాడు
మూడు మూర్తులకును గూడ కూడులేదు" — గబ్బిలము

అస్పృశ్యుడు పండించిన ధాన్యమే కదా ఆలయములో సమర్పించే నైవేద్యం అంటరానివాని ధాన్యాన్ని అంటుకోమని ఆ దేవతలే అనుకుంటే వాళ్ళకు కూడు లేదు పూజారులకు బ్రతుకుదెరువు లేదు

"ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని దుః
ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీభరతమేదిని, ముప్పది మూడుకోట్ల దే
వత లెగవడ్డ దేశమున భాగ్యహీనుల క్షుత్తులారునే"

అన్న పద్యంలో గోచరించే కరుణవీరం ఏక కాలంలో దైన్యాన్ని ప్రకోపాన్ని నిర్వేదాన్ని క్రోధాన్ని ఉగ్రతను చింతను ప్రకటిస్తుంది

సంఘ సంస్కరణం

వర్ణవ్యవస్థను విమర్శిస్తూ -

"ముసలివాడైన బ్రహ్మకు పుట్టినారు
నలువురు కుమారులనుట విన్నాముగాని
పసరమునకన్న హీనుడభాగ్యుడైన
యైదవకులస్థు డెవ్వరమా సవిత్రి"

అన్నారు ఈ ఐదవకులమేమిటి ఆ కులం అంటరానిది కావడమేమిటి ఎవరు దీనిని సృష్టించారు భారతీయులు ఎందుకు దీన్ని ఇంకా అనుసరిస్తున్నారు ? ఈ ప్రశ్నలకు సమాధానము లేదు కులమత వ్యవస్థను కూకటివేళ్ తో పెల్లగించాలని కలాన్ని గునపంగా ఉపయోగించారు. ఈ సంఘ సంస్కరణాభిలాష ఇతని కవిత్వంలో చతుర్ముఖాలుగా సాగింది.

మత వైషమ్య నిరసనం

2 అస్పృశ్యతా నిరసనం

3 అంధ విశ్వాస నిరసనం

4 దారిద్ర్య నిరసనం

ఈ నాలుగు అంశాల పునాదుల మీదనే ఇతని సంఘ సంస్కరణ కవితా నిర్మాణం జరిగింది

అభ్యుదయ భావన

అన్ని ఏ ఒక్కవర్గం గుత్త సొత్తుగా ఉండరాదని అది అందరికి సమంగా అందాలని ప్రబోధించిన అభ్యుదయకవిత్వాన్ని ఇతడు బోధించాడు

సహజమైన ప్రకృతి సౌఖ్యంబు లోకవ్యక్తి
దొంగిలించి మనుట దొసగు నాకు

ఈ పద్యంలో దోపిడీ వర్గాలపై తిరుగుబాటు ధోరణి కానవస్తుంది

శ్మశాన వాటిలోని ప్రతి పదం తీవ్రమైన అనుభూతికి ఒక ప్రతీక

"ఇచ్చోట నే సత్కవీంద్రుని కమ్మని కలము నిప్పులలోగఱిగిపోయె
యిచ్చోట నే భూములేలు రాజన్యుని యధికార ముద్రిక లంతరించె
యిచ్చోట నే లేత యిల్లాలి నల్లపూసల సౌరు గంగ గలసిపోయె
యిచ్చోట నెట్టి పేరెన్నికం గనుగొన్న చిత్రలేఖకుని కుంచియు
నశించె"

జాషువా వ్రాసినవి లఘుకావ్యాలు ఖండకావ్యాలు ఫిరదౌసి గబ్బిలము ముంతాజ్ మహలు కాందిశీకుడు స్వప్న కథ బాపూజీ నేతాజీ స్వయంవరం ముసాఫర్లు క్రీస్తు చరిత్రము కొత్తలోకము వంటి లఘుకావ్యాలూ ఏడు ఖండకావ్య సంపుటాలు మూడు నా కథలు వెలువడ్డాయి

ఆధునికాంధ్ర కవిత్వంలో ఖండకావ్య ప్రక్రియ రాయప్రోలుతో పొటమరించి, జాషువా కవితలో పుష్పించింది

తెలివికి కలిమిలేములతో నిమిత్తము లేదని ప్రతిభను కులమతాల తక్కెడలో తూచరాదని విశ్వసించాడు

జాషువా వ్రాసిన "గబ్బిలము" "ఫిరదౌసి" - ఆంగ్లములోని - కనువదింపబడి ప్రచురించబడ్డాయి

"క్రీస్తు" అనే ఖండకావ్యంలో "నీవు నిలిచిన పున్నెంపు నేలమీద నిగ్గవు మీద మొలచిన గరికపోచ ఎండిపోలేదు నేడు శ్రీ యేసుదేవ వ్చిపోవయ్య మా యింటివరకు నీవు" అని సాదరంగా తన యింటికి ఆహ్వానిస్తాడు "ప్రేమ తత్వంబు రూపించి విశ్వమునను కౌగలించిన నిన్ను నే కౌగలింతు" అని భక్తి పారవశ్యంతో ఆయన్ని హత్తుకొంటాడు

"క్రీస్తు చరిత్ర"ను సర్వలక్షణ శోభితమైన గ్రంథంగా తీర్చినాడు దానికి అప్పటి భారత దేశాధ్యక్షులు డా రాధాకృష్ణ పండితులు కేంద్ర సాహిత అకాడమీ బహుమతి నిచ్చి సత్కరించారు

కవికోకిల గా నవయుగ కవి చక్రవర్తి గా ఆయన బిరుదులు సంపాదించారు ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ నిగాను భారత ప్రభుత్వం పద్మభూషణు ని గాను ఆయనను గౌరవించి సన్మానించాయి. తెలుగు ప్రజలు ఆయనకు గండపెండెరం తొడిగించారు గజారోహణం చేయించారు కనకాభిషేకం కన్నుల పండుగగా చేసి ఆయన పట్ల తమకు గల ఆదరాభిమానాల్ని బహువిధాలుగా ప్రదర్శించుకొన్నారు

54 దాశరథి

దాశరథి 927 సెప్టెంబరులో తెలంగాణాలోని ఖమ్మం జిల్లా గూడూరు గ్రామంలో జన్మించారు పుట్టింది పండితవంశం కావడంచేత చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడే కవితల్లిదం మొదలెట్టాడు ఇతడు రచించిన గ్రంథములలో ముఖ్యమైనవి అగ్నిధార రుద్రవీణ కావ్యం మహాంధ్రోదయం

కోటి తమ్ముల కడ రెండుకోట్ల తెల్గు
టన్నలను గూర్చి వృత్తాంతమందజేసి
మూడుకోటుల నొకటే ముడిబిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్యగీతి

పద్యరచనలో మహాకవిగా సాక్షాత్కరిస్తాడు దాశరథి తెలుగుదేశ చరిత్రలో ముడిపడి ఉంది దాశరథి కవిత్వం తెలంగాణా బంధాలు తెంచటం రాక్షసపాలన నీరయ్యేటట్లు చేయడం తెలంగాణాలో సాహిత్య చైతన్యాన్ని కల్పించటం తెలుగు పద్యరచనకు క్రొత్త ఒరవళ్ళుపెట్టి మహాంధ్రోదయావిష్కృతికై కృషి సాగించడం దాశరథి జీవితములోనూ సాహిత్య జీవితములోనూ ఉజ్వలంగా ప్రకాశించే ప్రధమాధ్యాయంగా భావించవచ్చు

దాశరథి నిజమైన ప్రజాకవి ప్రేక్షకునివలె గాక ప్రజల కష్ట నిష్ఠురాలలో తానొకడుగా కలసిపోయినాడు అందుచేతనే దాశరథి అగ్నిధార లో అణుమాత్రమైనా కాల్పనికతగాని అవాస్తవికతగానీ కనిపించదు తెలంగాణా ప్రజల స్వాతంత్ర్య ఉద్యమానికి ప్రతిబింబం దాశరథి కవిత్వము అన్నారు దేవులపల్లి రామానుజరావుగారు

తెలంగాణా రచయితల సంఘానికి రూపకల్పన చేసిన ప్రధానశిల్పి శ్రీ దాశరథి తెలంగాణానికి ప్రతినిధి దాశరథి ఆయన కవిత అంతా ఆత్మాశయమే ఆయన పలికిన పలుకులన్నీ ప్రజాకోటి ముక్తగీతలే అంగారం, శృంగారం దాశరథి రచనలో కలసి ఉంటాయని శ్రీ దివాకర్ల రామలింగం గారన్నారు

అధునికాంధ్ర సాహిత్యోద్యానవనంలో ఉర్దూ పారశీక కవితా సౌరభాలను వెదజల్లే వింత కావ్యలతలను పుష్పింపజేసిన నవ వసంతుడు దాశరథి ఆయన కవితా పుష్పకం గాలిబ్ గీతాలు తెలుగులో ఆయన పెంచిన పూలతోట అందులో అందమైన గులాబీలు ఉన్నవి వాటి క్రింద వాడియైన ముళ్ళూ ఉన్నవి దాశరథి గాలిబ్ గజళ్ళను తెలుగుకు పరిచయం చేశారు మంచి కవిత్వం ఏ భాషలో ఉంటే అది నా భాష అంటారు.

"మంచి కవిత్వం ఏ భాషలో ఉంటే అదే నా భాష
మంచి కవి ఎవరైతే అతడు నా మిత్రుడు
నాకు ఉరుదూ తెలుగూ రెండుకళ్లు
ఈ రెండు కళ్ళతో అన్ని భాషల్ని చదువగలను
హృదయం ఒకటైతే లోకమంతా ఒకటి"

నిజాం పాలనకు వ్యతిరేకంగా ప్రజావిప్లవములో పాల్గొన్న దాశరథికి సామ్యవాద సిద్ధాంతము మీద సానుభూతి కలిగింది ఈ మార్గానికి ప్రయోక్తగా నిలిచిన యుగకర్త శ్రీశ్రీ ప్రభావం దాశరథి మీద బలంగా కనబడుతుంది శ్రీశ్రీ తిరుగుబాటు సంప్రదాయం మీద ఛందస్సుల మీద ఒక్కసారిగా విజృంభించింది దాశరథి తిరుగుబాటు సామ్రాజ్య వ్యవస్థకే పరిమితమైనట్లు కనబడుతుంది "విప్లవం హృదయ చైతన్య రూపంగా రావాలికాని రక్తపాతంతో కాదని" దాశరథి ప్రబోధించారు ఒక్క మాటలో చెప్పాలంటే దాశరథి శాంతి విప్లవవాది

ఆధునికాంధ్ర సాహిత్య క్షేత్రంలో భావ చైతన్య స్రవంతి మూడు పాయలుగా చీలి ప్రవహిస్తున్నది

ఒకటి-సంప్రదాయ చైతన్యధార దీనికి నాయకుడు కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ

రెండు-సాయుధ విప్లవ చైతన్యధార - దీనికి నాయకుడు మహాకవి శ్రీశ్రీ

మూడు-శాంతి విప్లవ చైతన్యధార - దీనికి నాయకుడు మహాకవి దాశరథి

మొదటి రెండూ తీవ్రవాదాలు వాటిని సమన్వయిస్తూ అభ్యుదయాన్ని వరించే మధ్యేమార్గం దాశరథిది మార్గకవుల్లో దేశికవిలాగా విప్లవవాదుల్లో దాశరథి జాతీయవాది ఈయన గాంధేయ విప్లవవాది

విప్లవమంటే అర్థం తెలియనివారికి
పిస్తోలు పట్టినవాడే విప్లవవాది
విప్లవం అంటే అర్థం తెలిసినవారికి
పిస్తోలుకు గురియైనవాడే విప్లవవాది

ఒక్క తెలుగు ఒక్క వెలుగు అను నినాదమిచ్చి విశాలాంధ్ర భావానికి కవితా కల్పకాన్ని సృష్టించిన మనీషి దాశరథి ఇతని విశాలాంధ్ర భావనం అఖండ భారత భావన కనుబంధం తిక్కన శ్రీనాథుల తరువాత తెలుగు దేశాన్ని ఇంతగా ప్రేమించిన కవి లేదని చెప్పవచ్చును తెలంగాణాకు కొత్త నిర్వచనం ఇచ్చారు

"కమ్మని నా తెలంగాణ తొమ్మిది జిల్లాలేనా
బహుళాంధ్రకు తెలంగాణ పర్యాయపదం కాదా

తెలుగు నేల రెండు మూడు ముక్కలయ్యే విపత్తు సంభవించినప్పుడు బాధపడ్డాడు

"తల్లి నిను ముక్కలొనరింపదలచు వారి
అశలడియాసలై యున్న అవసరాన
నీ పాదమ్ములపై తలమోపి నేడు
చిందుచుంటి ఆనందాశ్రుబిందువులను "

పోతన భక్తికి శృంగారం ఎలా శక్తి నిచ్చిందో దాశరథి వీరానికి అలా శక్తి నిచ్చారు ఆధునికుల్లో దాశరథి ఉభయకవి మిత్రుడు పద్యం పాతబడ్డ ప్రక్రియగా భావించి ఛందస్సును వదలి గేయంలో వచన గీతంలో ప్రజాశక్తిని సమర సన్నాహం చేసే విప్లవ సందేశాన్ని అందస్తున్న దాశరథి అభ్యుదయ కవుల్లో అతిరథు డనిపించుకున్నాడు

కుల వర్గాలు లేని సమాజం మత వైషమ్యాల్లేని మానవత ఆయన సమాజానికిచ్చే సందేశం

"నా కులమెద్దియో యెరుగ నా మత మెయ్యదియో యెఱుంగగా
లేక దశాబ్దముల్ గడచె వేశ్నది, యేశ్నది రాళ్నదే కులం
నాకులమే మదీయము" అన్నాడు

దాశరథి జాతీయకవి అనీ ప్రజాకవి అనీ ఉద్యమ జీవి అనీ అభ్యుదయ కవి చైతన్య సారథి అనీ సమవాద దీపస్తంభమనీ సమకాలీన విమర్శకులు ప్రశంసించారు ఆధునిక రచనా ప్రక్రియల్లో రెండంచుల కత్తిగా కవితను వాడుకొన్న దాశరథి గేయంలో వైతాళిక గీతాన్ని ఆలాపించి వచనంలో విప్లవ సందేశం అందిస్తూ అభ్యుదయ కవుల్లో అతిరథుడనిపించుకొన్నారు

కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీలు ఆయన కవితలకు బహుమానాలు అందజేస్తే ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు కళాప్రపూర్ణ బిరుదము నిచ్చి గౌరవించారు కొంత కాలము ఆంధ్ర ప్రదేశ్ ఆస్థానకవిగా నియమితులై తన కవితా లహరిని కొనసాగిస్తున్నారు

## 55 దిగంబర కవులు

దిగంబర కవులు అరిషడ్వర్గంలాగ ఆరుమంది ఉన్నారు వీరిలో ముఖ్యులు-జ్వాలాముఖి నిఖిలేశ్వర్ చెరబండరాజు వీరి మొదటి సంపుటి 965 మే లోనూ రెండవ సంపుటి 966 డిసెంబరులోనూ ప్రకటింపబడినవి 968 సెప్టెంబరులో మూడవ సంపుటి వెలువడింది

సమాజ చైతన్యాన్ని మేల్కొలిపి దానిలోని వేడి రక్తాన్ని ఉడికించి కవితను ప్రజావాణిగా పలికించాలని వీరి తపన ప్రతి పదంలో ప్రగతి పథంలో ప్రగతి శీలం ప్రతిధ్వనించాలనేది వీరి ఆశయం సంఘములోని సాంఘిక దురాచారములు కుల మత భేదములు మూఢ విశ్వాసములను తమ కవితలో ఘాటుగా బాహాటముగా విమర్శిస్తూ యుండుటచేత వీరికి దిగంబర కవులని పేరు వచ్చినది సమాజములో జరుగుచున్న అన్యాయాలపై తాము తీవ్రమైన ఆవేశం చెందినామంటూ అందుకు బాధ్యులైన ప్రభుత్వముపైన రాజకీయ నాయకులపైన సంఘ పెద్దలనిపించుకుంటున్న వారిపై విసుర్లు విసురుతూ ఘాటైన పదజాలముతో నిండిన

తమ కవితలద్వారా వారిని విమర్శిస్తూ యుండడం వీరి పని  ఈ కవులు తమ అనుభూతిని మాటల ద్వారా వ్యక్తం చేస్తారు  వీళ్ళ మొదటి సంచికను ఒక రిక్షావాలా ఆవిష్కరించడం విశేషం  సమాజ ద్రోహులను తిట్టడానికి వీరు అప్పుడప్పుడు బూతు పదముల నుపయోగిస్తారు  కుళ్ళోయిన ఈ సమాజం మీద ఈ కుళ్ళుకు కారణమైన రాజకీయ నాయకుల మీద స్వాములవార్లమీద సినిమాలమీద పెట్టుబడిదార్లమీద వీరి కోపం కనబడుతూవుంటుంది  విప్లవాగ్ని జ్వాలలతో సమాజమును సంస్కరించవలెనని వీరి యుద్యమం యొక్క ముఖ్య ఉద్దేశం

## 58 నన్నయ కవితా రీతులు

నన్నయకు ఆదికవి శబ్దశాసనుడు అను బిరుదులు కలవు ఇతడు వ శతాబ్దములో రాజమహేంద్రవరమును రాజధానిగా జేసికొని వేంగి దేశమును పాలించిన రాజరాజనరేంద్రుని ఆస్థానకవి  అతడు ఆది సభా పర్వములను అరణ్య పర్వము సగభాగమును రచించి స్వర్గస్థుడయె ను నన్నయే చాముండికా విలాసము వ్రాసెనందురు అది అలభ్యము

అతని కవిత్వము ప్రసన్నమగు కథలతోడను అక్షర రమ్యతతోను గూడియుండును అక్షర రమ్యత రెండవ గుణము అక్షరమనగా ఇక్కడ వర్ణనములని అర్థము మూడవ కవితా గుణము నానా రుచిరార్థసూక్తి విధిత్వము

నన్నయ వర్ణనలు మితముగను ఇంపుగా నుండును గరుత్మంతుడు నిషాదుడు కర్ణుడు మొదలగు పాత్రల రూపురేఖలను బాగుగా చిత్రించెను స్త్రీ వర్ణనలందు అసభ్య వర్ణనలకు తావీయక కేశ ముఖ నయనాదులను మాత్రమే వర్ణించెను  నన్నయ ప్రకృతి వర్ణనలు తక్కువ  సహజముగ వర్ణించెను

మహాభారతము అనేక విచిత్రపాత్రలుకల నాటక రంగము. ఆయా పాత్రల శీలస్వభావములు సమగ్రముగ చిత్రించెను. నన్నయ రచనయందు ఉపమాలంకారములు ఎక్కువ. ఇతని కవిత యందు తీవి ఉదాత్తత కలదు. ఈతడు కథను నడపుటలో అద్వితీయుడు. అక్కడక్కడ నాటకీయ శైలి కలదు. ఉత్తమ జాతి కథకుడు నన్నయ.

57 నన్నెచోడుని కవిత్వ లక్షణములు

నన్నెచోడుడు శివకవులలో గొప్పవాడు. ఆయన కవిత్వాశయములు 1) భావములను జాను తెలుగులో సరళముగా వ్యక్తపరచుట 2 కథావస్తువు ఉదాత్తమైనదానిని ఎన్నుకొనుట 3 శైలి కర్ణరసాయనముగా నుండుట.

ఇతని కవిత్వము దే మార్గమున సాగెను. ఇతని కుమారసంభవమునకు మూలము స్కాందపురాణము. ఈ గ్రంథము నాధారము జేసికొని తా దాను కుమారసంభవము వ్రాసెను. ము లగ్రంథములనుండి కథను నిమిత్తమాత్రముగా గైకొని తానిచ్చవచ్చినట్లు సింగారించి వ్రాసెను. పండిత పామరులకు సొంపునొసగు జానుతెలుగులో రచించెను. నన్నెచోడుడు కుమార సంభవము గూర్చ వస్తుకావ్యమని ప్రశంసించెను. తన కవిత్వము వస్తుకవిత్వమని చెప్పెను. వస్తుకవిత్వమనగా మృదుల సూక్తులు మేలిభావములు వర్ణనలెక్కు వర్ణనము, దేశీయుల నలంకరణ నలంకారము కలది బుధులు మెచ్చునది యను ఉద్దేశమును చెప్పెను. తన గ్రంథములు ప్రబంధములనియు చెప్పెను.

ఈ కవి కుకవిని కుక్కతో పోల్చెను. కుకవి నిందను ప్రథమముగా చేసిన కవి నన్నెచోడుడు. మొదటగా షష్ఠ్యంతమును వాడినవాడితడే. ప్రబంధమునకు అవసరమయిన పదునెనిమిది వర్ణనలు చేసెను.

ముప్పదియా రలంకారములు వాడెను తన కృతి నవరసభరితమని నన్నె చోడుడు పలికెను ఇది వీరరస కావ్యము అయినను మిగత రసములు కూడ పోషింపబడినవి ఇతడు పాత్రములను నాటకమున నడిపించు నట్లు నడిపించెను ఇందుకు శివపార్వతుల (మాయ సన్యాసి పార్వతి సంభాషణ ఉదాహరణమగును

నుడికారములు జాతీయములు సూక్తులు ప్రయోగించెను ప్రతి సూక్తియు కథయందతికియే యుండును ఎలుకమీదకోపమున ఎల్లేర్చి నట్లు పేద నిధానము గన్నట్లు ఎట్ట కలిగి పాశుపతము దొడుగనేటికి మొదలగున వనేకములు

నన్నెచోడుని కవిరాజ శిఖామణిగా గుర్తింపవచ్చును

58 పండితారాధ్యుడు

శివకవులలో రెండవవాడు శైవమతవ్యాప్తికి జీవితముల నంకితము చేసినవారిలో మల్లికార్జున పండితారాధ్యుడు అగ్రగణ్యుడు ఇతడు శివభక్త దీపిక అను తెలుగు కృతిని రచించెనందురు ఇది లభ్యము కాలేదు పండితా రాధ్యుడు శివతత్వసారము లింగోద్భవ గద ము రు దమహిమ గణ సహస్రమాల అమరేశ్వరాష్టకము పర్వత వర్ణనము రచించెను

శివతత్వసారము - ఇది అనేక వందల కంద పద్యములున్న గ్రంథము ఇందు శివ దీక్షను గూర్చియు విపులముగా వర్ణింపబడినది వేదములనుండి ప్రమాణములు చూపుచు అద్వైతపరములయిన వాక్యము లకు ద్వైతపరముగ అర్థము చెప్పబడినది పద్యసంఖ్య హెచ్చుగానున్నను దీనిని శతకమనవచ్చును కాని శతక లక్షణములు చాల వరకు ఈ కావ మున కనుపింపవు పాల్కురికి సోమన దీనిని శతకమనియే చెప్పెను దీనిని మనము తొలిశతక మనవచ్చును

శివతత్వ సారమందలి శైలి నన్నయ శైలిని పోలును ఈ కవి సాంప్రదాయానురక్తి కలవాడు

## 59 పాల్కురికి సోమనాథుడు

సోమన ఆంధ్ర సంస్కృత కర్ణాటక భాషలందు పండితుడు బసవ పురాణము పండితారాధ్య చరిత్రము సోమనాథ స్తవము అనుభవసారము చెన్నమల్లు సీసములు బసవోదాహరణము వృషాధిప శతకము అను నవి తెలుగునందు రచించెను ఇతడు శివభక్తుల మార్గమునకు చెందినవాడు బసవ పురాణము వీరశైవ మతస్థాపకుడగు బసవేశ్వరుని జీవితచరిత్ర వీరశైవులకు ఈ ద్విపదగ్రంథము వేదమువంటిది ఇందు బసవేశ్వరుని జన్మవృత్తాంతము నూతన మతస్థాపన మంత్రిపదవి అతని కార్యములు గలవు దీనిలో బెజ్జమహాదేవి కథ కన్నప్ప కథ చిరుతొండనంబి కథ మొదలగునవి ముఖ్యమైన కథలు

పండితారాధ్య చరిత్ర

ఇది మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్ర పండితులు జైన బౌద్ధ చార్వాకముల ఖండించి వీర శైవమును ప్రతిష్ఠించిన వృత్తాంత మిందు ప్రధాన విషయము ఇందు దీక్షా పురాతనవాద మహిమ పర్వత ప్రకరణములు కలవు ఇది ద్విపద కావ్యము ఇందలి ద్విపద ఛందోబద్ధము నవరసపోషణ కలిగి మహాకావ్య లక్షణము లన్నియు కలిగియున్నది

వృషాధిప శతకము - అన్ని లక్షణములు గల మొదటి శతకము ఇది ఆంధ్ర వాఙ్మయమున ప్రసిద్ధికెక్కినది బసవా బసవా బసవా వృషాధిపా అను మకుటముతో కూడిన పద్యములు కలవు ఇది బసవేశ్వరుడు మున్నగు శివభక్తుల చరిత్రను వర్ణించును ఇందు తెలుగు పద్యములేగాక తమిళ కన్నడ మహారాష్ట్రి భాషా పద్యములు కలవు దీనినిబట్టి సోమన బహుభాషా పండితుడని చెప్పవచ్చును భక్తిపూరిత మైన వాఙ్మయమునకు ఇది పట్టుగొమ్మ

ద్విపద కార కర్తలలో నీతనిది అగ్రస్థానము
సోమన మొదటి శతకర్త

సోమనాథుని బసవ పురాణము పండితారాధ్య చరిత్ర రెండును చారిత్రక గ్రంథములనవచ్చును

**60 ఎఱ్ఱన కవితా పద్ధతి (ఎఱ్ఱాప్రగడ)**

ఈయన కవిత్రయమందలి మూడవవాడు ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి ఈతనికి శంభుదాసుడు ప్రబంధ పరమేశ్వరుడను బిరుదులు కలవు ఎఱ్ఱన మహాభారత అరణ్యపర్వ శేషము హరివంశము నృసింహ పురాణము రామాయణములను వ్రాసెను ఇందు రామాయణము లభ్యము కాదు ఎఱ్ఱన తాను రచించిన హరివంశమును నృసింహ పురాణమును ప్రబంధములనియే పేర్కొనెను నృసింహపురాణములో ప్రబంధ పరమేశుడనంగ అరణ పర్వ శేషోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి యని చెప్పుటచే నితడు ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితుడని గ్రహించవగును

ృసింహ పురాణమున కథా విధానమునందు వ స్త్వైక ము కలదు ఇతని వర్ణనలు అలంకార శోభితములు వాడి చూడ్కు తియని పలుకులు వింత చెయ్యలు ముద్దునవ్వులు మొదలగు తేనెవంటి తీయని మాటలతో వర్ణించెను వసంత వర్ణన, సాయంకాల వర్ణన యుద్ధ వర్ణనలు ప్రబంధ లక్షణములకు ముఖ్యములైన అష్టాదశ వర్ణనలలోనివి

ఇతని పాత్ర పోషణ బహు నేర్పు గలది నృసింహపురాణమున ప్రహ్లాదుని హిరణ్యకశిపుని నరసింహ పాత్రలను చక్కగా చిత్రించెను

ఇతడు వచనమున శబ్దాలంకారములు, పద్యమున అర్థాలంకారములు వాడును శ్రీహరి రూపమున వర్ణించునపుడు సుదీర్ఘ వచనముస్య

వ్రాసెను అందు శబ్దాలంకారములు కలవు ఈతని అర్థాలంకారము లందు యెక్కువగా ఉపమ రూపక ఉత్ప్రేక్షలుండును

ఎఱ్ఱన తన గ్రంథమునందు నన్నయవలె నానారుచిరార్థ సూక్తులు అనేకము లుపయోగించెను కుంపటిలో దామర మొలచిన క్రియ నిప్పుని చెదలంటునే ఏనుగుతిన్న వెలగపండు అడవిపులి మానసుల నేం యాదరించు ఇతని కవిత్వములో నాటకీయత కూడ కనిపించును

ఎఱ్ఱన కవితాశైలి ఒకవైపు నన్నయ కథా కథన చాతురిని, కవితా శైలిని తలపించును మరొకవైపు తిక్కన ప్రౌఢ కవితాశిల్పము సరళ శబ్ద సమాస రచన నాటకీయత వర్ణనాచాతుర్యము కలిగి పెనవేసు కొని యున్నది ఈతని గ్రంథములన్నియు అనువాదములే అయినను స్వతంత్రములుగనే ఉన్నవి ఇతని పతి అనువాదమును అవసరమగు చోటులందు మూలమునకు మించి పెంచిన ఘట్టములును తగ్గించిన ఘట్టములును తీసివేసిన ఘట్టములును కలవు

ఈ పైన వివరింపబడిన కవితారీతులను బట్టి ఎఱ్ఱాప్రగడ (ఎఱ్ఱన)కు ప్రబంధ పరమేశ్వర బిరుదు సార్థకమగును

6 ఆముక్త మాల్యద

సాహితీ సమరాంగణ సార్వభౌముడగు శ్రీకృష్ణదేవరాయల యుగ మునకు ప్రబంధయుగమను పేరు కలదు ఈ సార్వభౌముని ఆస్థానమున అష్టదిగ్గజములు కలరు రాయలు ఆముక్తమాల్యద మదాలస చరిత్ర సంస్కృతమున) వ్రాసెనందురు ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయ మను పేరు కలదు కళింగదేశ దండయాత్రకు పోవుచు శ్రీకాకుళాంధ్ర దేవుని దర్శనము చేయగా ఆ దేవుడు నాటి రాత్రి కలలో కనబడి ద్రావిడ ప్రబంధము లందు ప్రఖ్యాతి గాంచిన గోదాదేవి శ్రీరంగనాథుల

వివాహోదంతమును ప్రబంధముగా వ్రాసి తన కంకిత మివ్వమనెను ఆ యాజ్ఞచేతనే తానీకృతిని నిర్మించి శ్రీకాకుళాంధ్ర దేవుని కంకిత మిచ్చినట్లు గ్రంథావతారికలో రాయలు చెప్పెను

ఆంధ్ర సాహిత్యమున ముఖ్యముగా రంగనాథ రామాయణము అముక్తమాల ద కర్తృత్వములపై వాదోపవాదములు కలవు

అముక్తమాల్యదను పెద్దన రచించిన రాయల పేరు పెట్టెనను వారు కొందఱు కాదు శ్రీకృష్ణదేవరాయలే దీనిని వ్రాసెనను వారు మరి కొందఱు గలరు ఈ విషయముపై వాదోపవాదములు చేసినవారు చిలుకూరి నారాయణరావు, జయంతి రామయ్య పంతులుగారలు

అల్లసాని పెద్దన రచించి రాయలపేరు పెట్టెనను వారి వాదము లివి

పెద్దన మనుచరిత్ర యందలి పద ములే యాముక్తమాల్యదా వతారిక యందుండుట

2 పెద్దన, తిమ్మనాదులు రచించిన మనుచరిత్ర పారిజాతపహ రణములయందు కృష్ణదేవరాయల అముక్తమాల ద ప్రశంసలేదు

3 ఒక కవి చెప్పిన చాటు పద్యమున కృష్ణదేవరాయల పేరు నిడితివి నీవు రచించితివి తొల్లి విష్ణు చిత్తీయమనగ అని అముక్త మాల్యదను పెద్దన రచించినటు కలదు ఇది ఒక ఆధారము

4 నిరంతరము రాజకార్యములందు యుద్ధములందు నిమగ్ను లగు రాజులు ఎరుగజాలని వర్ణన లెన్నో యిందున్నవి పండితవర్యులు మాత్రమే ప్రయోగింప దగిన గూఢార్థము లిందున్నవి కావున రాయలు ఈ గ్రంథమును రచించి యుండజాలడు

5 అహోబలపండితుడు యథా అల్లసాని పెద్ద నార్యేణ అముక్తమాల్యదాయా అని చెప్పెను. అనగా అల్లసాని పెద్దన అముక్త మాల దను వ్రాసెనని అర్థము

6 అష్ట దిగ్గజములందు ప్రఖ్యాతి గాంచిన పెద్దన్న తిమ్మనలు తాము రాయలకు అంకితమిచ్చిన కావ్యములందెచ్చటనూ కృష్ణదేవరాయలను కవిగా పేర్కొనలేదు

పై వాదములను ఖండించుటకు క్రింది వాదములు కలవు

లాక్షణికుల తీర్పు ప్రమాణము కాదు ఏలయన ఎంగళి సూరన నాచన సోమనవంటి వారి విషయమునకే అప్పకవి తప్పులు చెప్పెను

2 పెద్దన తిమ్మనాదులు తమ ప్రబంధములను రాయలు ఆముక్త మాల్యదను వ్రాయుటకు పూర్వమే వ్రాసియుండవచ్చును

3 కృతికర్తలు కృతిపతులపై ఎంతటి గౌరవాదరములున్ననూ కృతిపతుల గ్రంథ రచనమును ముచ్చటింపకుండుట కొందరు పూర్వకవులందు కలదు తిక్కనయే తన పూర్వకృతియగు నిర్వచనోత్తర రామాయణమును గూర్చి చెప్పలేదు పెద్దన తన గ్రంథమున రాయలు కవి యని పేర్కొనలేదు గాని తిమ్మన తన పారిజాతాపహరణమున రాయలను కవితా ప్రావీణ్య ఫణీశ యని స్తుతించెను

4 రాయలు ఎంతటి రాజకీయ దురంధరుడో అంతటి సాహిత్య రసికుడు తిమ్మరుసుతో అర్ధరాత్రివేళయందు మారువేషముతో నగరమందు సంచరించి ప్రజావిషయములను తెలిసికొనువాడు అందుచేతనే సామాన్య ప్రజాజీవన విషయములను తన గ్రంథమందు చొప్పించగలిగెను

5 ఆముక్తమాల్యదలో రాయలు తన వంశవర్ణనకు మాత్రమే మనుచరిత్ర యందలి వానిని గ్రహించెను అట్లు చేయుటలో పెద్దనయందలి గౌరవమే కావచ్చును

6 "కృష్ణరాయల పేర నిడి నీవు రచించితివి అను చాటు పద్యపు కర్త యెవరో తెలియదు ఎప్పటివారో తెలియదు. ఆ పద్యమందనేక వ్యాకరణ దోషములు గలవు అది పాటింపదగినది కాదు

పై విషయములను బట్టియేగాక మనుచరిత్రయందలి రచనారీతి పదప్రయోగము వర్ణనలు మున్నగువానికి ఆముక్తమాల్యద యందలి రచనా విధానము శైలి మున్నగువానికి సామ్యమెందును కానరాదు అందుచే రాయలే ఆముక్తమాల్యద ను రచించెనని చెప్పవచ్చును

ఇది మిక్కిలి ప్రౌఢ కావ్యము కవిత్వము నారికేళపాకము అసామాన్య వర్ణనలు గలవు ఈ కావ్యమున ఉపమ రూపకము ఉత్ప్రేక్ష అర్థాంతరన్యాసము,స్వభావోక్తి భ్రాంతిమదము మొదలగు అలంకారములతో గూడిన పద్యములు గలవు భక్తియుత శృంగార రసములు బాగుగా పోషింపబడినవి రాజనీతి చతురత్వమునుగూడ ప్రయోగించెను వైష్ణవభ_ ప్రధానముగా గల గ్రంథము

ఋతువులను వర్ణించుటయందు రాయలు బహు నిశిత దృష్టిని ప్రదర్శించెను ఈతని ప్రకృతి పరిశీలనాపాటవము అనన్య సామాన ము ఋతువుల నింత విస్తృతముగ సహజమనోహరముగ వర్ణించిన కవులాంధ్ర వాఙ్మయమునవేగాక సంస్కృతమున గూడ లేరనుట అతిశయోక్తిగాద ని డా॥ దివాకర్ల వేంకటావధానిగారు చెప్పుచున్నారు ఉపాఖ్యానములను రచించుటలో గూడ గొప్ప నేర్పు ప్రదర్శించెను మాల దాసరి కథ ఖాండిక్య కే ధ్వజోపాఖ్యానము కథానిర్మాణ శిల్పమునకు పాత్ర చిత్రణము నకు, సంభాషణ నైపుణ్యమునకు ప్రసిద్ధి గాంచినవి రాయలు తన కాలపు సంఘజీవితము చక్కగా వర్ణించెను

బ్రహ్మ సూత్రము ఉపనిషత్తులు వేదవాఙ్మయము జో తిష పురాణములతో రాయలకుగల పరిచయము ఆముక్తమాల్యద యందు పలుచోట్ల వ్యక్తము చేయుచున్నది

గుమ్మడికాయంత ముత్తెము ఇంటిలో నేదుమల్లి అను జాతీయములు వాడినను, సులభ జాతీయ పదముల వాడుక తక్కువ రాయల కల్పనా సామర్థ్యము గొప్పది ఆముక్త మాల్యద ప్రబంధములలో కెల్ల మకుటము వంటిది

## 62 క్రీడాభిరామము

ఇది తెలుగు భాషలోని తొలి నాటకము కీడాభిరామ గ్రంథ కర్తృత్వముపై గూడ విమర్శ కలదు గ్రంథావతారికయందు దీని కర్త వినకొండ వల్లభామాత్యు డని కలదు పద సంవిధానము శైలినిబట్టి శ్రీనాథుడే దీనిని వ్రాసెనని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు విపులీకరించిరి బంగళి లక్ష్మీకాంతముగారును శ్రీనాథుడే రచించెననిరి

కథ — ఈ కథకు నాయకుడు గోవింద మంచన శర్మ నాయిక కామమంజరి యనెడి వితంతువు శర్మ తన స్నేహితుడగు టిట్టిభసెట్టితో గూడి ఏకశిలానగరమునకు వచ్చి ఆ పుర విశేషములు చూచుచు కాలము గడిపెను మధ్యాహ్న వేళ పూటకూటింట భుజించి మరల పురదర్శనమునకు బయల్దేరి ఒక సంకేత స్థలమున శర్మ కామమంజరిని కలిసికొనును టిట్టిభ సెట్టికి నింకొక యువతి పొందుకూర్చును ఏకశిలానగరమున చూచిన వింతల వినోదముల యొక్క వర్ణనయే క్రీడాభిరామము.

ఈ గ్రంథము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు ఆంధ్రీకరణము రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటి ఓరుగల్లు వైభవము వీధులు విపణులు జాతులు నాతులు దేవరలు దేవుళ్ళు వంటపూటింండ్లు వేశ్యావాటికములు ఇందు సాక్షాత్కరింపజేయబడినవి ఇది యక్షగానమువలెగాక శ్రీనాథుని కావ్యమగుటచే మంచిశైలి సంపన్నతతో చిరస్థాయిత్వమును పొందినది

## 63 శృంగార శకుంతలము

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని రచన ఇతడు జైమిని భారతమును కూడ వ్రాసెను ఈతనికి శ్రీనాథునిపై గురుత్వమున్నందువనే తను వ్రాసిన శాకుంతలమునకు శ్రీనాథుని శృంగారనైషధమువలె శృంగార శాకుంతలము అని నామకరణము చేసెను

భారత మందలి శకుంతలము నుండి కాళిదాసు నాటకము నుండి కొంత విషయము తీసకొని తాను వ్రాసనట్లు గ్రంథావతారికలో తానే స్వయముగా చెప్పుకొనెను ఈయనకు నన్నయపై గౌరవము ఎక్కువ తన కాలములోని ఆచార వ్యవహారములను ఎనవీరన కథలో జొప్పించెను ఎనవీరన అనేక ప్రబంధములకు మూలములను తనకు పూర్వులైన నన్నయ తిక్కన పాల్కురికి సోమన శ్రీనాథుల నుండి స్వీకరించెను

అత్తగారింటికి పంపునపుడు శకుంతలకు కణ్వుడు అనేక మంచి బెద్దలను చెప్పును అక్కడ ఆమె నడచుకొనవలసిన తీరును కులకన ధర్మాలు అంపకాలు తీరును ఎనవీరన అద్భుతముగా వర్ణించెను కణ్వుని తెలుగువానిగా చేసెను

పినవీరన కవిత్వములో నన్నయగారి ప్రౌఢసంపత్తి సొంపు తిక్కనగారి వాక్కులు నాచనసోముని వాదామహత్త్వము శ్రీనాథుని నిగుంభాల పరిమళాలు ఉన్నవని విజ్ఞులు చెప్పుదురు

64 నంది మల్లయ్య ఘంట సింగన

వీరిద్దరు తెలుగు సాహిత్యములోని తొలి జంటకవులు గుంటూరు వెల్లూరు పాంతపువారు పదిహేనవ శతాబ్దము ఉత్తరార్ధము వీరి కాలము వీరు ప్రబోధ చంద్రోదయము వరాహపురాణము అను వానిని వ్రాసిరి

ప్రబోధ చంద్రోదయము సంస్కృతములో ఒక సుప్రసిద్ధమైన నాటకము ఈ జంటకవులు ఈ నాటకము ననువదించి ప్రబంధముగా తీర్చిదిద్దినారు ఇది వేదాంత బోధకమైన నాటకము శాంతము- దీనిలోని ప్రధాన రసము అంతరంగమందు నున్న ఉత్తమ ప్రవృత్తులకును దుష్ట ప్రవృత్తులకును జరుగు నైతిక సంగ్రామమిందు వర్ణింపబడినది దుష్ట ప్రవృత్తుల ఓటమియు, వివేకుని గెలుపును ప్రబోధ చంద్రుని ఉదయము ఇందు నిరూపించబడినది క్లిష్టమైన వేదాంత విషయము సర్వజన సుబోధ

ముగా వర్ణింపబడినది బౌద్ధుడు జైనుడు సద్దుడు మొదలగువారు కాపాలినితో కలసి త్రాగుట మొదలగు రోత కలిగించే సన్నివేశాలలో కృష్ణమిత్రుడు జైన బౌద్ధ మతాలను ఖండించ ప్రయత్నించడం విశేషము అనువాదము నడికారపు సొంపుతో కూడియున్నది జంట కవులలో ఒకడైన ఘంట సింగనకు మలయ మారుత కవి అను బిరుదము కలదు

మూలములోని విషయాలు మనకు నచ్చినా నచ్చకపోయినా అనువాదకులు మాత్రం మూల విషయాలన్నింటిని యథాతథముగా అనువదించిరి

ప్రబోధ చంద్రోదయాన్ని జంటకవులు అనంతమాత్యుని గంగయ కు అంకితమిచ్చారు వీరిద్దరు జంట కవులే గాని తిరుపతి కవులవలె శతావధానాలు వంటివి చేసినట్లు మనకాధారములు లేవు

## 65 సుభద్రా కళ్యాణము

సుభద్రా కళ్యాణమును తాళ్ళపాక తిమ్మక్క వ్రాసెను ఈమె ప్రథమాంధ్ర భాషా కవయిత్రి కీర్తనలు వ్రాసిన తాళ్ళపాక అన్నమాచార్యుల వారి సతీమణి

నన్నయగారి మహాభారతమే సుభద్రాకళ్యాణానికి ఆధారము తాను వ్రాసినది పాట అని చెప్పుకొన్నది తిమ్మక్క తన కావ్యములో తిరుపతి వేంకటేశ్వరునకు అర్జుననిచే నమస్కరింప జేసింది సుభద్రా కళ్యాణమున సుభద్ర చేత బొమ్మల పెండ్లిండ్లు చేయించెను ఇందుగల బొమ్మల పెళ్ళి అర్జునుని ఆకతాయి మాటలు సుభద్ర కృష్ణునితో ఫిర్యాదు చేయుట అయన ఓదార్పు మొదలయినవి కల్పితములే చిలక పాత్రను ప్రవేశపెట్టి దానిచే చాకచక్యముగ పలికించింది

చేమకూరవారు తమ విజయ విలాసము నున్న సంభాషణలను వర్ణనలను యథాతథముగా వాడుకొన్నది తిమ్మక్కగారి సుభద్రా కళ్యాణము నుండియే. నన్నయ్యగారి అర్జునునికి లేని తెలివితేటలు తిమ్మక్క

గారి సుభద్రా కళ్యాణములో గలవు రుక్మిణిచేత సుభద్రకు హితోపదేశము చేయించినది

తిమ్మక్కగారి కవిత్వము మధురముగా నున్నది ఈమె సంభాషణ ను చేమకూర వెంకటకవి విజయ విలాసము లోను ముద్దుపళని రాధికా స్వాంతనము లోను వాడుకున్నారు తిమ్మక్కగారి కవిత్వంలో నెఱజాణతనము ఉన్నదని చెప్పవచ్చును

66 మొల్ల రామాయణము

తెలుగునందు చాలా రామాయణములు గలవు వీనిలో భాస్కర రామాయణము రంగనాధ రామాయణము ఎఱ్ఱాప్రగడ రామాయణము మొదలగునవి యున్నవి ప్రతి తరంలోను ఎవరో ఒకరు రామాయణం వ్రాయుచునే యుండిరి 6 వ శతాబ్దమున మొల్ల వ్రాసిన రామాయణమునకు మొల్ల రామాయణమని పేరు వచ్చినది శంతమల్లేశ్వరుని వరముచేత కవిత్వ మలవడెనని తన రామాయణములో వ్రాసుకొనెను ఈమె పూర్తి పేరు కుమ్మరి మొల్ల

ఈమె పూర్తిగా వాల్మీకి రామాయణము ననుసరించలేదు అధాత్మిక రామాయణము భాస్కర రామాయణమును అచ్చటచ్చట అనుసరించి నట్లు కనబడును

మొల్ల కవిత్వమున తెలుగు దనమున్నది వర్ణనలు సహజముగ నున్నవి. నదిని దాటించునపుడు గుహుడు శ్రీరాముని పాదములు కడుగు ఘట్టము ఏ తెలుగు రామాయణమున లేదు కాని మొల్ల తన రామాయణములో ప్రవేశపెట్టినది

రామాయణం సంగ్రహంగా వీనులకు విందైన కవిత్వంగా చెప్పిన స్త్రీలలో ఈమె ద్వితీయురాలు రామాయణ రచయితలలో ప్రథమురాలు

67 సిద్ధేశ్వర చరిత్రము

ఇది చారిత్రక కావ్యము కాసె సర్వప్ప దీనిని వ్రాసెను సర్వప్ప తన కావ్యమున ప్రతాపరుద్రుని యాస్థానమందలి కవులను కుమ్మరి మొల్ల పేరును పేర్కొనెను

దీనిలో చారిత్రక ఘట్టములు కలవు గణపతిదేవుని కాలమున తిక్కన ఓరుగల్లుకు వచ్చి రాజు సహాయముతో మనుమసిద్ధి రాజ్యము నిలిపెను ఆ కాలపు ఓరుగల్లు వైభవము రాజ ముఖ్యోద్యోగులు కవులు గుడులు గోపురములు చక్కగా వివరింపబడినవి మహమ్మదీయులు ఈ నగరముపై ఏడు సార్లు దండెత్తి పారిపోయిరట పద్మాక్షిదేవి కాకతీయుల కొసంగిన వేయి సంవత్సరముల కాలపరిమితి దాటిపోవుటచే చివరి యుద్ధమున ప్రతాపరుద్రుడు ఓడింపబడి చెరపట్టబడెనట

ఇందలి కథలో అనేక పొరపాట్లు కలవు సిద్ధేశ్వర చరిత్రము కొంత భాగము వచన రూపముగ కొంత భాగము ద్విపద రూపముగ వ్రాయబడినది ఈ కావ్యము బహుదోష భూయిష్టమై యున్నది కవిత్వ ప్రాధాన్యత లేదు

ఈ గ్రంథమునకు "ప్రతాప చరిత్రము" "కాకతీయ రాజవంశావ" యను పేర్లు గూడ కలవు

68 కృష్ణరాయ విజయము

రాయల అష్ట దిగ్గజములలో నొకడైన ధూర్జటి మునిమనుమడగు వేంకటార్యుడు రచించెను ఇది చారిత్రక కావ్యము శ్రీరామునికి అంకితము చేయబడినది

కథ - ఇది శ్రీకృష్ణదేవరాయల కథ కృష్ణదేవరాయలు తిమ్మరుసు సాయమున రాజ్యమునందలి వ్యవహారములను చక్కదిద్ది దక్షిణ దండయాత్రకు బయలుదేరి ఉమ్మత్తురు గంగరాజును ఓడించెను

అటు నుండి పడమర ఉత్తర దిశలకు దండయాత్ర చేసి కళింగరాజు కూతురును పెండ్లియాడెను మహమ్మదీయుల నోడించెను

ఇందు శ్రీకృష్ణదేవరాయల పరాక్రమము పరిపాలనా క్రమము చక్కగా వర్ణింపబడినవి ఇతని శైలి సులభమును సరసమునై ఒప్పారును వేంకటార్యునికి కుమార ధూర్జటి అను పేరు కూడ కలదు ఇతడు సావిత్రీ చరిత్రము ఇందుమతీ పరిణయము అను కావ్యములను గూడ వ్రాసెను

69 వాల్మీకి చరిత్ర

దక్షిణాంధ్ర కవులలో ముఖ్యుడైన రఘునాథనాయకుడు దీనిని వ్రాసెను వాల్మీకి చరిత్రకు మూలము సంస్కృతములోని ధర్మ ఖండము బదరీవనములో పర్వతముని శౌనకాది మునులకు వాల్మీకి చరిత్ర చెప్పుటతో కథ మొదలగును ఇది వాల్మీకి గా మారిపోయిన ఒక కిరాతకుని చరిత్ర ఇతడు తరువాత సప్తఋషులచే తారకమంత్రము పొంది రామాయణము ను వ్రాయును

రఘునాథుడు దక్షిణాత్య శైవ వాఙ్మయానికి చెందిన ఇతివృత్తము లను గూడ ఇందు వర్ణించెను అనేక నూతన సన్నివేశములను గూడ సృష్టించెను తనకు గల సంగీత నాట పరిజ్ఞానముల నీ గ్రంథమున పొందుపరచెను

వాల్మీకి చరిత్ర శ్రీరామునికి అంకితము చేయబడినది ఈతని కవిత్వము మృదుమధుర పదములతో ధారాశుద్ధి గలిగియున్నది

70 మార్గకవిత - దేశకవిత

కం మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశకవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బున జన చాళుక్య రాజు మొదలుగ పలువుర్

మార్గ-దేశి అను పదములు ఏ అలంకార గ్రంథమందును కానరావు నియమము గాని లక్షణముగాని లేక శాస్త్రములకెక్కక సామాన్య ప్రజా ళి జనార్థమై పాడెడి చిల్లర పాటలు పదముల కీర్తనలు మొదలగునవి దేశి కవిత లక్షణ బద్ధమైన శాస్త్రానుసారముగా నున్నది మార్గకవిత శాస్త్ర నిబద్ధతవలన మార్గ మను పేరు ఏర్పడెను

పూర్వకాలమున మార్గకవిత యుండగ చాళుక్యరాజులు దేశికవిత ఎందుకు పుట్టించిరని ప్రశ్న అదివరకు శాస్త్ర సమ్మతమైన ఉత్తమ కవిత్వముండగ దానిని తోసిపుచ్చి పామరకవిత్వము పుట్టించిరనియా నన్నెచోడుని యభిప్రాయము భారత సాహిత మున సంస్కృత కవిత్వము మార్గ (C as ca ) మరి ఆయా భాషంలో సాంప్రదాయానుసారముగా పవర్తిలు కవిత్వము దేశి (Vernacu a ) అందురు దేశికవిత్వము నేటికిని పల్లెలందు గలదు దేశికవితను పుట్టించిన చాళుక రాజు గుణగ విజయాదిత్యుడని మన మనుకొనవచ్చును దేశికవితను సృష్టించినవారు విద్యావంతులు గారు చాళుక్యరాజు ప్రయత్న పూర్వముగ పుట్టించిన దేశి కవిత్వము కావ్యరూపము దాల్చగల ఒక గ్రంథరచన ఆ గ్రంథమే భారతమని యూహింపవచ్చును ఆ భారతము సంస్కృతము నెదుట ఆనాటికి దేశికవిత్వ మనిపించుకొనును దేశభాషలో వ్రాయబడుటచే అది దే కవిత్వమయ్యెను ఆ తెలుగు భారతముతో నేడు మనము జానపద రచనలను పోల్చి చూచితిమేని భారతము మార్గకవిత్వము జానపద రచనలు శుద్ధదే కవిత్వరూను అగును అనగా భారతము దేశ భాషలో వ్రాయబడినను రచనా పద్ధతియంతయు మార్గకవిత్వానుకరణముగ ప్రౌఢముగా నుండును గాన దానిని మార్గకవిత్వమనియే భావింతుము భారతము ఒక్కటియే కాదు తరువాత తెలుగున వెలసిన పురాణేతిహాసములు ప్రబంధములు నాటకములు మొదలగు ప్రౌఢ వాఙ్మయమంతయు మార్గ కవిత్వమే యని పించుకొనును

నన్నయకు పూర్వమే పెక్కు దేశికావ్యములుండును మరియు గేయరూపముననున్న దేశిరచనలు గ్రంథరూపములో లేనికారణమున వాటిని లోకములో పాడుతున్నంతవరకే బతికియుండునుగాని పాటగాడు లేని యెడల విస్మృతములగును దేశీయ ఛందస్సుతో వ్రాయబడిన పూర్వపు రచనలన్నియు స్వభావమును బట్టి పాడగంవారు లేని లోపముచే లోపించి యుండవచ్చును సంస్కృతములో దీటురాగల ఆంధ్రభారతము పుట్టిన పిమ్మట పూర్వపు రచనలపై పెడమోము పెట్టియుండవచ్చును

నన్నయకు పూర్వము ఎంత విరివిగ దేశికవితలో పద్యరచన సాగినను ఆ పద్యములన్నియు మూలభూతములు కాలేకపోయినవి. నియమబద్ధమై శాస్త్ర సమ్మతమున రచింపబడినది మార్గకవిత నియమ రహితమై శాస్త్రమున కెక్కక ప్రజానురంజనముకై రచింపబడినది దేశికవిత

## 71 కన్యాశుల్కము

గురజాడ అప్పారావుగారు దీనిని రచించిరి నాటి సాంఘిక దురాచారములను ఖండించు నుద్దేశముతో వ్రాయబడినది అప్పారావుగారు నాటకములను గేయములను కథలను, వ్యాసములను వ్రాసిరి

కన్యాశుల్కము వ్రాయుటలో వీరికి రెండు ఉద్దేశములు గలవు 1 సంఘ సంస్కరణము 2 వ్యవహారిక భాషను సాహిత్యములోనికి ప్రవేశ పెట్టుట మొట్టమొదటిసారిగా గ్రంథాంలోనికి అన్యదేశ పదాలను ముఖ్యంగా ఆంగ్లపదాలను సుమారు ఆరువందల పదాలను ఈ నాటకములో కెక్కించిరని కేతవరపు రామకోటి శాస్త్రిగారు చెప్పుచున్నారు

బాల్యవివాహాల వలన నష్టములు బాగుగా వయసుమీరినవారు చిన్నపిల్లలను వివాహము చేసుకొనుట దాని పర్యవసానము భోగపు సానులు వారి వింతవింత నడకలు మొదలయినవన్నీ కన్యాశుల్కములో

కనబడును గిరీశము ఇందులో ఒక వింత పాత్ర ఆంగ్లాంధ్ర మిశ్రమ సంభాషణా చతురుడు అంత సజీవము సహజమైన పాత్ర మాంధ్ర నాటకములం దెచ్చటను కానరాదని" దివాకర్లవారు చెప్పుచున్నారు

ఈ నాటకము సహజ సుందరమయిన మాండలిక పద ప్రయోగ మునకును నిర్మలమైన హాస్యమునకును శక్తివంతమయిన సంస్కరణ ప్రబోధమునకును నిలయమైనది తెలుగు నాటక రంగమందు ఈ నాటకము ఒక విప్లవము తెచ్చినది. ఎనుబది సంవత్సరముల క్రింద వ్రాయబడినను ఇప్పటికి నూతనత్వము కోల్పోలేదు. ఈ నాటకము దృశ్య నాటకము కంటె శ్రవ్యనాటకమనుట మేలు ప్రదర్శనానుకూలంత తక్కువని కేతవరపు వారి ఉద్దేశ్యము

72 తెలుగు కవిత్వావిర్భావమును గూర్చి సంగ్రహముగా వ్రాయుము

భాషయొక్క పుట్టుకవలెనే కవిత్వము పుట్టుకయు ఏ పరిశోధనకు అందని కాలముననే జరుగును కవిత్వము రాజ్యముయొక్కయు సభ్యతల యొక్కయు పుట్టుకకుముందే పుట్టెను లిపి అనెడి సాధనము లేనిదే కవిత్వమునకు గాని భాషకుగాని అట్టి స్థిరత్వము కలుగదు కావున భాషకును దానితోపాటు ఆ భాషాకవిత్వమునకును అక్షర - రహితమైన దశయొకటియు, అక్షరబద్ధమైన దశయు విధిగా ఏర్పడును లిపి అనునది మొదట పరిపాలనా వ్యవహారములకు వినియోగపడును. తరువాత కావ్యరచనకు అనువైన శబ్ద సంపన్నతను సేకరించుకొన్నప్పుడు ఆ లిపి ప్రజాసారస్వత సాధనముగా నుపయోగపడును

ఆంధ్రరాజులగు శాతవాహన వంశపురాజులు ఈ ఆంధ్రభూమిలో పౌరాణిక కాలమునాటి మహారాజులవలె క్రీ పూ 2 వ శతాబ్ది మొదలుకొని క్రీ శ 2 8 శతాబ్దులవరకు శ్రంచు మించు నాలుగైదు వందల యేండ్లు ప్రజాహితముగా పరిపాలన చేసిరి వారి కాలములో విద్యాభాష సంస్కృతము రాజభాష ప్రాకృతము, ప్రజాభాష అనాది తెలుగు వారి శాసనములన్నియు సంస్కృత ప్రాకృతములలోనే యున్నవి ఆ లిపికూడ అనాది సంస్కృత ప్రాకృత భాషల లిపియే తెలుగును వారు రాజ భాషగా స్వీకరింపలేదు కాని తెలుగు ప్రజలు తెలుగులోనే పదములు పాటలు కట్టుకొని పాడుచూ సంబరముగ సంఘ జీవితమును గడుపు కొనిరి ఈ కాలములో ఆంధ్రభాష విద్యాభాష కానందువలన ఆంధ్ర కవియగు గుణాఢ్యుడు బృహత్కథ అనుపేర ఒక ఉద్గ్రంథమును పైశాచి భాషలో వ్రాసెను ప్రాకృతానికి గ్రామ్యమువంటిది పైశాచి ఆ కాలమందు సంస్కృత ప్రాకృత పాళీభాషలందు పరిచయము గల కొందఱు నూతన పదజాలమును ప్రవేశపెట్టి ఆంధ్ర శబ్ద జాలమును మఱికొంత విస్తృతపరచిరి అరవ భాషకులేని తత్సమ తద్భవాత్మక మైన సంస్కృత ప్రాకృత భాషా ప్రభావము ఆంధ్రమున ప్రసరించు టకు చారిత్రకమైన కారణ మిదియే

"ఒకటి రెండు శతాబ్దుల పిమ్మట నేడు రాయలసీమ" అని పిలువ బడెడి భూభాగమును రేనాటి చోళులు అనబడెడి చోడవంశ శాఖ పరిపా లించుచుండెను వారు వేయించిన శాసనములలో తెనుగు భాష వాడబడినది ఆస్థాన భాష గూడ తెలుగే అయి యుండవలెను 7 వ శతాబ్ది ప్రారంభ ములో సంస్కృతముతో పాటు తెలుగు విరివిగా ఉపయోగింపబడినట్లు పొడకట్టును ఈ కాలమున వేయబడిన శాసనములలో తెలుగ్గు విరివిగ నుపయోగించిరి ఆ తెలుగు ఇప్పుడు మనకు అర్థముగాదగిన తెలుగు

కాదు శాసనములలో కానవచ్చిన మొదటి తెలుగు పద్యము ఈ అద్ద కి శాసన తరువోజయే తొమ్మిదవ శతాబ్దము నాటికి తెలుగు సంస్కృత ప్రాకృతములను జీర్ణించుకొని పుష్టి చెంది స్వతంత్ర స్థితికి వచ్చినదని చెప్పవచ్చును చాళుక రాజుల కాలమందు తెలుగునకును సంస్కృత ప్రాకృతములకును జరిగిన సంఘర్షణలో కార్య-ప్రతికార్య (Ac o1 and eac on) వశమున చేకూరిన బలముతో తెలుగు రాజభాషగా నెలకొని స్వతంత్ర స్థితికి వచ్చెను సంస్కృతము నుండి తెలుగు కవులు అవలం బించిన వృత్తములలో మత్తేభ శార్దూలములు యధాతథముగానే తెలుగున వ్రాయబడినవి

ఇదంతయు నన్నయ పూర్వమున గల ఆంధ్ర భాషా రూపము

నన్నయకు పూర్వము శాసనములు మాత్రమేగాక పద్యకవిత్వము వంటి కవిత్వములో గ్రంథ రచన కూడ సాగుచుండెనని తలచుటకు ప్రమాణములు కూడ ఉన్నవి అరవమున యాప్పిరంగన్ అను ఒక ఛందశాస్త్రములో తాను వాంఛయ్య అను తెలుగు లక్షణవేత్త రచించిన గ్రంథమును చూచినట్లు ఈ క్రింది వాక్యములో చెప్పుకొనెనట వాంఛి యార్ సేయిద వడగు ఛందవుం అనగా వాంఛయ్య చేసిన వడగు భాష యొక్క ఛందము అని అర్థము ఆనాటి తెలుగు గ్రంథములు దేశిచ్ఛంద ములో చాల వెలసియుండెను

పై నుదహరింపబడిన దానినిబట్టి ప్రాఙ్నన్నయ యుగములో తెలుగున పామరభాషలో ప్రజలు పాడుకొను పదములు పాటలు మాత్రమేగాక ఛందోబద్ధములైన దేశీయ పద ములును సాంస్కృతిక పద్యములును విరివిగా నుండెననియు పద్యమయములైన గ్రంథములును కొన్ని రచింప బడి యుండుననియు, ఆ గ్రంథముల ననుసరించి లక్షణ గ్రంథములు

పుట్టి యుండుననియు నిర్ధారణ చేయుట సహేతుకమే కాని నిరాధారము కాదు భాషకు ఈ మహోపకారమంతయు చాళుక రాజుల సేవ వలన కలిగినది అంతకు పూర్వము మార్గ కవిత్వమనిపించుకొనెడి సంస్కృత ప్రాకృత గ్రంథములను చదువుకొనుచుండిన ఆంధ్రులు చాళుక్య రాజులు పుట్టించిన దేశీయ కవితలను చదువుకొని ఆనందింప దొడగిరి

తరువాత నన్నయ తిక్కన ఎఱ్ఱనలు సంస్కృత భారతమును తెలుగున కనువదించుట ద్వారా తెలుగునకొక పరిపూర్ణ రూపమేర్పరచిరి నన్నయ పూర్వముండిన కవిత్వము ప్రధానముగా దేశిమార్గము నన్నయ ప్రథమ కావ ము భారతము

అతడు జన వ్యవహారమందలి పదజాలమునంతను పరిశీలించి సంస్కరించి సంస్కృత పదములను తెలుగున వాడు పద్ధతి నిర్ణయించి ధారళమైన వచకగల కొన్ని సంస్కృత వృత్తములను గ్రహించి అప్పటికే ఉత్తమ కావ్యములుగల కన్నడ వాఙ్మయము నుండి ప్రశస్త లక్షణములు సేకరించి తెలుగున నుత్తమమైన కావ్యరచనా మార్గము తీర్చిదిద్దెను

కావ్యమననేమి దానియందలి లక్షణములను వ్రాయుము

కావ్యములు కేవలము విజ్ఞానము కలవిగా యుండవచ్చును కొన్ని ఆనందమును మాత్రమే కల్గింపవచ్చును మరికొన్ని రెండు గుణములు కల వియై యుండవచ్చును ఈ వివరమును మనసున పెట్టుకొనియే రాజశేఖరు డనెడి ఆలంకారికుడు సారస్వతమును శాస్త్ర సారస్వతము కావ్య సారస్వతము అని రెండు భాగములు చేసెను ఆ విభజన ప్రకారము మానవుని విజ్ఞాన సంపాదనకును బుద్ధివికాసమునకును అక్కరకు వచ్చెడి తర్క వ్యాకరణ మీమాంసాది సమస్త శాస్త్రములు మొదటి విభాగమున

కును రామాయణాది కావ్యములు శాకుంతలాది నాటకములు విజ్ఞానముతో పాటు ఆనందమును గూడ ప్రసాదించెడి రెండవ విభాగమునకును లక్ష్యభూతము లగును విజ్ఞాన ప్రబోధము లేకున్నను చిత్తసుఖమును కలిగించునేని అవి కూడ కావ్య జాతిగానే పరిగణింపబడును కావ్య వాఙ్మయమును పాశ్చాత్యులు సాధారణ వాఙ్మయము (Gene a e ature) అని పేర్కొందురు

అయితే ఏది కావ్యము అనే ప్రశ్నకు నిష్కర్షమైన నిర్వచనము నొసగుట కష్టమైన పని అందుచే కావ్య శబ్దార్హత కలిగి యుండవలెనన గ్రంథమునకు ముఖ్యముగా మూడు లక్షణము లుండవలెనని పాశ్చాత్య విమర కులు సిద్ధాంతరీకరించిరి అందు మొదటిది దాని సర్వజనానురంజకత్వము అనగా గ్రంథము నందలి విషయము (Sub ec matter) సర్వజనులకును ఆమోదజనకముగా నుండుట రెండవది రచన అలంకారికముగా నుండుట మూడవది ఆ గ్రంథము యొక్క పఠనము వలనగాని శ్రవణమువలనగాని భావనాహ్లాదము కలుగుట ఈ మూడు లక్షణములు సమగ్రముగానున్న గ్రంథము చిన్నదైననూ పెద్దదయిననూ కావ్యమనిఎంచుకొనును

ఒకే ఇతివృత్తమును గైకొని యెవరెన్ని కావ్యములు రచించినను ఆ యన్నింటను ఆయా రచయితల యొక్క ప్రతేకత వేరువేరుగా గోచరించుచునే యుండును తన సృష్టి తనదిగా ఇతరులకు గోచరించెడి ఆ పదార్థమునే ఆత్మీయత (Persona y) అని విమర కు లందురు ఈ ఆత్మీయ ముద్రగల వన్నియు కావ్యములు అవి పౌరుషేయములు (Sub ec ve wr ng ఆ ముద్రలేని వన్నియు శాస్త్రములు అవి అపౌరుషేయములు (Objec ve wr ng )

ఎండితార్థమేమనగా- సుందరమైన రచనయు సార్వజనీనమైన ప్రయోజనమును కలిగి ఆత్మీయతను స్ఫురింపజేయు గ్రంథము కావ్యము అట్టి కావ్యములయొక్క చరిత్రయే సాధారణ చరిత్ర అని అంగీకరింపవలసి యుండును

దేశచరిత్ర చక్కని శైలిలో రచింపబడినచో అది వాఙ్మయ చరిత్రలో గ్రాహ్యమగునా ఆ చారిత్రక గ్రంథములో చక్కని శైలియే గాక రసవత్తరముగా నున్నచో అది కావ్యమే అనిపించుకొని వాఙ్మయమగును సంస్కృతమున హర్షచరితము విక్రమాంకదేవ చరిత్రము అట్టివే తెలుగున కృష్ణరాయ విజయము రంగరాయ విజయము మొదలగు ప్రబంధములును పలనాటి వీరచరిత్ర కాటమరాజు కథ మొదలగు పదములును అట్టివే మంచి శైలి ఉన్నంత మాత్రమున దేశచరిత్ర గ్రంథములు వాఙ్మయము కాజాలవు అదీగాక చరిత్రలో తనకు నచ్చిన ఏదో ఒక ఘట్టమును ఇతివృత్తముగా గైకొని రసవంతముగా రచించిన గ్రంథకర్తలుందురుగాని దేశ చరిత్రనంతను అట్లే వ్రాసినవారుందరు

# తెలుగు వ్యాకరణము

## 74 తెలుగు సంధులు

సంధి - పూర్వపర స్వరములకు బరస్వర మేకాదేశమగుట సంధి ఏకాదేశమనగా రెండు వర్ణములకు బదులుగా నొక వర్ణము వచ్చుట ఏ రెండు వర్ణములైననూ (అచ్చులు లేక హల్లులు) దగ్గరగా జేరునప్పుడు వచ్చు ఆగమాదేశలోప సంశ్లేషములను సంధులగును ఈ సంధులను నాలుగు విధములుగా విభజింపవగును

ఆగమ సంధులు 2 ఆదేశ సంధులు 3 లోప సంధులు
4 సంశ్లేష సంధులు

అకారసంధి -
సూత్రము - అత్తునకు సంధి బహుళము
ఉదా - ఎల + అమ్మ = ఎలమ్మ
ఒక + ఒక = ఒకానొక

2 ఇకారసంధి -
సూత్రము - ఇకారమునకు సంధి వైకల్పికముగా వగును
ఉదా - ఏమి + అంటివి = ఏమంటివి
వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు.
వచ్చి + ఇచ్చెను = వచ్చి యిచ్చెను

3 ఉకారసంధి -
సూత్రము - ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు
ఉదా - రాముడు + అతడు = రాముడతడు
నన్నున్ + అడిగె = నన్నడిగె

4 త్రికసంధి -
సూత్రము - ఆ, ఈ ఏ లకు త్రికమని పేరు త్రికము మీది అసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగా వగును

ఉదా - అ + చోటు = అచ్చోటు

ఈ + ముని = ఇమ్ముని

యడాగమసంధి -

సూత్రము - సంధిలేనిచోట స్వరంబుకంటె పరంబయిన స్వరంబు యడాగమంబు

మా + అమ్మ = మాయమ్మ

నుగాగమ సంధి -

( ) సూత్రము - ఉదంత (ఉకారము చివరిగా నున్నది) తద్ధర్మార్థ విశేషణములకు అచ్చుపరమైనచో నుగాగమమగును

ఉదా - వచ్చు + అతడు = వచ్చునతడు

( ) షష్ఠీ సమాసములందు ఉకార ఋకారములకు అచ్చుపరమైనచో నుగాగమమగును

ఉదా - రాజు + ఆనతి + రాజునానతి

సమాసముల నుదంత స్త్రీ సమములకును పుంపులకును పరుష సరళములు పరమగునపుడు నుగాగమమగును

ఉదా - తళుకు + గజ్జెలు = తళుకుంగజ్జెలు

(౪) ఉదంత స్త్రీ సమములకును పుంపులకును అదంత గుణ వాచకములకును "తనము" పరమైనచో నుగాగమమగును

ఉదా - సొగసు + తనము = సొగసుందనము

తెల్ల + తనము = తెల్లదనము

దుగాగమసంధి

సూత్రము - నీ నా తన పదములకు ఉత్తరపదము పరమగునపుడు దుగాగమము విభాషనగును

ఉదా - నీ + పుస్తకము = నీదు పుస్తకమ

నా + గృహము = నాదు గృహమ

8 రుగాగమసంధి - రేఫాగమసంధి)
సూత్రము - కర్మధారయములందు పేదాది శబ్దములకు ఆలు శబ్దము పరమగునపుడు రుగాగమమగును
ఉదా - పేద + ఆలు = పేదరాలు
జవ్వన + ఆలు = జవరాలు

9 టుగాగమసంధి -
సూత్రము - ) కర్మధారయములం దుత్తునకచ్చు పరమైనచో టుగాగమమగును
ఉదా - నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము
( ) కర్మధారయములందు పేర్వాది శబ్దములకు అచ్చు పరమగు నపుడు టుగాగమసంధి
ఉదా - చిగురు + ఆకు = చిగురుటాకు

0 ద్విరుక్తటకారసంధి -
కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల రడలకు అచ్చుపర మగునపుడు ద్విరుక్త టకారమాదేశమగును
ఉదా - చిఱు + ఎలుక = చిట్టెలుక
నడు + అడవి = నట్టడవి

గసడదవాదేశసంధి
సూత్రములు - ప్రథమమీది పరుషములకు గసడదవలు బహుళ ముగా నగును
ఉదా - వాడు + కొట్టెను = వాడుగొట్టెను

2 సరళాదేశసంధి - (ద్రుతసంధి)
సూత్రము - ద్రుతముమీది పరుషములకు సరళము లాదేశమగును ఆదేశ సరళమునకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగును
ఉదా - తోచెను + చుక్కలు = తోచెంజుక్కలు

5 సంస్కృత సంధులు

సవర్ణదీర్ఘ సంధి -

సూత్రము - అ ఇ ఉ ఋ లకు సవర్ణములు పరమైనచో దీర్ఘ మేకాదేశమగును

ఉదా - అమంద + ఆనందము = అమందానందము
కవి + ఇంద్రుడు = కవీంద్రుడు

గుణసంధి -

సూత్రము - అకారమునకు ఇ ఉ ఋ ఌ పరమైనచో క్రమముగా ఏ ఓ అర్ లు ఆదేశమగును

ఉదా - దేవ + ఇంద్రుడు = దేవేంద్రుడు
రథ + ఉత్సవము = రథోత్సవము
సప్త + ఋషులు = సప్తర్షులు

యణాదేశసంధి -

సూత్రము - ఇ ఉ ఋ ౡ అనువానికి అసవర్ణములైన అచ్చులు పరమైనచో క్రమముగా య వ ర ల అనునవి ఆదేశమగును

ఉదా - అతి + అధికము = అత్యధికము
పితృ + ఆజ్ఞ = పిత్రాజ్ఞ

వృద్ధిసంధి -

అకారమునకు ఏ ఐ లు పరమగునపుడు ఐకారము ఓ ఔ లు పరమగునపుడు ఔకారమాదేశమగును.

ఉదా - ఏక + ఏక = ఏకైక
దేశ + ఔన్నత్యము = దేశౌన్నత్యము.

5 అనునాసికసంధి

సూత్రము - నకారముకాని మకారముకాని పరమైనచో ట త ప లకు వాని వర్గానునాసికము లాదేశమగును

ఉదా - వాక్ + మయము = వాఙ్మయము

విరాట్ + మహిమ = విరాణ్మహిమ

76 సమాసములు

వేర్వేరగు నర్థములు గలిగిన పదములు కలిసి ఒకే యర్థము వచ్చుట "సమాస" మందురు

సమాసమున సాధారణముగా రెండు పదములుండును మొదటి దానిని పూర్వపదమనియు రెండవ దాని నుత్తర పదమనియు నందురు సమాసమందలి పదములకు విభక్తి ప్రత్యయాదులను జేర్చి వివరించుటను విగ్రహ వాక్యమందురు పూర్వ పదముయొక్క విభక్తికి సతలుచుగా లోపము వచ్చును అట్లు లోపమురాని సమాసములను అలుక్సమాస మందురు

ఉదా - నీ వలని భయము కంఠేకాలుడు.

సమాసములను శబ్దమునుబట్టి మూడు విధములుగా విభజించనగును

( ) సాంస్కృతిక సమాసము ( ) ఆచ్ఛిక సమాసము

(3) మిశ్ర సమాసము

సాంస్కృతిక సమాసమును మరల రెండు విధములుగ విభజించ నగును

( ) సిద్ధ సమాసము (2) సాధ్య సమాసము

కేవల సంస్కృత శబ్దములకగు సమాసము సిద్ధ సాంస్కృతిక సమాసము

ఉదా - రాజాజ్ఞ, మధురవచనము

కేవల తత్సమ పదములకగు సమాసము సాధ సాంస్కృతిక సమాసము

ఉదా - రాజునాజ్ఞ మధురపు వచనము

కేవలము తెలుగు పదములకగు సమాసమాచ్ఛికము

ఉదా - తేని ముదల చెరువు నీరు

తత్సమ పదములతో తెలుగు పదములతో నేర్పడు సమాసము మిశ్రమము

ఉదా - తేని శాసనము చెఱువు నుదకము

అర్థమును బట్టి సమాసము లాఱు విధములు

( ) తత్పురుషము (2) కర్మధారయము (3) ద్విగువు

(4) ద్వంధము (5) బహుబ్రీహి (6) అవ్యయీభావము

1 తత్పురుషము

ఇది యుత్తర పదార్థము ప్రధానముగా గల సమాసము ఇది ఎనిమిది విధములు

) ప్రథమా తత్పురుషము - కదకన్ను (కంటియొక్క కద)

2) ద్వితీయా తత్పురుషము - కృష్ణశ్రితుడు కృష్ణుని శ్రితుడు)

3) తృతీయా తత్పురుషము - రాజపూజితుడు (రాజుచే పూజితుడు)

4) చతుర్థి తత్పురుషము - వ్రాతబల్ల (వ్రాతకొఱకు బల్ల)

5) పంచమీ తత్పురుషము - చోరభయము (చోరునివలన భయము)

6) షష్ఠి తత్పురుషము - తండ్రిమాట (తండ్రియొక్క మాట)

7) సప్తమీ తత్పురుషము - శాస్త్రనిపుణుడు (శాస్త్రము నందు నిపుణుడు)

8) నఞ్ తత్పురుషము - అసత్యము (సత్యము కానిది)

2 కర్మధారయము

తత్పురుష సమాసము వ్యధికరణము సమానాధికరణము నని రెండు విధములు విశేషణమునకు విశేష్యముతో సమాసము సమానాధికరణము దీనినే కర్మధారయ మందురు ఇది కూడ నుత్తర పదార్థ ప్రాధాన్యము కలది

విశేషణము (Ad ec ve ఉపమానము (Compar ion) సంభావనము ( mag na on) అవధారణము (Dete imena on or den fica on) అను వాని ననుసరించి కర్మధారయము 7 విధములు

విశేష పూర్వపద కర్మధారయము
ఉదా - వృద్ధ కపోతము (వృద్ధమైన కపోతము)
విశేషణోత్తర పద కర్మధారయము
ఉదా - కపోతవృద్ధము (వృద్ధమైన కపోతము)
విశేషణోభయ పద కర్మధారయము
ఉదా - సరస మధురము (సరసమును మధురమును)
ఉపమానోత్తర పద కర్మధారయము (ఉపమిత సమాసము]
ఉదా - ముఖ పద్మము (పద్మము వంటి ముఖము)
కవిసింహుడు (సింహము వంటి కవి)
ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసము
ఉదా - జుంటిమోవి (జున్నువంటి మోవి)
సంభావనా పూర్వపద కర్మధారయము
ఉదా - యమునానది (యమున యను నది)
అవధారణా పూర్వపద కర్మధారయము (రూపకము)
ఉదా - కవికోకిలము (కవియనెడి కోకిలము)

తెలుగున ఆ ఈ ఏ లను త్రికములందురు ఇది పూర్వమున
నున్న దానిని త్రికపూర్వక కర్మధారయమందురు

8 ద్విగువు

సంఖ్యా పూర్వక కర్మధారయమే ద్విగువు

ఉదా - నలుదిక్కులు (నాలుగు దిక్కులు)

త్రిలోకములు (మూడు లోకములు)

ద్వంద్వము

ఇది ఉభయ పదార్థ ప్రధానమైంది

ఉదా - తల్లిదండ్రులు (తల్లియు తండ్రియు)

రామలక్ష్మణులు (రాముడును లక్ష్మణుడును)

5 బహువ్రీహి - అన్యపదార్థ ప్రధానమైనది బహువ్రీహి - కలవాడు
కలది అని వచ్చుచుండును

ఉదా - ఫాలాక్షుడు = ఫాలమందు-అక్షి కలవాడు

పద్మాక్షి = పద్మములవంటి అక్షులు కలది

6 అవ్యయీభవ సమాసము -

ఇది పూర్వపదము ప్రధానముగా గలది అవ్యయము పూర్వ
పదముగానుండి సమర్థమైన ఉత్తర పదముతో సమసించును ఇది
అవ్యయసహితమని, అవ్యయరహితమని రెండు విధములు

ఉదా - ( ) ప్రతిదినము దినము దినము) అవ్యయసహితము

( ) దినదినము (దినము దినము) అవ్యరహితము

77 లింగము-వచనము-విభక్తి

లింగము - స్త్రీ పురుషాది భేదములను దెలుపునది లింగము
సంస్కృత భాషలో శబ్దమునుబట్టి లింగమును నిర్ణయింతురు కాని
తెలుగు భాషలో అర్థమునుబట్టి లింగముండును సంస్కృత
మున పుంలింగము స్త్రీలింగము నపుంసకలింగము అను విధమున

నుండును తెలుగున లింగము-అను పదము వాడరు వాచకము అను పదమును వాడుదురు

పురుషులను వాని విశేషణములను దెలుపు పదములు పురుష వాచకములు వీనిని మహద్వాచకములందురు స్త్రీలను వాని విశేషణము లను దెలుపు పదములను స్త్రీ వాచకములు లేక మహతీవాచకములందురు నపుంసకములను వాని విశేషణములను దెలుపు పదములను నపుంసక వాచకములు లేదా అమహద్వాచకములందురు స్త్రీలను పురుషులను దెల్పు సాధారణ పదములను సామాన్య వాచకములు (Common gender) అందురు

ఉదాహరణములు - మహద్వాచకములు - రాముడు, వీరుడు సుందరుడు ధనవంతుడు వాడు మొదలగునవి

2 మహతీ వాచకములు - లత పూజ్యులు భార్య ఆమె మొదలగునవి

3 అమహద్వాచకము - చెట్టు ఇల్లు కాయి మొదలగునవి

4 సామాన్య వాచకము - చుట్టము కొందరు పక్షి బిడ్డ నేను నీవు మొదలగునవి

తెలుగు పదములలో కొన్ని స్త్రీ సమములు కలవు అనగా నివి స్త్రీ లింగ సమములు ప్రథమైక వచన ప్రత్యయములు లోపించిన వానిని స్త్రీ సమములందురు ఈ స్త్రీ సమములలో పుంలింగములు స్త్రీలింగ ములు నపుంసకములు కూడ నుండును.

ఉదా - తల్లి తండ్రి గోడ దూడ మేడ మొదలగునవి

ii వచనము - ఒక వస్తువును తెలియజేయు నామవాచకము ఏకవచనము రెండు లేక అంతకన్న ఎక్కువ వస్తువులను దెలుపు నామవాచకము బహువచనము సంస్కృతమున రెండు వస్తువులను దెలుపు విశేష్యమును ద్వివచనము అందురు ఇది తెలుగున లేదు

అందుచేత తెలుగునందిది బహువచనముగనే వ్యవహరింపబడును ఏక వచన రూపములు కలిగి బహువచన రూపములు లేనివి నిత్యైక వచనములు (అక్కడ వరి ఉప్పు వెండి తెలుపు మొదలుగునవి) బహువచన రూపములు మాత్రమే కలవి నిత్య బహువచనములు (పెసలు అందలు మొదలగునవి )

విభక్తి

ధాతువుయొక్క ధర్మమును దెలుపునది విభక్తి నామవిభక్తులు క్రియావిభక్తులు అని విభక్తులు రెండు విధములు

డు ము వు లు మున్నగునవి నామ విభక్తులు ఎను రి మొదలైనవి క్రియావిభక్తులు

నామవిభక్తులు

| | | | |
|---|---|---|---|
| | ప్రథమా విభక్తి-ప్రత్యయములు | | డు ము వు లు |
| 2 | ద్వితీయా విభక్తి | " | ని ను ం కూర్చి గురించి |
| 3 | తృతీయా విభక్తి | " | చేత చే తోడ తో |
| 4 | చతుర్థీ విభక్తి | " | కొఱకు కై |
| 5 | పంచమీ విభక్తి | " | వలన కంటె పట్టి |
| 6 | షష్ఠీ విభక్తి | " | కి కు యొక్క లో లోపం |
| 7 | సప్తమీ విభక్తి | " | అందు న |
| 8 | సంబోధన ప్రథమావిభక్తి | " | ఓ ఓయి, ఓరి ఓసి |

క్రియావిభక్తి ప్రత్యయములు

| | | | |
|---|---|---|---|
| | ప్రథమపురుష-ఏకవచన ప్రత్యయము | డు | (చదువుచున్నాడు |
| 2 | బహువచన | రు | (చదువుచున్నారు |
| 3 | మధ్య పురుష-ఏకవచన | వు | (చదువుచున్నావు |
| 4 | బహువచన | రు | చదువుచున్నారు |
| 5 | ఉత్తమపురుష-ఏకవచన | ను | (చదువుచున్నాను) |
| 6 | బహువచన | ము | (చదువుచున్నాము) |

నామ విభక్తులు నామవాచకములపైన సర్వనామములపైన చేరు చుండును (రామునియొక్క చోరునివలన నీకు నాచే మొదలగునవి)

ఈ క్రింది యుదాహరణములను గమనింపుము

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ) | గోడ | గోడలు |
| 2) | స్త్రీ | స్త్రీలు |
| 3) | చెట్టు | చెట్లు |
| 4) | కొలను | కొలనులు |
| 5 | పగతుడు | పగతురు |
| 6) | అల్లుడు | అల్లురు |
| 7 | కోడలు | కోడండ్రు |
| 8) | చెల్లెలు | చెల్లెండ్రు |
| 9) | చేను | చేలు |
| 0) | రేయి | రేలు |
| ) | వేయి | వేలు |
| 2) | ఇల్లు | ఇండ్లు |
| 3) | పేరు | పేళ్ళు |
| 4) | గొడ్డలి | గొడ్డళ్ళు |
| 5) | పేను | పేలు |
| 6) | విలుకాడు | విలుకాండ్రు |
| 7) | వేటకాడు | వేటకాండ్రు |
| 8) | ఆవు | ఆవులు ఆలు |
| 9) | త్రాడు | త్రాళ్ళు |
| 20) | గోయి | గోతులు |

## 279 రచనలో కానవచ్చు సామాన్య దోషములు

తెలుగు వ్రాయునప్పుడు సాధారణముగా జేయు తప్పులీ ప్రకరణములో వివరింపబడుచున్నవి వీనిని మనము జాగరూకతతో బరి లించి రచనలో నట్టి దోషములను దొలగించుకొనుటకు బ్రయత్నింపవలయును

యకారము -

వు వూ వొ వోలు తెలుగు పదముల మొదట నుండరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| యెక్కడ | – | ఎక్కడ |
| యెప్పుడు | – | ఎప్పుడు |
| యితడు | – | ఇతడు |
| యతడు | – | అతడు |
| యెవడు | – | ఎవడు |
| వుండెను | – | ఉండెను |
| వూరు | – | ఊరు |
| వొక | – | ఒక |
| వొకడు | – | ఒకడు |
| వోడ | – | ఓడ |

2 హల్లులతో నారంభించు పదముల నజాదులుగా వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ) మేమెళ్ళితివి | – | మేము వెళ్ళితిమి |
| 2) వాడెళ్ళెను | – | వాడు వెళ్ళెను |
| 3 వాడొచ్చెను | – | వాడు వచ్చెను |
| 4) వాడినెను | – | వాడు వినెను |

3 ద్విత్వము గలినప్పుడు శకట రేఫమునే వ్రాయవలెను

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| గుర్రము | – | గుఱ్ఱము |
| 2) కర్ర | – | కఱ్ఱ |
| 3) గొర్రె | – | గొఱ్ఱె |
| 4) మర్రి | – | మఱ్ఱి |

4 క్రావడిని ఋత్వమును తారుమారు చేయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ) మిత్ృడు | – | మిత్రుడు |
| 2) చంద్ృడు | – | చంద్రుడు |
| 3) కౄరుడు | – | క్రూరుడు |
| 4) గ్రుహము | – | గృహము |
| 5) క్రుషి | – | కృషి |
| 6) మ్రుగము | – | మృగము |
| 7) దృతము | – | ద్రుతము |
| 8 కృంకెను | – | క్రుంకెను |
| 9) ద్రుష్ట | – | దృష్ట |
| 0) క్రుశించు | – | కృశించు |

5 శకటరేఫము నితర హల్లులతో సంయుక్తముగా చేయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| గుఱ్తు | – | గుర్తు |
| 2) కూఱ్తురు | – | కూర్తురు |
| 3) నేఱ్పు | – | నేర్పు |
| 4) చేఱ్పు | – | చేర్పు |

6 శ ష స లను మార్చి వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ) శిసుదు | – | శిష్యుడు |
| 2) శిత | – | సిత |
| 3) సివుడు | – | శివుడు |
| 4) శెలవు | – | సెలవు |
| 5) ప్రకాషము | – | ప్రకాశము |

7 ఒత్తులను వ్యతిరేకముగా వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ) విద్యార్ధి | – | విద్యార్థి |
| 2) బేధము | – | భేదము |
| 3) భలము | – | బలము |
| 4) విధ్య | – | విద్య |
| 5) భోద | – | బోధ |
| 6) బంగము | – | భంగము |

8 ఐ కారమును తా వత్తును తాఱుమారు చేయరాదు (ై ్త)

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ) స్తైరించు | – | సైరించు |
| 2) ప్రశస్తై ము | – | ప్రశస్తము |
| 3) విస్తైరము | – | విస్తారము |
| 4) కత్తై | – | కత్తి |

9 ము వర్ణమునకు బదులు సున్న వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ) పుస్తకం | – | పుస్తకము |
| 2) చిత్రం | – | చిత్రము |

3 గతం — గతము
4 పంతం — పంతము
5 కెరటం — కెరటము
6 పటం — పటము
7 గోళం — గోళము
8 సున్నం — సున్నము
9 పట్టణం — పట్టణము
0 నగరం — నగరము

0 కళలపైన కారాగము చేయరాదు

తప్పు ఒప్పు

) ఏలనన — ఏలయన
2) చేయకనుండెను — చేయకయుండెను

ద్రుత ప్రకృతికముల మీద యడాగమము చేయరాదు

తప్పు ఒప్పు

) వెంటయుండెను — వెంటనుండెను
2) ఎక్కడయున్నది — ఎక్కడనున్నది

2 సంధి చేయవలసిన చోట్ల యడాగమము చేయరాదు

తప్పు ఒప్పు

) అతడుయుండెను — అతడుండెను
2) ఇతడుయుండెను — ఇతడుండెను

3 కూడ చాల మున్నగువానిని దీర్ఘాంతములుగా వ్రాయరాదు

తప్పు ఒప్పు

చాలా — చాల
2) అంతా — అంతయు
3) కూడా — కూడ
4) ఇంకా — ఇంకను

4 సముచ్చయమును ద్విత్వియుక్తముగా వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
| --- | --- | --- |
| వాడున్నూ వీడున్నూ | – | వాడును వీడును |
| 2) వీకున్నూ నాకున్నూ | – | వీకును నాకును |

5 ప్రార్థనార్థక రూపములను వ్యతిరేకార్థములిచ్చునట్లుగా వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
| --- | --- | --- |
| వ్రాయమనెను | – | వ్రాయుమనెను |
| తినమనిచెప్పెను | – | తినుమని చెప్పెను |
| చేయమంటివి | – | చేయమంటివి |
| చదువమనెను | – | చదువుమనెను |

6 కొను ధాతువును ప్రయుక్తమగుచో ధాతువులందలి "సు" "సి"గా మాఱును

| తప్పు | | ఒప్పు |
| --- | --- | --- |
| చేసుకొని | – | చేసికొని |
| వ్రాసుకొని | – | వ్రాసికొని |
| తీసుకొని | – | తీసికొని |
| పోసుకొని | – | పోసికొని |

7 క్త్వార్థకమైన ఇకారమునకు సంధి చేయరాదు

| తప్పు | | ఒప్పు |
| --- | --- | --- |
| వచ్చిచ్చెను | – | వచ్చి యిచ్చెను |
| చూచరిగెను | – | చూచి యరిగెను |

8 మధ్యమపురుష - ఇకారమునకు సంధి చేయవలయును

| తప్పు | | ఒప్పు |
| --- | --- | --- |
| ఎలితియపుడు | – | ఏలితివపుడు |

9 ఖ ఘ లను ధ థ లను తారుమారు చేయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| మేఖము | — | మేఘము |
| కధ | — | కథ |
| రధము | — | రథము |
| సంఖము | — | సంఘము |

20 ఉదంత తద్ధర్మ విశేషణములను ఏకారాంతముగా వ్రాయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| వచ్చేవాడు | — | వచ్చువాడు |

2 గ్రామ్య ప్రయోగములు చేయకూడదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| వస్తాడు | — | వచ్చును |
| అంటాడు | — | అనును |
| తెచ్చిండు | — | తెచ్చెను |
| చేతురు | — | చేయుదురు |

22 భూతకాల మధ్యమ పురుష బహువచన క్రియకు బదులు ప్రథమ పురుష క్రియా రూపమును వాడరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| మీరు వచ్చిరి | — | మీరు వచ్చితిరి |

23 పునరుక్తి కాకూడదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| హిమాచలపర్వతము | — | హిమాచలము |

24 దుష్ట సమాసములు చేయరాదు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ప్రతివాడు | — | ప్రతి మనుజుడు |
| అనేకసార్లు | — | అనేక పర్యాయములు |

25 మరికొన్ని సామాన్య దోషములు

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| అతను | – | అతడు |
| వాడికి | – | వానికి |
| వాటికి | – | వానికి |
| పైన | – | పైని |
| ఇవ్వడు | – | ఈయడు |
| బాలులు | – | బాలురు |
| సాయంత్రం | – | సాయంకాలము |
| వీడిని | – | వీనిని |

# A P P S C

## Group II Serv ces

## Te ugu Language and L e a u e (B A S d)

## 1962

సంధి యననేమో తెల్పి భాషాశాస్త్రము ననుసరించి తెలుగునందలి పుగాగమ రుగాగముల స్వరూపమును వివరింపుము

2 తెలుగునందలి నామవిభక్తి ప్రత్యయముల పేర్కొని తృతీయ చతుర్థి పంచమీ విభక్తి ప్రత్యయముల చరిత్ర నెరిగింపుడు

3 కవిత్రయమువారికి గల బిరుదములను దెల్పి వారి రచనలను బట్టి అవి ఎంతవరకు సార్థకములో పరిశీలింపుడు

4 ప్రబంధ లక్షణము తెలియఁగించి అష్ట దిగ్గజ కవులలో నే రెండింటి కైనా గవవచ్చు నా లక్షణములను విశదీకరింపుడు

5 ఆధునిక వాఙ్మయమునందలి వివిధ కవితా మార్గములను వివరింపుడు

6 ఈ క్రిందివానిలో నే రెండిందిని గూర్చియైనా సంగ్రహముగ వ్రాయునది

నన్నెచోడుని కుమార సంభవము

2 విజయ విలాసము

3 వేమన పద్యములు

4 యక్షగానములు

కాకతీయ రాజుల కాలమునందలి మత సారస్వత వ్యాపార పరిస్థితులను వివరింపుము

## A P P S C

**Group I Serv ce** **Te ugu Language and L era ure B A Std**

## 1963

1 ఆంధ్ర భాషపై నితర భాషల ప్రభావమును తెలిపి దానివలన తెలుగు భాషకు జరిగిన యుపకారములను దెలుపునది

2 భాషా కుటుంబములను నిర్ణయించునపుడు పాటించదగిన ముఖ్య విషయములను విశదీకరించునది

3 భారతాంధ్రీకరణమున తిక్కన ప్రదర్శించిన కవితా శిల్పమును సోదాహరణముగా తెలుపునది

4 శ్రీనాథుని రచనలను బురస్కరించుకొని కవి సార్వభౌమ బిరుదము ఎట్లు తగియున్నదో యరయునది

5 ద్వ్యర్థి కావ్య రూపమును తెలిపి తెలుగున మిగుల ప్రసిద్ధములగు రెండు ద్వ్యర్థి కావ్యములను గూర్చి వ్రాయునది

6 ఈ క్రిందివానిలో నే రెండింటినేని గూర్చి సంగ్రహముగా వ్రాయుము

క్రీడాభిరామము 2 సిద్ధేశ్వరచరిత్ర
3 పాండురంగ మాహాత్మ్యము 4 వాల్మీకి చరిత్ర

7 అచ్చ తెలుగు కావ్యములో యయాతి చరిత్రకు గల ప్రాధాన్యమును సకారణముగా వివరించునది

8 శతక లక్షణములను దెలిపి తెలుగునందలి శతక భేదముల సోదాహరణగా నెఱిగించునది

9 ఆధునికాంధ్ర సాహిత్యమున నవలా వాఙ్మయ వికాసమును సమీక్షించునది

# A P P S C

## Telugu Language and Literature (B A Std )

## Group II Services

## 1964

1 ఆంధ్ర భాష ద్రావిడ కుటుంబములోనిదే కాని సంస్కృత జన్యము కాదు అను వాదమెంతవరకు సత్యము

2 తెనుగు తెలుగు ఆంధ్రము అను పేర్ల చరిత్రను వివరింపుడు

3 తెలుగువారి సాహితీ సంస్కృతులపై భారత భాగవత రామాయణ ముల ప్రభావమెట్టిది

4 నన్నయకు పూర్వపు తెనుగు భాషా స్వభావ స్వరూపముల ప్రవ చింపుడు

5 ఆంధ్ర సాహితీ క్షేత్రమున కవిత్రయము వారి సమున్నత స్థానమును నిరూపింపుడు

6 వాఙ్మయము సారస్వతము సాహిత్యము అను సంజ్ఞాత్రయపుటర్థ పరిమితులను విశదీకరింపుడు

7 తెనుగు వచన వాఙ్మయ వికాసము వివరింపుడు

8 వాడుక భాషావాదుల లక్ష్యము ఆధునిక జీవితపు విపుల ప్రయో జన యోగ్యమైన సులభ ప్రామాణిక భాషయే అనుట ఎంతవరకు సమంజసము

9 మీ యభిమానాంధ్ర కవి యొక్క జీవితము, కావ్యములు తెలుగున అతని స్థానమును వివరింపుడు

# A P P S C

## Telugu Language & Literature (B A Std )

## Group I Services

## 1965-66

1 భాషలను కుటుంబములుగా విభజించుటవలన గలుగు ప్రయోజనములను దెలిపి వీని వర్గీకరణ విషయమున భాషా శాస్త్రజ్ఞు లవలంబించు పద్ధతులను దెలుపునది

2 ద్రావిడ భాషలలోని లింగవచన రీతులను సమీక్షించునది

3 తెలుగు భాషలో విశేషణ రూపము లేర్పడు పద్ధతులను వివరించునది

4 వర్ణ సమీకరణము వర్ణ వ్యత్యయము అనుచిత విభాగము సామ్యము- వీనిని సోదాహరణముగ వివరించునది

5 ఆంధ్ర వాఙ్మయము నెన్ని యుగములుగా విభజింపనగునో విమర్శించునది

6 నన్నెచోడుని కాలమును నిరూపించునది

7 ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథ యుగమునకు కల ప్రాధాన్యము వివరించునది

8 ఆంధ్ర యక్షగానముల గూర్చి సంగ్రహముగా వ్రాయునది

9 కన్యాశుల్కము సౌందరనందము రమ్యాలోకము- వీనిని గూర్చి సంగ్రహముగా వ్రాయునది

# A P P S C

Group I Serv ces — Te ugu Language and L tera ure (B A S d)

## 1977

### A

ఆంధ్ర - తెలుగు - తెనుగు శబ్దముల వ్యుత్పత్తిని అనుబంధమును అరయునది

2 క్రీ శ 00 కు ముందునాటి శాసనములలోని తెలుగు భాష యొక్క స్వరూప స్వభావములను సమీక్షించునది

3 నన్నయ భారతమున తెలుగు కావ్య భాషకు జరిగిన సంస్కార మెట్టిదో వివరించునది

4 గత తొమ్మిది శతాబ్దులలోను తెలుగు కావ్య భాషలో కానవగు పరిణామమును విశదీకరించునది

5 ఆధునిక రంగమున తెలుగు భాష చేసిన వాలకములను (సారస్వత రంగములో) సమీక్షించునది

### B

6 తిక్కన కవితా సౌందర్యమును అభినందింపుడు

7 పోతన భాగవత ప్రాశస్త్యమును ఉగ్గడింపుడు

8 మీకు నచ్చిన యొక ప్రబంధమునుగాని యక్షగానమును గాని సమీక్షింపుడు

9 కందుకూరి వీరేశలింగంగారిని నవయుగ వైతాళికు డనుటలోని ఔచిత్యమును స్థాపింపుడు.

10. క్రింది రచయితలలో ముగ్గురి గురించి లఘు సమీక్షలు వ్రాయుడు

రంగాజమ్మ
2 మల్లికార్జున భట్టు
3 పానుగంటి లక్ష్మీనరసింహారావు
4 ఆదిభట్ల నారాయణదాసు
5 గుంటూరు శేషేంద్రశర్మ

# A P P S C

Group I Serv ces — Te ugu Language and L erature (B A S d )

## 1978

### A

1 ద్రావిడ భాషల సామాన లక్షణములను దెలిపి తెలుగునకు ద్రావిడ భాషలలో నున్న స్థానమును వివరించునది

2 తెలుగలో అర్ధానుస్వార చరిత్రమును తెలిపి ఇతర ద్రావిడ భాషలలో దాని సాదృశ్యమును నిరూపించునది

3 తెలుగు పదజాలమును వర్గీకరించి వాని స్వరూప స్వభావములు వివరింపుడు

4 వ్యవహారిక భాషోద్యమము పుట్టుపూర్వములు దాని పరిణామము తెలుపునది

5. తెలుగు లిపి పరిణామ చరిత్రను సంగ్రహించి, ఆధునికావసరములకు తెలుగు లిపిని సంస్కరింపవలసిన యవసరమున్నదో లేదో చర్చింపుడు

### B

6 తెలుగులో మహాభారత మవతరించిన తీరును సంగ్రహముగా తెలుపుడు

7 శ్రీనాథుని కాంధ్ర సాహిత్యమున గల స్థానమును విశదీకరింపుడు

8 ప్రబంధ లక్షణములను తెలిపి మీకు నచ్చిన యొక ప్రబంధ మందలి విశేషములు వివరింపుడు

9 జానపద గేయ లక్షణములను వివరించి తీరు తీరు గేయములపై వైలక్షణ్య ముట్టంకింపుడు

0 ఆధునిక సాహిత్యమున కథా ప్రక్రియకున్న ప్రచార ప్రాముఖ్యము లుగ్గడింపుడు

# APPSC

## Te ugu Language and L tera ure

## Group II Serv ces

## 1980

**Cand da e  hou d a temp 8 Que  ons**

**From each part**



ప్రాఙ్నన్నయ భాషా స్వరూపమును వివరింపుము

2 కవిత్రయ భాషకును నాటి శాసన భాషకును గల సామ్య వైషమ్యములను ప్రదర్శింపుము

3 తెలుగు శాసన భాష వ్యావహారిక మనుటలోని సామంజస్యమును పరిశీలింపుము

4 ఆధునికాంధ్ర భాషా స్వరూపమును విశదీకరింపుము

5 వ్యవహారికాంధ్ర భాషా స్వరూపమును విశదీకరింపుము

**B**

6 కవిత్రయ బిరుదములను వివరించి వారి శైలీ వైశిష్ట్యము నుగ్గడింపుము

7 శివకవుల సాహిత్య సేవను తెలుపుము.

8 ప్రబంధ లక్షణములను వివరించి ఏదేని యొక ప్రబంధముతో సమన్వయింపుము

9 ఆధునికాంధ్ర సాహిత్య లక్షణములను వ్రాయుము

0 ఈ క్రింది వానిలో మూడింటికి లఘు సమీక్షలను వ్రాయుము.

దిగంబర కవులు — 2 గుఱ్ఱం జాషువా

3 చివరకు మిగిలేది — 4 కన్యాశుల్కం

5 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

## APPSC
## G oup I Services B A (Hon ) s anda d
## Te ugu Language and L tera ure
## 1963

ఆర భాషలకును ద్రావిడ భాషలకును గల కుటుంబ భేదమును నిరూపించు నాలుగు ప్రధానోపపత్తులను సమగ్రముగా సోదాహరణముగా చర్చించునది

2 ద్రావిడ భాషలలో విభక్తులెన్ని యను విషయమును గూర్చి సమగ్రముగా చర్చించునది

3 ఆంధ్రము తెనుగు తెలుగు అను మాటల పుట్టుకను గూర్చి సమగ్రముగా వ్రాయునది

4 నన్నయ పూర్వము నగల భాషా లక్షణములలో గొన్నింటిని పేర్కొని యా భాషను నన్నయ ఎట్లు సంస్కరించెనో తెలుపునది

5 తెలుగులో భారత భాగవతములలో నేది విశేషముగా ప్రజల కాదరపాత్రమైనదో నిర్ణయించి దానికి గల కారణములను తెలుపునది

6 రంగనాథ రామాయణ కర్తృత్వమునుగూర్చి కల మత భేదములను తెలిపి యం దేమతము మీకు సమ్మతమో సోపపత్తికముగా నిరూపించునది

ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వర బిరుద మెంతవరకు తగియున్నదో నిర్ణయించునది

8 "ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో శ్రీనాథుని యుగము - సంధి యుగము" -దీనిని విమర్శించునది

9 శత వాఙ్మయ చరిత్రను దెలుపునది.

10 తెలుగు నవల యొక్క యావిర్భావ వికాసములను గూర్చి వ్రాయునది

భావ కవిత్వ మననేమో తెలిపి, మీకు నచ్చిన యొక భావ కవితా ప్రాశస్త్యము నగ్గడించునది

# A P P S C.

## G oup I Serv ces B A (Hon) Std
## Te ugu Language and L era ure
## 1965

ప్రాఙ్నన్నయ యుగమున వెనుకకు వెళ్ళిన కొలది తెనుగునకు ఇతర ద్రావిడ భాషలతో నెక్కువ సంబంధము గనబడుచున్నది. ఈ వాక్యార్థము నిరూపించునది

2 తెనుగునకు సంస్కృత భాషలతోగల సంబంధమెట్టిదో సోపపత్తికముగా నిరూపించునది

3 తెనుగు భాషలోని లోప విభక్తికములు శబ్ద పల్లవములు వీనిని గూర్చి భాషాశాస్త్ర సంబంధమైన వివరణము వ్రాయునది

4 ద్రావిడ సంఖ్యా వాచక చరిత్రను గూర్చి వ్రాయునది

5 నన్నెచోడ పాల్కురికి సోమనాథులలో నొకరి కాలము నిర్ధారించునది

6 ప్రబంధ మనగనేమి? ఆ వాఙ్మయ ప్రక్రియకు ముక్కు తిమ్మన, రామరాజ భూషణులు ఒనర్చిన సేవ యెట్టిది

7 తిక్కన పోతన నాచన సోమన- వీరిలో నొకరి వాఙ్మయ ప్రతిభా విశేషములను నిరూపించునది

8 ఆంధ్రమున గద్య సాహిత్య పరిణామమును దెల్పి దానికి వీరేశలింగంగారు కావించిన దోహదము నెన్నుము

9 ఆంధ్ర శతక వాఙ్మయ వికాసమును గూర్చి సంగ్రహముగ దెల్పి శతకము లెట్లు ప్రజాసాహిత్య పోషకములో పరిశీలించునది

తెలుగున అచ్చ తెనుగు కావ్యముల చరిత్రనుగాని, కావ్యముల చరిత్రనుగాని వివరించునది.

నేటి కాలపు కవిత్వమందలి గుణదోషములను విమర్శించునది

# A P P S C

## BA (Hon ) S d

## Te ugu Language & L e a ure

## Gr I

## 1966-67

ద్రావిడ భాషలో తెలుగనకు గం స్థానమును నిర్ణయించునది

2 భాషాశాస్త్ర దృష్టి ననుసరించి తెలుగు స ధిని పరిశీలించునది

8 ఆంధ్రము, తెలుగు తెనుగు అను శబ్దముల చరి తను వ్రాయునది

4 "ప్రథమ, ద్వితీయ షష్ఠి అవి మాత్రమే తెలుగునకు సహజములైన విభక్తులు తక్కినవి విభక్తులే కావు" ఈ విషయమును చర్చించి మీ నిర్ణయమును తెలుపునది

5 తూర్పు చాళుక్యుల సాహిత్య సేవ నగ్గని చునని

6 తెలుగు ద్విపద కావ్యముల పరిణామ వికాసములను వివరించునది

7 ప్రబంధమను నామమును నిర్వచించి ప్రబంధ కవులలో అల్లసాని పెద్దన స్థానమును నిర్ణయించునది

8 ఆంధ్ర సాహిత్య చరిత్రలో దక్షిణాంధ్ర సాహిత్యమునకు గల వైశిష్ట్యమును వివరించునది

9 తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు భాషా సాహిత్యమునకు గల వైశిష్ట్యమును సంగ్రహముగా విశదీకరించునది

0 తెలుగు నవల పరిణామములను విశదీకరించునది

"ఆధునిక యుగము వచన యుగము కవిత్వమునకిందు స్థానము లేదు" ఆధునిక సాహిత్యమును మనసులో నుంచుకొని ఆ వాక్యము యొక్క సామంజస్యమును పరిశీలించునది

## APPSC

### Group A (B A Standard)

### H s ory of Te ugu Language & L era u e & L terary Cr c m

### 1965-66

కవిత్రయమనగా నెవరు వారు రచించిన గ్రంథమును దాని ప్రాశస్త్యమును గూర్చి వ్రాయునది

లేదా

ఆంధ్ర పురాణములు ముఖ్య లక్షణములను శైలీ విశేషములను పేర్కొనునది

2 శివకవులన నెవరు వారిలో ముఖ్యులైన ఇద్దరిని గూర్చి చర్చించునది

లేదా

తెలుగు ద్విపద కావ్యములలో ప్రముఖమైన వానినిగూర్చి సంగ్రహముగా వ్రాయునది

3 ప్రబంధయుగము యొక్క ప్రాముఖ్యమేమి వీనిలో ఏ రసమునకు అగ్రస్థాన మీయబడెను? వివరించునది

లేదా

ఆధునిక కవిత్వమునకును పూర్వకవిత్వమునకు గల భేద సాదృశ్యములను చర్చించునది

4 ఈ క్రింది వానిలో నైదింటిని గూర్చి సంగ్రహ వివరము వ్రాయునది

దశకుమార చరిత్రము    2 పల్నాటి వీరచరిత్ర

3 మారన "    4 అనంతామాత్యుడు

5 కళాపూర్ణోదయము    6 విజయవిలాసము

7 పొన్నికంటి తెలగన    8 మొల్ల

9 కృష్ణపక్షము    0 కిన్నెరసాని పాట

ఆంధ్రము తెలుగు తెనుగు-శబ్దముల వ్యుత్పత్తులను ప్రయోగము లను వివరించునది తెలుగుభాష వికృతి యనుట యెంతవర కొప్పును?

లేదా

గిడుగు రామమూర్తి పంతులుగారి భాషావాద స్వరూపమును తెలిపి అది యెంతవరకు గ్రాహ్యమో సూచించునది

కావ్య పఠనము వలన ప్రయోజనములేమి ఉత్తమ కావ్య లక్షణము లెవ్వి

లేదా

కావ్యాత్మను గూర్చి మన ప్రాచీనులెట్లు భావించిరి? ఈ యంశ మున పాశ్చాత్యుల భావము లెట్టివి

APPSC

Gr II Serv ce (B A S d )

H tory of Te ugu Language L era ure and

L e ary Cnt c sm

1976

A temp S x que on TWO f om Group A

THREE f om Group B and ONE f om Group C

A

భాషలో మాండలిక భేదము లెట్లేర్పడును? తెలుగునందలి మాండ లిక భేదముల స్వరూపమును తెలుపునది.

లోప విభక్తికము లేర్పడిన విధము విరూపించునది

విశేషణముల స్వరూపములో సంస్కృతాంధ్రములకు భేదమేమి కృత్తద్ధితముల విషయమున తెనుగునకును ఇతర ద్రావిడభాషలతో గల సామ్యమును భేదమును తెలుపునది.

## B

తిక్కన పలికిన కవితాంశములను అతని కవితయందెట్లు నెం గొన్నవో పరిశీలించునది

2 దేశి భావ భేదములను వివరించునది

3 తెలుగు ప్రబంధము పరిణామ క్రమమును తెలుపునది

4 తెలుగు యక్షగానముల స్వరూపమును సూచించి, వాని చరిత్ర సమీక్షించునది

5 రాయప్రోలు విశ్వనాథ శ్రీశ్రీ - ఆధునికాంధ్ర కవిత్వమున వీరి వీరి నాయకత్వము లెట్టివి

6 ఏకాంకరూపకము స్వరూప ప్రయోజనములు తెలిపి తెనుగు నందవి యెంతవఱకు ప్రయోజనకారి యయినవో వివరించునది

## C

వస్తువు భావము రచన - వీనికి కవితలో ఉచిత స్థానములు వివరించునది

2 సాహిత్య విమర్శనమునకు ప్రయోజనములు తెలుపునది

## APPSC.

### History of Telugu Language and Literature and Literary Criticism

### Group I - 1978

### Group - A

తెలుగులో అన్యదేశ్యములు ప్రవేశించిన హేతువులు వివరింపుడు.

తెలుగు సంఖ్యా వాచకముల స్వరూపమును చర్చింపుడు

### Group - B

తిక్కన కవితయందు విశిష్టములైన లక్షణము లేవి ?

4 తెనుగున మార్గ దేశి కవితల సంబంధ బాంధవములను దెలుపునది

5 తెలుగున స్వతంత్ర ప్రబంధముల అవతరణమును వాని లక్షణములను ముచ్చటించునది

6 ఆంధ్ర వచన వాఙ్మయము నందలి పరిణామ క్రమమును దెలుపుడు

7 తెలుగు వాఙ్మయమున వీరేశలింగము కొనివచ్చిన క్రొత్తలను సంగ్రహమున దెలుపునది

० తెలుగు వ్యాస వాఙ్మయమును పరామర్శింపుడు

**Group - C**

9 జానపద సాహిత్యమునకును ప్రౌఢ సాహిత్యమునకును ఉండు భేదములను పరస్పర సంబంధములను వివరించునది

10. సాహిత్య విమర్శనమును గూర్చిన వేర్వేరు సిద్ధాంతములను చర్చించునది

## A P P S C

**Te ugu Language and L era ure**

**Group I Serv ces 1980**

**An wer f ve quest ons e ec ons**

**not ess than 2 from each part**

మన భాషకు గల తెనుగు తెలుగు ఆంధ్రము అనే పేర్లను చారిత్రకంగా పరిశీలించండి

నన్నయకు ముందు వెలసిన తెలుగు భాషా స్వరూపాన్ని వివరించండి

3 తెలుగు లిపి పరిణామాన్ని గురించి లేదా తెలుగు లిపి సంస్కర ణావశ్యకతను గురించి వ్రాయండి

4 తెలుగు భాషా పదజాలాన్ని ఎన్ని విధాల వర్గీకరింప వచ్చునో సోదాహరణంగా తెలపండి

5 తెలుగులో జరిగే ఆగమ ఆదేశ సంధుల్ని ఉదాహరణంతో వివరించండి

6 కవిత్రయ మనువదించిన మహాభారతము నందలి రచనా శిల్పాన్ని సంగ్రహంగా తెల్పండి

7 మార్గ దేశి పురాణము ప్రబంధము శతకము యక్షగానము ఉదాహరణము - వీటిలో నాలుగింటిని వివరించండి

8 శ్రీనాథుని కృతుల్ని పేర్కొని వాటిలో మీ కిష్టమైన ఒక గ్రంథాన్ని గురించి వ్రాయండి

9 భావ కవిత్వము అభ్యుదయ కవిత్వము విప్లవ కవిత్వము - వీటి స్వరూప లక్షణాలను తెలిపి మీకు నచ్చిన ఒక ఆధునిక కవి రచనలను పరిచయం చేయండి

0 నవల కథానిక నాటిక వ్యాసము - వీటిలో రెండింటిని మాత్రం గ్రహించి ఆ ప్రక్రియ స్వరూప పరిమాణాన్ని వివరించండి

## APPSC

## Group I I Serv ce

## 1968 - 69

## TELUGU

తంజావూరు నాయక రాజులనాటి తెలుగు సారస్వతమును గూర్చి వ్రాయుమది

2 ఏదేని ఒక ప్రాచీనాంధ్ర కావ్యము నుండి ఒక పద్యమును వ్రాసి అర్థ తాత్పర్యమును భావ సందర్భమును విశదీకరించ ది

3 సంధి అనగా నేమి? తెనుగులోని అత్వ ఇత్వ ఉత్వ సంధులను సోదాహరణముగా వివరించునది

4 సాహిత్య విమర్శ యనగానేమి ఉత్తమ విమర్శకు ఉండవలసిన లక్షణములను పేర్కొని నేటి సాహిత్య విమర్శ తీరులను పరిశీలించునది

5 మీకు నచ్చిన ఏదేని ఒక నవాంధ్ర కావ్యమును గూర్చి సోదాహరణముగా విమర్శించునది

6 కత్తి కంటె కలము గొప్పది - విపులముగా చర్చించునది

7 ప్రచారము, ప్రబోధము జరుగుటకు కావ నాటకములలో ఏవి ఉత్తమ సాధనమో సోదాహరణముగా వివరించునది

8 భాషాప్రయుక్త రాష్ట్రములు భారత జాతి యైక్యతకు ఎంతవరకు తోడ్పడినవో విశదీకరించుము

## IAS 98

### General Te ugu

• క్రింది వాటిలో ఒక్క విషయాన్ని గూర్చి 500 పదాలలో వ్యాసం వ్రాయండి

) అణ్వాయుధాలు - ప్రపంచ భవిష్యత్తు

2) కులవ్యవస్థ సామాజిక సమైక త కొరకు ఆటంకం

3) అడవుల పెంపకం యొక్క ప్రాముఖ్యత

4) ఉన్నత విద్య - ప్రాంతీయ భాషా మాధ్యమంలో విద్యాబోధన

5) నా జీవితంలో మరువరాని రోజు

2 ఈ క్రింది పదాలను మీ స్వంత వాక్యాలలో ఉపయోగించండి

a) ఉద్దండుడు f) గాడిద చాకిరి

b) ఉలకదంపుడు g) దుబుకైన

c) అరచేతిలో వైకుంఠం h) బెట్టాపట్టాలు

d) కలుపుగోలు ) వగలమారి

e) కాయకష్టము j బెయ్యి తిరిగిన

3 ఈ క్రింది పదాలకు ఒకొక్కదానికి ఒక్క సమానమైన అర్థం వచ్చే పదాన్ని వ్రాయండి

a) వనిత b) కీర్తి c) పటము d) అంబరము e) కటిరము f కేశము g) శోకము h) చూపు ) కష్టము j హస్తము k) అర్థము ) దశము m శశి n) శిరము o) వేల్పు p) కత్తుక q దాహము r రక్తము ) పండితుడు ) కంఠ

## LECTURERS N DEGREE COLLEGES
## 1983
### Telugu - Paper I

T me ¿½ h Max Marks 20(

Instructions o Cand da e

Attemp a he three (8) parts n he paper

2 Separa e ns ruc ons are g ven for each par and hese shou d be scrupu osu y fo lowed

8 Answer all ques ons of one part a one

4 Do not a tempt more than the requ red numbe of questions unde each part

5 Adhere s rict y to the word

## PART I

క్రింది వానిలో ఆరింటిని గురించి - ఒక్కొక్క దానిని గురించి 50 మాటలకు మించకుండునట్లు - వివరణము వ్రాయునది

6 × 10 = 60

1 ఇతిహాసము 2 పురాణము 3 ప్రబంధము 4 శతకము
5 యక్షగానము 6 చారిత్రక కావ్యము 7 కథానిక 8 ఏకాంకిక
9 వ్యాసము 0 జానపదగేయములు

## PART II

ఈ క్రింది ప్రశ్నలలో మూడింటికి సమాధానములు వ్రాయునది ఒక్కొక్క సమాధానము 400 మాటలకంటె మించి యుండరాదు

3 × 30 = 90

2 నన్నయ కవితాగుణములను సోదాహరణముగా వివరించునది
3 శైవకవుల దేశికవితా ప్రక్రియలను పరిచయము చేయునది
4 శ్రీనాథ పోతనల కవితా స్వభావములలో గల భేదసాదృశ్యములను పేర్కొనునది
5 వేమన తన సమకాలీన సమాజ పరిస్థితులపై కవితా ముఖమున వెలువరించిన వ్యాఖ్యావిశేషముల నెఱిగించునది
6 ఆంధ్ర సాహిత్యమున ప్రవర్తిల్లిన భావకవితోద్యమమును సంగ్రహముగా సమీక్షించునది

## PART I I

క్రిందివానిలో నొకదానిని గురించి 800 మాటలకు మించని సవిమర్శక వ్యాసమును సంతరించునది 50

7 ప్రబంధయుగ మాంధ్ర సాహిత్య చరిత్రలో స్వర్ణయుగము.
8 ఆంధ్ర సాహిత్యముపై ఆంగ్ల ప్రభావము
9 ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలలో ప్రతిబింబించిన సామాజిక స్పృహ

# LECTURERS IN DEGREE COLLEGE

988

## TELUGU-PAPER II

T me 2½ Hours Max Marks 200

### Instruct ons to Cand dates

1 At empt a the three (3) parts n the paper

2 Seperate ns ruct ons are g ven for each part and these shou d be scrupu ous y fo owed

3 Answer a l quest ons of one part at one p ace

4 Do not at empt more than the requ red number of quest ons under each part

5 Adhere str ct y to the word m t

### PART I

Wr te cr t cal notes on any s x of the fo ow ng ten each shou d not exceed 50 words 6×10 = 60

తెలుగునకు గల వ్యాకరణ దీపము చిన్నం

2 వ్యాకరణ మొక త్రోవ మహాకవులొక త్రోవ

3 బాల వ్యాకరణమే నిజమైన ప్రౌఢ వ్యాకరణము.

4 చిన్నయసూరి సూత్ర రచనా ప్రజ్ఞ

5 ప్రౌఢ వ్యాకరణము బాల వ్యాకరణమునకు పరిశిష్ట గ్రంథము

6 ఛందస్సునకును కవిత్వమునకును గల అనుబంధము

7 ఆంధ్ర సాహిత్య ప్రస్థానంలో ఛందో విషయమున ప్రత్యేకతను ప్రదర్శించిన వారి కృషియొక్క కృతార్థత

4 సాహిత్య విమర్శ యందు ప్రాచ్య పాశ్చాత్య ద్రష్టుల అభిప్రాయము లందుగల భేద సాదృశ్యములం గూర్చి చర్చింపుము

5 "శ్రావ్యమైన శబ్దము రమ్యమైన అర్థమును, హృద్యమైన అనుభూతిగా పరిణమింపజేయునదే కవిత్వము" అనునది ఆధునికము ప్రాచ్య పాశ్చాత్య ప్రాచీన నవీన సర్వ నిర్వచనముల సారభూతమైన సత్యము అను పక్షము నిర్ధరింపుము.

6 దశవిధ లక్షణముల స్వరూపమును సోదాహరణముగ వివరింపుము

7 హితోపదేశ గ్రంథమునకు ఆ పేరెట్లు అన్వర్థమగునో విచారించునది

8 కా దాసు కవితా తత్త్వమును సోదాహరణముగ అభినందించునది

## JUN OR LECTURERS 988

## TELUGU (F rs Paper)

T me 2 Hours Max Mark 200

n ruc ion o he cand date

1. A temp a the hree (3) parts n he paper
2. Separate nstruc ns are g ven for each part and he e hou d be crupulou y fo owed
3. Answer al question of one part at one p ace
4. Do no attempt more han he equired number of question und each part.
5. Adhere st ict y to the word mit.

## PART

ఈ క్రింది పదిండిలో ఆరింటి విమర్శనాత్మక వ్యాఖ్యలను వ్రాయండి ఒక్కొక్కటి 50 పదాలకు మించరాదు

6× 0 = 60

నన్నయ అక్షర రమ్యత

2 ద్విపద సాహిత్యం

3 ప్రబంధ లక్షణాలు

4. పద కవిత్వం

5 దక్షిణాంధ్ర యుగ కవయిత్రులు

6 తెలుగులో ఏకాంకలు

7 భావ కవిత్వ వికాసానికి రాయప్రోలు సేవ

8 చిలకమర్తి నవలలు

9 దువ్వూరి రామిరెడ్డిగారు సృష్టించిన కృషీవలం జీవితం

0. దిగంబర కవిత్వం

## PART

ఈ క్రింది ఐదింటిలో మూడింటికి సమాధానాలు వ్రాయండి ఒక్కొక్క సమాధానం 400 పదాలకు మించరాదు

3×30 = 90

1. తిక్కన మహాకవి భారతంలో నెరపిన నాటకీయ శైలీ విన్యాసాన్ని విపులీకరించండి

2. నన్నెచోడుని కుమార సంభవం "తొలి తెలుగు ప్రబంధ" మని చెప్పటం ఎంతవరకు సమంజసం

అంధ్ర సాహిత్యంలో రాయల కాలం సువర్ణయుగ మనడం ఎంతవరకు సమర్థనీయమో వివరించండి

4 వీరేశలింగం పంతులుగారు సాహిత ం ద్వారా సాధించిన సామాజిక పగతిని తెలపండి

5 తెలుగులో అభు దయ కవిత్వ ఆవిర్భావ వికాసాలను గురించి చర్చించండి

PART

ఈ క్రి ది మూడి టిలో ఒక్కదానికి సమాధానం వ్రాయండి సమాధానం 800 పదాలకు మి చరాదు 50

"పోతన శృంగారం – శ్రీనాథుని భ క్తి ఉ తమ సాహిత లక్షణాలు" చర్చించండి

2 "వేమన తన యుగ పురోగామి – వేమన ఒక తిరుగుబాటు కవి- వేమన తెలుగు కవులందరిలోను ప్రజాభిమానమును పొందిన లోక కవి" విపులీకరించండి

8 "వ క్తి చై తన ముతోపాటు సంఘ చై తన మును సమానాధికార ముతో ప్రవచించిన ప్రవ క్త శ్రీశ్రీ" ఈ వాకా ర్థాన్ని విమరి ంచండి

JUN OR LECTURERS 988

TELUGU (Second Pape )

T me 2½ Hou Max Mark 200

ns ruc on o he Cand da e

Att mp a he hree (8) Pa n he Paper

2 An we a quest on of one Part a one p ace

8 Do no att mp more han he requ d number of que on und each Part

4 Adhere trictly o the wo d limi

5 + Let you an were b e he n గ్రాంథిక o n
ష్టవా వహారిక

## PART - I

ఈ క్రింది పదింటిలో ఆరింటిని గురించి ఒక్కొక్కటి 50
పదాలకు మించకుండా వా ఖ్యా ని చండి 6 × 0 = 0

యతి ప్రాసల లక్షణ స్వరూపాన్ని వివరించండి

ఈ క్రింది సూత్రాల్లో నాలుగింటికి లఘు వా ఖ్య ను వాయండి
ఎ దంత తాలవ్య ంబులయిన చజలు సవర్ణంబులు
బి ఇగౌరాయుగంతంబుల ప్రధమైక ఒచన బునకు లోప బగు
స అధికరణ బునకు సప్తమి యగు
డి కోట పేటలు వైకృతములు
ఇ) ఇ్రవత్యయాంతా వ యుంబునకు స ధియు జూపెట్టెడి
ఎఫ్ ఒశ్వకర్మ దనియు రూప బు

ఈ కింది ఫాషిని పదాల్లో వాలుగి టిని వివరి చండి
ఎ అవసానమ్
బి) ప్రతా హార
సి శబ్ద పల్లవము
డి) జెపవిభ_కము
ఇ ద్రుతము
ఎఫ్ తాలవ్యీకరణము
జి అర్థవా కోచము
హెచ్ శాంతరసము

4 ఈ క్రింది ఆరింటిలో నాలుగింటికి సంధి విశేషాలు తెల్పండి

ఎ చిన్మయమ్

బి విష్ణూదయ

సి వాఁఖిర్ప

డి ఉపైరి

ఇ కృష్ణర్ధి

ఎఫ్ అనో నమ్

5 ధ్వని Phon వర్ణము Phon m వీటికి గల పరస్పర సంబంధాన్ని తెల్పండి

6 తెలుగు మాండలిక భేదాలను సోదాహరణంగా

7 తెలుగు భాషా చరిత్రలో శాసన భాషకు గల ప్రాముఖ్యాన్ని వివరించండి

8 రససిద్ధాంతాన్ని గురించి సంగ్రహంగా వ్రాయండి

9 నా దాసు కవితాసౌందర్యాన్ని తెల్పండి

0 ఈ క్రింది సంస్కృత గద్యాన్ని ఆంధ్రీకరించండి

అస్తిమగధదేశే చమ్పకవతీ నామారణ్యాని తస్యాం చిరాన్మహతా స్నేహేవ మృగకాకౌ నివసతః సచమృగ స్వేచ్ఛయాభ్రామన్ హృష్టపుష్టాఙ్గ కనచిత్ సృగాలే నావలో కి తం దృష్ట్వా సృగాలోచిన్తయత్ ఆ కథమేతన్మాంసం సులలిత భక్షయామి భవతు విశ్వాసం తావదుతా దయామి ఇతా లోచో ప స్మృతా బ్రవీత్మిత్ర కుశలంతే మృగేణోక్తం కస్త్వమ్ స బ్రూతే క్షుద్ర బుద్ధి నామాజమ్బుకోహమ్ అత్రారణ్యే బన్ధుహీనోమృత వన్నివ సామి ఇదానం త్వాం మిత్రమా సాద వన సబన్ధుః జీవలోకం ప్రవిష్టోస్మి

**PART - I**

II ఈ క్రింది అయిదింటిలో మూడింటికి 400 పదాలకు మించని సమాధానాలు వ్రాయండి 8 X 80 = 90

తెన గు తెలు గు ఆంధ్రము ఈ పదాల చరిత్రను వివరించండి

2 తెలుగులో అర్థ విపరిణామాన్ని సోదాహరణంగా వివరించండి

8 బాల వ్యాకరణానికి ప్రౌఢ వ్యాకరణం పూరణాత్మకము పరి
శీలించండి

4 భావ స్వరూప నిర్ణయ విషయంలో ప్రాచ్య పాశ్చాత్యుల వైఖరులను
పరామర్శించండి

5 ద్రావిడ భాషలను పేర్కొని వాటి ప్రత్యేక లక్షణాలను వివరించండి

PART

ఈ క్రింది వాటిలో ఒకదాన్ని గురించి 600 పదాలకు మించని
వ్యాసాన్ని వ్రాయండి ×50 = 50

యుగ మనగా నేమి ఆంధ్ర సాహిత్య చరిత్రను ఎన్ని యుగాలుగా
విభజింపవచ్చును ఆయా యుగాల్లోని సాహిత్య ప్రధాన లక్షణా
లేవి

2 విమర్శ అనగా నేమి ప్రాచ్య పాశ్చాత్య విమర్శ పద్ధతులను
తెలిపి వాటి వలన ప్రయోజనాలను వివరించండి

8 ఆధునిక వ్యావహారిక భాష ఆధునిక గ్రాంథిక భాష ప్రాచీన
కావ్య భాష - వీటి అన్యోన్య సంబంధాన్ని చారిత్రక దృష్టితో
పరిశీలించండి

## TELUGU LANGUAGE AND L TERATURE

## G oup - 1982

సమయము 8 గంటలు మార్కులు C0

గమనిక - ( ) క్రింది వాటిలో ఏ అయిదు ప్రశ్నలకైనా సమాధానములు
వ్రాయండి

2 అన్ని ప్రశ్నలకు మార్కులు సమానం

(8) మీ సమాధానాలను శిష్ట వ్యావహారికంలోగాని గ్రాంథిక
శైలిలోగాని వ్రాయవచ్చు

క్రింది పదా నికి సవిమర్శక వా ఖ్య వ్రాయండి
నుతజల పూరితంబులగు నూతులు నూటిటికంటె సూన్నృత
వ్రత యొకబావిమేలు మఱిబావులు నూటిటికంటె నొక్క స
త్క్రతువదిమేలు తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలుత
త్సుత శతకంబుకంటె నొక సూన్నృత వాక మమేలుసూతు గన్
2 నన్నయకు పూర్వము తెలుగులో కావ సాహిత ం ఉన్నదా లేదా మీ అభిప్రాయాన్ని సహేతుకంగా వివరించండి
3 వకవులెవరు వారి కావ్యా లలో కనిపించే ప్రతే క లక్షణాలేవి
4 నన్నెచోడుని కుమారసంభవము ప్రథమాంధ్ర ప్రబంధము - ఈ అభిప్రాయాన్ని పరామర్శించండి
5 తిక్కన భారతానువాద విధానమును లేదా తిక్కన కవితా ల్ప మును సంగ్రహముగా తెల్పండి
6 శ్రీనాథుడు రచించిన కృతులెన్ని వాటిలో మీకు నచ్చిన ఒక రచనలోని విశేషాలను వివరించ డి
7 శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రభాషా సాహిత ములకు చేసిన సేవ యెటిదో తెలప డి
8 అల్లసాని పెద్దన నంది తిమ్మన రామరాజభూషణుడు ఎంగటి సూరన వీరిలో ఒక్కరిని గ్రహించి తెలుగు సాహిత ంలో ఆ కవి స్థానాన్ని తెలపండి

## H STORY OF TELUGU LANGUAGE - LITERATURE AND L TERARY CR T C SM

### G oup - 1982

T me Three Hour Max Ma k 00

Note F VE quest on hou d be an w red ONE f om G oup A THREE from G oup B and ONE om G oup C Extra an w a he end w be gno ed
2 Each que ion carr e Tw nty ma k

## Group - A

ఆంధ్రము తెనుగు తెలుగు-ఈ మూడు పదాల పుట్టుపూర్వోత్తరాలను గురించి రూపనిష్పత్తిని గురించి పరస్పర సంబంధాన్ని సంగ్రహంగా తెలియపరచండి

2 తెలుగు భాష ద్రావిడభాషా కుటుంబానికి సంబంధించినది కొన్ని ముఖ్యమైన ఉపపత్తులను చూపుస్తూ సమర్థించండి

## Group - B

3 శతక సామాన్య లక్షణాలను పేర్కొని తెలుగులో వెలసిన వివిధ శతక శాఖలను పరిచయము చేయండి

4 కందుకూరి వీరేశలింగం పంతులుగారు నవ్యాంధ్ర సాహిత్య పునరుజ్జీవనానికి చేసిన సేవను పేర్కొనండి

5 ఆధునికాంధ్ర సాహిత్య యుగవైతాళికునిగా గురజాడ అప్పారావు గారిని పరిచయం చేయండి

6 తెలుగులో విస్తరిల్లిన భావకవిత్వ శాఖలను పేర్కొని, వాటిలోని ఒక శాఖలో జరిగిన ప్రసిద్ధ ప్రయోగాలను సమీక్షించండి

7 అభ్యుదయ కవిత్వ యుగకర్తగా శ్రీశ్రీ నిర్వహించిన పాత్రను వివేచించండి

8 ఉత్తమ సాంఘిక నవలకుండదగిన లక్షణాలను పేర్కొని, మీరు చదివిన ఏదయినా ఒక మంచి తెలుగు నవలకవి యెంతవరకు వర్తిస్తాయో అన్వయించండి

## Group - C

9 లలితకళల్లో కవిత ఉత్తమమైందని సోపపత్తికంగా నిరూపించండి

10 ఉత్తమ సాహిత్య విమర్శకునికి ఉండవలసిన లక్షణాలను వివేచించండి.

## Group A

## 1983

## TELUGU L TERATURE

T me ° Hou Ma k 00

### NSTRUCTIONS TO CAND DATES

A mp a he hree 8 part n he pape

2 An we a qu st on o one part a one p ace

8 Do no a temp mo e han he qu d numbe of qu on und each pa

4 Adh re c y to he wo d m

వ భాగము

క్రింది వానిలో ఐదింటి 5 ఇరువదియైదు పంక్తులకు మించని సమాధానములు వ్రాయునది 00 పదములు $6 \times 6 = 80$

చిన్నయసూరి ఆంధ్రభాషకు చేసిన సేవను గూర్చి సమగ్రముగా వ్రాయునది

2 వీరేశలింగం పంతులుగారికి "గద కవి బ్రహ్మ" యను బిరుదు ఎట్లు తగియున్నదో వివరించునది

8 వీరేశలింగంగారి ప్రహసనముల గూర్చి వ్రాయునది

4 చిలకమర్తి లక్ష్మీనరసింహం గారికి ఆంధ్ర స్కాటు అను పేరు ఎట్లు తగియున్నదో వారి నాటకముల నాధారముగ వ్రాయునది

5) మొక్కపాటి వారు చేసిన భాషాసేవ వారి గ్రంథముల నాధారముగా వ్రాయునది

6 పానుగంటి వారు రచించిన సాక్షి నాధారముగ నాటి కాలపు సాంఘిక పరిస్థితుల వర్ణించునది

7 గురజాడ వారి గద రచన స్వాభావికము అందరికిని అందు బాటులో నుండును అనుటను వారి కావ ముల ద్వారా వెల్ల డించునది

8 చలంగారి సాహిత ము ప్రజలలో ఒక మార్పు తెచ్చినదనుటను వారి రచనల మూలమున వ క్తము చేయుడు

9) వ్యావహారిక భాషా ప్రయోగముల విషయమై గిడుగువారి యభి ప్రాయములను విశదీకరి చునది

2 వ భాగము

ఈ క్రింది వానిలో రెండింటికి మాత్రము రెండు పుటలకు మి చని సమాధానములు వ్రాయునది 200 పదములు $2 \times 20 = 40$

మంజువాణి పాత్రనుగూ చ్గాని గిరీశం పాత్రనుగూర్చిగాని వ్రాయునది

2 యుగం ర మం తి రాజనీతిని గూర్చి వ్రాయునది

3) పా ఠవోదో గము నందు తిరుపతి వారు కనబరచిన నాట కీయతను నగ్గడి చునది

4 నవలయననేమో నిర్వచించి అది ఏకవీర లో నెంతవరకు సరిపోవుచున్నదో వివరి చు ది

5 చివరకు మిగిలేది మన స్తత్వ శాస్త్రపరమైన నవల చర్చించు నది

6) ఎతారామయ పీద ఖాని మామ పభావము

3 వ భాగము

ఈ క్రింది వానిలో ఒకదానికి మా తము మూడు పుటలకు మించని వా సమును వ్రాయునది 800 పదములు) 80 మార్కులు సమాజమునకును కవి గల సన్నిహిత సంబంధమును గూరిచ వ్రాయునది

2 కవిత్వమనగానేమో నిర్వచించి ఎటువంటి కావ ములు సార్వజని నకములు నుడువునది

3 కావ ములలో అలంకారములలో ప్రాముఖ మును గూర్చి చర్చిం చునది

లేదా

ఉపమ రూపకము మొదలయిన అలంకారముల లక్షణములను సోదాహరణముగా వివరించునది

4 రసము నట నిష్ఠమా లేక సామాజిక నిష్ఠమా చర్చించునది

Te ugu Languag and L a ure Gr

Serv c B A S andard & G Serv c

B A Hon S d

## Guess Paper

ద్రావిడ భాషలనగా నేవో తెలిపి వాని గల పరస్పర స బంధ మును తెలుపుము

2 తెనుగు తెలుగు ఆంధ్రము అను పేర్ల చరిత్రను వివరింపుము

3 ఒకటి మొదలు పదివరకు గల సంఖ్యా వాచకముల చరిత్రను వివ రింపుము

4 తిక్కన కవితా ల్పము ను వర్ణించుము

5 దక్షిణాంధ్ర రాజులు తెలుగునకు చేసిన సేవ ఎట్టిది

6 శ్రీనాథునికి తెలుగున గల స్థానమెట్టిది

7 ఆముక్తమాల ద కర్తృత్వముపై వివాదములెట్టివి

8 నన్నయకు ముందు తెలుగునకు గల రూపమెట్టి నన్నయ ఎట్లు దానిని సంస్కరించెను

9 తెలుగున మార్గ దే కవితల సంబంధ బాంధవ్యము లెట్టివి

0 ప్రబంధములకు తెలుగున గల స్థానమెట్టిది

జానపద గేయ లక్షణములను వివరించి తీరు తీరు గేయములను వివరింపుము

తెలుగు పదల పరిణామ వికాసములను తెలుపునది

భాషా దృష్టి ననుసరించి తెలుగు సంధిని పరి శీలించునది.

"ప్రథమ ద్వితీయ షష్ఠి ఇవి మాత్రమే తెలుగునకు సహజము లైన విభక్తులు తక్కినవి విభక్తులే కావు" - ఈ విషయమును చర్చించి మీ నిర్ణయములు తెలుపునది

శతకవాఙ్మయ చరిత్రను తెలుపునది

ఆధునిక రంగమున తెలుగు భాష చేసిన నాటకములను సమీక్షించునది

ఆంధ్ర వాఙ్మయము నెన్ని యుగములుగా విభజింప నగునో వివరించునది

వాఙ్మయము సారస్వతము సాహిత్యము అను సంజ్ఞాత్రయపు టర్థ పరిమితులను విశదీకరించుము

భాషా కుటుంబములను నిర్ణయించునపుడు పాటించ దగిన యుపకారాపకారములను దెల్పునది

క్రిందివాటిపై సంగ్రహ చరిత్రమును వ్రాయుము

) నన్నెచోడుని కుమార సంభవము 2 విజయ విలాసము వేమన పద ములు 4) యక్షగానములు 5 క్రీడాభిరామము, సిద్ధేశ్వర చరిత్ర 7) పాండురంగ మాహాత్మ్య ము 8 వాల్మీకి చరిత్ర నంది మల్లయ ఘంట సింగన 0 శృంగార శాకుంతలము పండితారాధ్యుడు 2) మొల్ల రామాయణము 3) కనా కుల్కా మహ కవిత్రయము వారి బిరుదములకెట్లు తగియున్నారు



Cover Printed at Nandini

